## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050016307

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ప్రాయశ్చిత్తము

రవీంద్రనాథ ఠాకూర్



విశ్వభారతి
చెన్నపురి ఏజన్సీ
3-23 తిరువత్తూరు హైరోడ్
చెన్నపురి

# ప్రాయశ్చిత్తము

## మొదటి పరిచ్ఛేదము

---

అర్ధరాత్రి వేళ. వేసవికాలము. మచ్చునకైనను గాలి లేదు. ఏచెట్టునను ఆకులు కదలుట లేదు. యశోహారపురపు యువరాజు, ప్రతాపాదిత్యుని జ్యేష్ఠపుత్రుఁడైన ఉదయాదిత్యుఁడు, తన పడకగది కిటికీలోఁ గూర్చుండియుండెను. అతని ప్రక్కను అతని భార్య సురమ నిలిచియుండెను.

సురమ, "నాథా, సహించియుండుము, ఓర్మి వహింపవలెను. మంచిరోజులు ఎప్పటికైనను వచ్చితీరును," అనెను.

ఉదయాదిత్యుఁడు ఈవిధముగఁ బ్రత్యుత్తరమిచ్చెను, "నాకు వేఱుసుఖమేదియు నక్కఱలేదు; నేను కోరినదంతయు నీ రాజమందిరమందు జన్మింపకపోయి యుండవలసినదనియు; నేను యువరాజనై పుట్టియుండక పోవలసినదనియు; యశోహారపురనివాసులలో సామాన్యసంసారులలో నతిసామాన్యుఁడనై పుట్టియుండవలసినదనియు; యశోహారపురాధిపతికి జ్యేష్ఠపుత్రుఁడనై, ఆయన ధనమానములకును, యశఃప్రభావములకును, ఏకమాత్రుఁడైన ఉత్తరాధికారినై యుండకపోవల-

సినదనియు; నాజీవితములో గతించిన దీనినంతయు మార్పఁగల తపస్సేదైనను గలదా?"

సురమ బహు విచారముతో నతనికుడిచేతిని తన రెండుచేతులతోఁ బట్టుకొని యతనివైపు చూచుచు మెల్ల-మెల్లఁగ నిట్టూర్పు విడిచెను యువరాజుకోరిక నెఱవేర్పుటకుఁ దనప్రాణమును సులభముగ ధారపోయఁగలదు. కాని ప్రాణము నిచ్చియైనను భర్తకోరికను నెరవేర్పలేకపోవుటయే ఆమె దుఃఖమునకుఁ గారణము.

"నాకు సుఖము లేకపోవుటకుఁ గారణము నేను రాజా-లింటఁ బుట్టుటయే సురమా!" అని యువరాజనెను. "రాజా-లిండ్లయందుఁబుట్టువారు ఉత్తరాధికారులే, బిడ్డలు కారు. నేను ఆయన రాజ్యమును, పేరుప్రతిష్ఠలను నిలువఁబెట్టుకొనఁగలనో లేనో యని మాతండ్రి నన్ను చిన్నప్పటినుండియుఁ బరీక్ష-చేయుచుండెను. నేను రాజ్యభారమును వహించుచు, వంశ-కీర్తిని ప్రజ్వలింపఁజేయఁగలనో లేనో యని యాయనభయము. నేను చేయు నొక్కొక్క చిన్నపనియును ఆయన పరీక్షా-దృష్టితోఁ గనిపెట్టుచుండెను. వాత్సల్యదృష్టితోఁగాదు. బంధు-వర్గమువారును, మంత్రివర్గమువారును, రాజసభాసద్గణము వారును, ప్రజలును, నేను చేయుచిన్న చిన్న పనులను, నేనాడు చిన్నచిన్న మాటలను, బహుజాగ్రత్తతోఁ బరిశీలించి చూచి నా భవిష్యత్తు నూహించుచుండిరి. ఇట్టి యాపత్సమయమున

రాజ్యమును గాపాడుశక్తి నాకు లేదని వారందరి యభిప్రా-యము నేను చేతకాని పెద్దమ్మనఁట, నా కేమియు బోధపడ-దఁట! అందఱును నన్నుఁ దూలనాడుచుందురు, నాన్న నన్ను జూచి యేవగించుకొనును. నాన్న నాయాశ పూర్తిగావదలు-కొనెను"

సురమ కనుల నీళ్లు పెట్టుకొని, "అహా! ఎట్టిది వారి-మనస్సు! వా రెట్లారీతి ననుకొనఁగలిగిరి?" అని యనెను. సురమకు దుఃఖమువచ్చి, కోపముతో నన్నది, "మీ కేమియు బోధపడదన్న వారికంటె బోధపరచుకొనలేనివా రెవరుండఁ-గలరు?"

ఉదయాదిత్యుఁడు చిఱునవ్వు నవ్వి, సురమ బుగ్గలను దనచేతితో నొక్కుచు కోపమువలన నెఱ్ఱనై యున్న సురమ ముఖము నతిముద్దుతో మెల్లఁగ కదలించెను. మఱల నతిత్వరలో మొదటివలె గంభీరభావము ధరించి యిట్లనెను.

"అవును సురమా, రాజ్యపరిపాలనకుఁ గావలసినశక్తి నాలో లేకపోవుట నిజమే—ఆపరీక్ష అయినది. నేను బదునా-లేండ్లవాఁడనై యున్నప్పుడు నాకు రాజ్యపరిపాలన నేర్పవలెనని యుద్దేశించి, మహారాజుగారు హుసేన్‌ఖాలీ పరగణాపాలన నా కొప్పఁజెప్పిరి. ఆఱుమాసములైనను బూర్తి కాకపూర్వమె గొప్ప చిక్కులు ప్రారంభించినవి. రాఁబడి తగ్గిపోయినది. ప్రజలు నన్నాశీర్వదింప మొదలు పెట్టిరి. ఉద్యోగస్థులు

మహారాజుగారియొద్దకుఁ బోయి నాపై ఫిర్యాదుచేయ నారంభించిరి. యువరాజుగారు ప్రజల కింతప్రియుఁడగుట చూచి వారు రాజ్యపరిపాలనకుఁ బనికిరానివారని నిర్ధారణచేయ వలెనని రాజసభాసదులందఱును నభిప్రాయపడిరి. అప్పటినుండి మహారాజుగారు నాపై నెన్నఁడును మనస్ఫూర్తిగాఁ జూడనైనను లేదు. నేను వంశమునకుఁ గళంకమనియు, ఆయన పినతండ్రియైన వసంతరాయలవలె వీణవాయించుకొని నాట్యముచేయుచుఁ దిరుగుచుందుననియు, రాజ్య మధోగతిపాలౌననియు మహారాజుగా రనుచుండిరి."

"సహించి యుండుము, ప్రియతమా ఓర్మి వదలకుము." అని సురమ యనెను. "ఏమైనను ఆయన నీ తండ్రియే కదా! ఇప్పుడాయనమనస్సు రాజ్యాభివృద్ధివాంఛతో నిండియున్నది. ఆయనహృదయమునఁ బ్రేమకు స్థానము లేదు. ఆయన రాజ్య మభివృద్ధి చెందినకొలఁది ఆయనప్రేమ యధికమగుచుండును."

"సురమా, నీబుద్ధి తీక్ష్ణమైనది; నీవు దీర్ఘదృష్టికలదానవు, కాని ఈవిషయమునమాత్రము సరిగఁ దెలిసికొనలేకున్నావు. ఆశకు మితిలేదు. రాజ్యము పెద్దదగుచున్నకొలఁది ఆరాజ్యము పోవునేమోయని నాన్నకు భయముకూడ నధికమగుచుండును, రాజ్యభారము హెచ్చగుచున్నకొలఁది నే నెందుకును పనికిరానని యాయనకుఁ గలయభిప్రాయము దృఢపడుచుండును."

సురమ కిది బోధపడకపోలేదు. కాని ఆశమాత్రము మఱియొకవిధముగ నుండెను. మన యాశ బుద్ధికి లోఁబడి యెల్లప్పుడును ఉండదుకదా! 'నామనస్సు కోరినట్లేల కాఁగూడదు?' అని సురమ తనలోఁ దా ననుకొనుచుండెను.

"ఎటుతిరిగినను ప్రజలు నాయెడల జాలి చూపుచుండిరి. ఎక్కడికిఁ బోయినను ఎగతాళిచేయుచుండిరి. ఇది సహించి యూరకుండలేక మధ్యమధ్య రాయగడులోనున్న మాతాత-గారియొద్దకుఁ బోవుచుంటిని. మా నాన్నగారు నాకొఱకు బాగుగా వెదకించుటయైనను లేదు....ఆహా, ఏమి యా-భేదము అచ్చటికిని ఇచ్చటికిని! అచ్చట నెల్లప్పుడును జెట్లు నేమలు కనఁబడుచుండును. నేనాగ్రామస్థుల చిన్నగుడిసెల-లోనికిఁ బోవుచుందును, రాత్రింబవళ్లు రాజవేషము దాల్చి-యుండ నవసరముండదు. అదికాక, తాతయ్య దృష్టిపారినంత-మేర ఎచ్చటను ఎట్టి చింతగాని గాంభీర్యముగాని ఉండనేర-దని నీవెఱుఁగుదువు; తాతయ్య సమస్తమును తన యాట-పాటలతో నింపుచుండును. ఎటుచూచినను ఉల్లాసము, సద్భా-వము, శాంతి. అచ్చటికిఁ బోయినంత మాత్రమున యశోహర-పుర యువరాజునని మఱచుచుంటిని.

ఆహా, మఱపన నదియే మఱపు—చివర కొకనాఁడు నాకుఁ బదునెనిమిది సంవత్సరములు వచ్చినవి. రాయగడులో నాలుగుదిక్కులను వసంతవాయువులు వీఁచుచుండెను. ఎటు-

చూచినను పచ్చనికుంజవనములు. అట్టి సమయమున రుక్మిణి నాకంటఁబడ్డది."

"ఆ సంగతి అనేకపర్యాయములు వినియున్నాను." అని యన్నది సురమ.

ఉదయాదిత్యుఁడు "మఱియొకమాఱు వినుము సురమా! ఒక్కొకప్పుడు ఏదో యొకమాట మనహృదయమధ్యమునఁ బ్రవేశించి మనకు అమితబాధను గలుగఁజేయుచుండును, దానిని వెల్లడిచేయనిపక్షమున బ్రతికియుండుట కష్టమగు-చుండును. ఆవిషయము నీతోఁ జెప్పుట కిప్పటికిని నాకు లజ్జ పుట్టుచున్నది, కష్టమగుచున్నది, కనుకనే మాటిమాటికి నీతోఁ జెప్పుచుండును. ఏనాఁడు నాకు సిగ్గుపోవునో ఏనాఁడు నాకుఁ గష్టము కలుగదో అప్పుడు నా ప్రాయశ్చిత్తము పూర్తి-యైనదని భావింతును, అటుపైని మఱి నీతో ఆవిషయమై ప్రసంగింపను."

సురమ, "ఏల నీప్రాయశ్చిత్తము నాథా? నీవే పాపము చేసి యుండినయెడల, ఆతప్పు నీదికాదు పాపమునది. నేను నిన్నెఱుఁగ ననుకొంటివా? ఆపరమాత్ముఁడు నీ హృదయము నెఱుఁగఁడా?"

ఉదయాదిత్యుఁడు చెప్పనారంభించెను—"రుక్మిణి నా కంటె మూఁడుసంవత్సరములు చిన్న. ఆమె విధవ, ఏకాకిని. తాతయ్య కృపవల్ల రాయగడులో నివాసముచేయుచుండెను.

నన్నామె ఏమాయమూలమున తనదగ్గఱకు లాగినదో నే నిప్పుడు చెప్పఁజాలను. అప్పుడు నాహృదయమందున్నవి మధ్యాహ్నకిరణములు, కాంతి యధికముగ నుండుటచేత నేదియు బాగుగఁ జూడఁజాలకుంటిని, ఎటుచూచినను ప్రపం-చము అతిప్రకాశమైన యావిరితో నిండియున్నట్లు కానవచ్చు-చుండెను. నాదేహములోనుండు రక్తమంతయు శిరస్సున కెక్కినట్టుండెను. ఆశ్చర్యముపుట్టించునదిగాని అసంభవమై-నట్టిదిగాని ఎచ్చటను నేదియు లేదని యనిపించుచుండెను. ఏదిక్కున జూచినను ఒక్కరీతిగనే యుండెను ఏదారిచూచి-నను ఒక్కవిధముగనే యుండెను. అంతకుఁబూర్వముఁగాని, అటుతరువాతగాని ఎన్నఁడును నాకట్టి యనుభవము కలుగ-లేదు. ఒక్కదినముపాటీజగత్తును బుద్ధియు బలమును లేని నాక్షుద్రహృదయమునకుఁ బ్రతికూలముగ నుండునటులు ఈ చేయుటలో నేటియుద్దేశముండెనో అటు చేసిన యాజగ-దీశ్వరుఁడే ఎఱుఁగవలెను. ఒకనిమిషముపాటు విశ్వమందలి చరాచరములన్నియు నేకమయి నన్ను తప్పుదారిని బెట్టినవి. ఒక్కనిమిషముపాటు మాత్రమే అంతకంటె ఎక్కువ సేపుకాదు. కాని ఆ ఒక్కనిమిషములో బాహ్యప్రపంచమునుండి వచ్చి భయంకరమైన ఘాత మొకటి నాహృదయమునకుఁ దగిలినది. నా క్షుద్రహృదయము వ్రేళ్లుతెగి మట్టిలోఁబడినది. మఱల మట్టినుండి లేచుసరికి నేను ధూళితోనిండియుంటిని, ముఱికిదై యుంటిని. ఆధూళి ఎంత తుడిచినను పోలేదు, ఆముఱికి ఎంత-

కును వదలలేదు. నేనెట్టి పాపము చేయుటచేతనో గదా, ఈశ్వరుఁడు నాశుభ్రత నంతయు నిట్లు కాలిమతో నింపినాఁడు, నాపగటిని రాత్రిగాఁ జేసినాఁడు? అనాఁడు నాహృదయ-పుష్పవనముననుండు మాలతిమొగ్గలు జాజిమొగ్గలు సిగ్గువలన ముఖములు మాడ్చుకొన్నవి.''

మాట్లాడుచు నుండఁగనే ఉదయాదిత్యుని తెల్లని ముఖము ఎఱ్ఱనై పోయినది, క్రిందికి వ్రాలియున్న కన్నులు మఱింత పెద్దవైనవి. తలనుండి పాదములవఱకు మెఱుపు పరుగెత్తినట్టయినది. సురమ సంతోషముతోడను గర్వముతోడను, దుఃఖముతోడను నిండినదై, "ఆప్రసంగ మిఁకఁ జాలింపుము, అట్లింకను జెప్పిన నన్ను చంపుకొని తినినట్లే," అన్నది.

ఉదయాదిత్యుఁడు— "మెల్ల మెల్లఁగ రక్తము శీతలమయ్యెను. చుట్టుప్రక్కలనుండు నన్నిటిని వానివాని నిజపరిమాణములలోఁ జూడఁగలిగితిని, తిరుగుచున్న తలయు, నెఱ్ఱవారినకన్నులును, వేడియెక్కిన యొడలునుగల త్రాఁగుఁబోఁతునకుఁ గనఁబడునటులసృష్టియంతయుఁ దిరుగుచు మేఘచ్ఛన్నమైనట్లు కనబడుటకు మాఱుగఁ దనస్వాభావికరూపమును మరలఁ దాల్చినది. నాయవస్థ నప్పుడునేను పోల్చుకొంటిని. ఎచ్చటనుండి పడితిని. ఎచ్చటపడితిని! శత సహస్ర లక్షక్రోశములలోఁతుగల పాతాళగహ్వరమందుఁ బడితిని; చీఁకటి—మిక్కిలి చీఁకటియైన

నడురేయియందు రెప్పపాటులోఁబడిపోతిని. తాతయ్య అతి ప్రేమతో నన్ను బిలచెను, నాముఖ మాయనకెట్లు చూపఁగలిగితి నోకదా? కానిఅప్పటినుండి నేను రాయఁగడువిడువవలసివచ్చెను. తాతయ్యనన్ను విడచియుండలేక నాకొఱకుకబురు పంపుచుం-డువాఁడు, కాని మిగుల భీతిజెందియుండుటచేత నేను అచ్చటికి పోలేకుంటిని. నన్నును మా చెల్లెలు విభానును చూచుటకై తాతయ్య తానే స్వయముగ వచ్చుచుండెను. ఆయన కెట్టిగర్వ మును లేదు. ఎట్టి పౌరుషమును లేదు. నేనెందుకచ్చటికి పోలే-దని ఆయన యడుగనైనను లేదు. మమ్ములను జూచి మాతో నాటపాటలలో కొంతకాలము గడపి మఱల పోవుచుండు వాఁడు."

ఉదయాదిత్యుఁడు చిఱునవ్వునవ్వి ప్రేమతోను మార్ద-వముతోను, తన రెండు పెద్దపెద్దకన్నులను నింపుకొని సురమ ముఖమువైపు చూచెను. భర్త తరువాత అనబోవునది సురమ పోల్చుకొన్నది; ముఖము వాల్చుకొన్నది, కొంచెము తడబడు-చున్నది. ఉదయాదిత్యుఁడు తన రెండుచేతులను సురమ చెక్కిండ్లపై వేసి, వ్రాలియున్న యామె ముఖమును మెల్లఁగఁ బైకెత్తెను; మఱికొంచెము దగ్గఱగా వెళ్లి యామె ముఖమును, తన భుజముపై నుంచెను; ఎడమచేయి నామె వీపుపై వేసి యామెను పట్టుకొని తనలో పుట్టుచుండు గాఢప్రేమ వ్యక్త-మగునట్లు ముద్దుపెట్టుకొని యిట్లనెను—

"తరువాత నేమయినదో చెప్పఁగలవా సురమా ? నాయెదుట నొక నిర్మలముఖ ముదయించినది. బుద్ధితో దేదీప్యమానమైనది యది, అనురాగముచే కోమలముగా చేయఁబడినది, నవ్వుతో నుజ్జ్వలమై యున్నది—అట్టి నీముఖ మెప్పు డుదయించినది? నాగాఢాంధకారము పోవునను నాశ నా కుండెనా? నీవు నా యుషాదేవివి, నా కాంతివి, నాయా-శవు. ఏమంత్రమువలన నాచీఁకటిని తొలఁగించితివి?" యువరా జిట్లనుచు మాటమాటకు సురమను ముద్దుపెట్టుకొనుచుండెను. సురమ యేమియు ననలేదు, ఆమె కన్నులనుండి యానంద-బాష్పము లొలుకుచుండెను. యువరాజు తిరిగి యిట్లనెను:—

"ఇంతకాల మయినతరువాత నాకు నిజమైన యాశ్ర-యము దొఱకినది. నేను బుద్ధిమాలినవాఁడను గాను అని నీ నోటినుండియే మొట్టమొదట వింటిని, నే నామాటనే నమ్ము-చున్నాను, అది నీవలననే తెలిసికొంటిని. బుద్ధి ఎత్తుపల్లములు గలిగి వంకరటింకరగాఁ బోవు సన్నని చీఁకటిసందువంటిది కాదు, అది చక్కని రాజమార్గమువలె సరళమైనది, ఎత్తుపల్లములు-లేనిది, ప్రశస్తమైనది, అని నాకు నీవు చెప్పినదే. మునుపు నాయెడల నాకే అసహ్యముగ నుండెను, నన్ను నేనే యెగ-తాళి చేసికొనుచుంటిని. ఎట్టిపని చేయుటకును సాహసము లేకుండెను—లోపల ఒక ప్రక్కనుండి 'ఇది సరియైన మార్గము' అని వినఁబడుచుండును; మఱియొక ప్రక్కనుండి 'ఇది సరియై-నది కాదేమో' అని వినఁబడుచుండును. ఎవరెట్లు చేయుచు-

న్నను సహించి యూరకుందును—యోచించుటకైనను ప్రయత్నించకుంటిని. నాలో నేమియు లేకపోలేదని యిప్పటికి పోల్చుకొంటిని, నేనుగూడ మానవుఁడనేయని పోల్చుకొంటిని! ఇంతకు ముందు నన్ను నేనే తెలిసికొనలేకుంటిని, నీవు నన్ను కనుఁగొని బయటికి తెత్తితివి, నాకు మంచిదని తోఁచుదానిని చేయుటకు నాలో నిప్పుడు కోరిక పుట్టుచున్నది. నీవు నన్ను నమ్ముటచేత నేనుఁగూడ నన్ను నమ్మఁగలుగుచున్నాను,నీయందు నాకంత నమ్మక మున్నది. నన్నుఁగూడ బలవంతునిగఁ జేయఁగలిగినంతబల మీసుకుమారశరీరమున నెక్కడిదో కదా!

అమితనిర్భయభావముతో సురమ భర్తను రెండుచేతులతో పట్టుకొనినది, సంపూర్ణముగ నాత్మసమర్పణము చేయఁగోరు దృష్టితో భర్తవైపు చూచుచుండెను. ఆమె మాటలాడ లేదు, కాని ఆమె కన్నులుమాత్రము, "నాకు నీవుతప్ప మఱి యెవరును లేరు, కనుకనే నాకు సమస్తమును ఉన్నది," అనుచుండెను.

ఉదయాదిత్యుఁడు చిన్నప్పటినుండి యింటివారి యనాదరణయు, ఉపేక్షయు, సహించుచు వచ్చెను. మధ్యమధ్య ఒకొక్కనాఁడు నిశ్శబ్ద నిశీథసమయమున సురమకడకుఁ బోయి యింతకుఁబూర్వ మనేకపర్యాయము లామెతోఁ జెప్పియున్న తన జీవితచరిత్రను సోపానములుగఁ జేసి భాగభాగములుగ విభజించి యామెతోఁ జెప్పుచుండుట కతని కెంతో యానందముగ నుండెను.

"ఈవిధముగ నింక నెంతకాలము గడపవలసియుండు-నోగదా, సురమా?" అని ఉదయాదిత్యుఁ డడిగెను; "అవతల రాజసభాసదులు నన్ను జూచి జాలిపడుచున్నారు, ఇవతల నిన్ను మాయమ్మ పలువిధముల నవమానపఱచుచున్నది; నౌకర్లు, దాసీలు కూడ నీమాట లక్ష్యపెట్టరు. నేను గట్టిగా నెవరిని నేమియు ననలేకున్నాను; అంతయు సహించి యూర-కుండి పోవుచున్నాను, నీది పౌరుషముగల స్వభావమయి-నప్పటికిని నాకారణమున నీవుకూడ సహించి ఊరకుండవలసి వచ్చుచున్నది. నావలన నీకు సుఖము కలుగుట లేదు, దుఃఖము అవమానము మాత్రము కలుగుచున్నవి, నిన్ను నాకిచ్చి పెండ్లిచేయకపోవలసినది!"

సురమ—"అట్లనుచున్నావేమి నాథా ? ఇట్టిసమయ-మునసే సురమ అవసరము! నీవు సుఖముగా నున్నప్పుడు నీకు నావలన నేమి ప్రయోజనము? సుఖసమయమందు సురమ కేవల విలాసద్రవ్యమేకదా, ఆటవస్తువేకదా ! నీసేవ చేయు-చుండుటచేత నన్నిదుఃఖములను మఱచి, నీకొఱకు దుఃఖిం-చుటవలనఁ గలుగు నానందమునుమాత్ర మనుభవించు-చున్నాను. కాని నీ దుఃఖమంతయు నేను పూర్తిగాఁ దీసికొన-లేకున్నందుకు నాకు దుఃఖము కలుగుచున్నది."

యువరాజు కొంచెముసే పూరకుండి యిట్లనెను, "నా విషయమై యాలోచించుచు నేను దుఃఖించుచుండ, అంతయు

భరించి యూరకున్నాను. కాని నాకొఱకు నీ వవమానము పొందవలసివచ్చుచున్నది. నేను దుఃఖించుచున్నప్పుడు దొడ్డ యిల్లాలివలె నీవు నాకు మనశ్శాంతి నిచ్చినావు, నేను అలసి-పోయియున్నప్పుడు నాకు విశ్రాంతినిచ్చినావు కాని ఉత్తమ-పురుషునిధర్మము నిలఁబెట్టుకొని నీ కవమానము కలుగకుండ నిన్ను నేను కాపాడలేకుంటిని. మాతండ్రి, శ్రీపురపు రాజ్యాధిపతి మానాన్న యాధిపత్యము నంగీకరింపలేదు, కావున నిన్నునాదరించి తనయాధిక్యము నిలుపుకొనవలెనని మానాన్న నిశ్చయించుకొనియున్నాఁడు, నీకుఁగలిగిన యవ-మానమును చెవిని బడనీయఁడు, నిన్ను తనకోడలుగా తన యింటికిఁ దీసికొనివచ్చుటయే చాలు చాలు నని యాయన యభిప్రాయము. మఱి సహింపలేనని యొక్కమాఱు నాకనిపించుచున్నది, నిన్ను దీసికొని సర్వమును వదలుకొని పాఱిపోవలె ననిపించుచున్నది. కాని నీవు నన్నుఁబట్టుకొని కదలనీయకున్నావు."

చాల రాత్రి యైనది, సంధ్యతారలు మునిఁగిపోయినవి, అర్ధరాత్రి నుదయించునక్షత్రము లాకాశమందుఁ గనఁబడు-చున్నవి. సింహద్వారమున పహరా నిచ్చుచున్న సిపాయిల యడుగుల చప్పుడు వినఁబడుచున్నది. ప్రపంచమంతయు నిద్రించుచున్నది. నగరమున నుండు దీపములన్నియు నారి-పోయినవి. ఇండ్లతలుపులు వేసియున్నవి, రెండుమూఁడు నక్కలు తప్ప మఱియేజంతువులగాని యలుకుడును లేదు,

మనుష్యులయలుకుడు లేదు. ఉదయాదిత్యుని పడకగది తలుపులు మూయఁబడియున్నవి. అప్పుడు అకస్మాత్తుగా బయట నాతలుపులమీఁద నెవరో గుద్దినట్లయినది. యువరాజు కలవరపడి తలుపులు తెఱచెను—“ఏమి విభా, ఇంతరాత్రివేళ నిట్లు వచ్చుటకు కారణమేమి” అని బయటనున్న విభను జూచి యడిగెను.

విభ ఉదయాదిత్యుని చెల్లెలు. “ఎంతలో ఇంత ప్రమాదము వచ్చిపడ్డది!” అని గడిబిడపడుచు నామె యనినది; అది విని సురమ ఉదయాదిత్యు లిద్దరును ఒక్కమాఱుగ “ఏమయినది విభా?” అని యడిగిరి. భయముతో వణఁకుచు విభ వారితో మెల్లమెల్లఁగ నేమో చెప్పుచు మఱి చెప్పలేక ఏడ్వ నారంభించి, “ఏమికాఁబోవుచున్న దన్నయ్యా?”అని యడిగెను.

“అట్లైన నేను వెళ్లుచున్నానమ్మా” అని యనుచు, ఉదయాదిత్యుఁడు వెళ్లఁబోవుచుండ, “నీవు వెళ్లవద్దన్నయ్యా, నీవు వెళ్లవద్దు” అని యనుచు చెల్లె లడ్డువచ్చెను.

ఉదయాదిత్యుఁడు—“ఏమి విభా?”

విభ—“ఆసంగతి తెలిసినయెడల నాన్నకు కోపము రావచ్చును!”

ఉదయాదిత్యుఁడు—“ఛా! ఇప్పుడది యాలోచింపవలసిన సమయమా విభా?”

ఉదయాదిత్యుఁడు దుస్తులువేసికొని మొలకు బాకు

దోపి వెడలఁబోవుచుండ, "అన్నయ్యా, నీవు వెళ్లకుము, మఱి యెవరినైనఁ బంపుము, నాకు భయము వేయుచున్నది." అని యన్న చేయి పట్టుకొనివిభ యనెను.

"ఇప్పు డడ్డుపెట్టకుమమ్మా చెల్లీ, మఱి వ్యవధిలేదు" అనుచు ఉదయాదిత్యుఁడు బయటికి వెళ్లిపోయెను.

"ఏమగునోకదా, వదినా, నాన్న కీసంగతి తెలిసిన యెడల?" అని విభ సురమచేయి పట్టుకొని యనెను.

సురమ—"ఏమగునా! ప్రేమలో మిగిలియున్నది మఱేమియు లేదు కాఁబోలు! ఉన్న రవంతయును బోయిన గొప్ప నష్టమని భావింప నవసరములేదు కాఁబోలు!"

"లేదు వదినా, నాకు చాలభయము వేయుచున్నది, నాన్న అన్నకు హాని చేయవచ్చును, అతనిపై శిక్ష విధింప వచ్చును!"

సురమ పెద్దనిట్టూర్పు విడిచి, "లోకమున నెటువంటి సహాయమును లేనివారికి భగవంతుఁడే సహాయము," అని యనుచు, "ఓతండ్రీ, నీకీర్తి కెట్టికళంకమును రానీయకుము, నావిశ్వాసము పోనీయకుము!" అని ప్రార్థించెను.



రెండవ పరిచ్ఛేదము.

"మహారాజా, ఆపనివలన మేలవునా?" అని మంత్రి యనెను.

"ఏపని" అని ప్రతాపాదిత్యుఁ డడిగెను.

మంత్రి—"నిన్న మీరు సెలవిచ్చినది."

"నిన్న నా సెలవయిన దేమిటి?" అని చీకాకుపడుచు రాజడిగెను.

మంత్రి—"మీ పినతండ్రిగారితో సంబంధించిన—"

"మాపినతండ్రితో సంబంధించినది ఏది?" అని మఱింత విసుగుఁజెందుచు రాజడిగెను.

"వసంతరాయలు యశోహరపురమునకు వచ్చునప్పుడు దారిలో ఆచెఱువుగట్టున విశ్రమించుచుండఁగా—"

ప్రతాపాదిత్యుఁడు కండ్లు చిట్లించుకొనుచు "అప్పుడు-ఏమిటి? మాట పూర్తి చేయలేవా?" అనెను.

మంత్రి—"ఇద్దఱు పఠాను లచ్చటికి వెళ్లి—"

రాజు—"వెళ్లి—?"

మంత్రి—"వెళ్లి ఆయనను చంపుట." ప్రతాపాదిత్యునికికోపము వచ్చినది; "మంత్రీ, నీవు హఠాత్తుగా చంటిపిల్ల వాఁడవయిపోయినట్టున్నావు, ఒకసంగతి తెలిసికొనవలెనన్న పదిప్రశ్నలు వేయవలెనా?" అని రాజనెను. "నోటిమాటతో

పనుటకు భయము వేయుచున్నదేమో! రాజ్యసంబంధమైన పనులవిషయమై యాలోచించువయస్సు దాఁటిపోయినది కాఁబోలు, పరలోకచింత చేయవలసిన వయస్సు వచ్చిన ట్లున్నది. మంత్రిపదవినుండి విముక్తునిగఁ జేయుమని యిప్పటి వఱకు వేఁడుకొనలేదేమి?"

మంత్రి—"నే ననునది మీరు బాగుగ బోధపఱచు-కొనలేదు మహారాజా."

ప్రతాపాదిత్యుఁడు—"కావలసినంత బోధపడినది. కాని నేనొక్క ప్రశ్న యడిగెదను. ఉత్తరము చెప్పుము—నేను చేయఁగలపని నీవు నోటితో అననైన ననలేకున్నావేల? ఏదో మంచి కారణములేక అట్టి పనిచేయుమని నేనాజ్ఞాపింపనని మీరాలోచింపవలసియుండెను, దాని ధర్మాధర్మముల విష-యమై నేను చక్కఁగ యోచించియుందునని మీ రూహింప-కుండుటకు కారణమేమి?"

మంత్రి—"చిత్తము మహారాజా, నేను—"

ప్రతాపాదిత్యుఁడు—"ఆగుమాగుము, నేను జెప్పునది ముందు వినుము. నే నాపని చేయుమని చెప్పినప్పుడు,—నేను మా పినతండ్రిని చంపుటకు సిద్ధపడినప్పుడు, నేను దానివిష యమై మీయందఱికంటె బాగుగ యోచించితిని. ఇందులో నేమియు నధర్మములేదు, నేనొక వ్రతము పట్టినాను. మ్లేచ్ఛులు మన దేశమునఁ బ్రవేశించి, అనాచారము విస్తరింపఁజేయు-

చున్నారు, వారి దుర్మార్గప్రవర్తనములవల్ల మనసనాతన హిందూమతము మంటఁగలసిపోవ నారంభించినది. క్షత్రియులు తమ కన్యకలను మొగలాయిల కిచ్చి పెండ్లిచేయుచున్నారు, మన హిందువులయాచారము లడుగంటుచున్నవి. నే నీమ్లేచ్ఛులను తఱుమఁగొట్టవలెను, ఆర్యుల మతమును రాహుగ్రాసమునుండి తప్పింపవలెను. ఈ వ్రతము సఫలము కావలెనన్న గొప్పబలను కావలసియుండును. కనుక మన దేశమందు రాజులందఱును నాయాధిపత్య మంగీకరించి నాతో నేకమయియుండవలెనని నాకోరిక. యవనులమిత్రులైన రాజులందఱిని నాశముచేయక ఈకార్యము నెఱవేఱదు. మా పినతండ్రి వసంతరాయలు పూజింపఁదగినవాఁడు. కాని నిజము చెప్పుట తప్పుకాదు గనుక నిజముచెప్పెదను, ఆయన మావంశమునకు కళంకము. మ్లేచ్ఛుల దాసుఁడనని యతఁడు నలుగురితో ననుచుండుటకు సంకోచింపకున్నాడు. అట్టివానితో నాకెట్టిసంబంధమును వద్దు. చేతికి పుండయిన నేను చేతిని నఱికివేయఁగలను, రాయలవంశమునకును మనదేశమునకును పుండైన యీవసంతరాయల నఱికి పాఱవైచి మనదేశమును, రాయలవంశమును నిలఁబెట్టవలెనని నాసంకల్పము ”

మంత్రి—“ఈవిషయములో మహారాజుగారిమతము, నామతము నెన్నఁడును భిన్నములు కావు.”

ప్రతాపాదిత్యుఁడు—“ఆహా భిన్నములుగా నుండెను. నిజము చెప్పుము మంత్రీ, భిన్నములు కావా? ఇప్పటికిని

భిన్నములే! మఱియొకసంగతి యున్నది, వినుము మంత్రీ! ఏవిషయములోనైనను నీయభిప్రాయము నాయభిప్రాయముతో సరిపోనప్పుడు నీయభిప్రాయము నాకుఁ దెలియఁజేయుచుండ-వలెను. నీకట్టిసాహసము లేనప్పుడు నీ వాపదవికితగవు. నీ కెట్టి సందేహమున్నను నాకుఁ తెలియఁజేయుచుండవలెను. నాయభిప్రాయములను, ఉద్దేశములను బోధపఱచుటకు నా కవకాశ మీయవలెను. పినతండ్రిని జంపుట యెప్పుడైనను తప్పే యని నీయభిప్రాయము—'కా'దనకు మంత్రీ. నీవు నిజ-ముగా అట్లే యనుకొనుచున్నావు. నేను దానికిఁ దగినసమా-ధానము చెప్పఁగలను. తండ్రికోరికననుసరించి భృగుఁడు తల్లిని వధించెను, మతముకొఱకు నేను నాపినతండ్రిని జంప గూడదా?"

ఈ విషయములో—అనఁగా ధర్మాధర్మములవిషయ-ములో నిజముగనే మంత్రికి స్పష్టమైన యభిప్రాయము లేవి-యును లేవు. నిజముగ రాజుకంటె మంత్రియే అధోగతిపాలా-యెను. ప్రస్తుతపువిషయములో తాను రాజుగారితో నేకీ-భవింపక కొంచెము సంకోచించుచు మాట్లాడినచో రాజు-గారికి తత్క్షణము కొంచెము కోపము రావచ్చునుగాని తఱువాత సంతోషింతురని మంత్రి బాగుగ నెఱుఁగును. అట్లు చేయనిచో నెప్పుడోయొకనాఁడు రాజుగారికిఁ దనపై సందే-హమును, కోపముఁ బుట్టవచ్చునని మంత్రి నమ్మకము.

"ఈ సంగతి తెలిసినయెడల డిల్లీపురాధీశ్వరునికి కోపము రావచ్చునని నేను చెప్పఁబోవుచుంటిని" అని మంత్రి యనెను.

ప్రతాపాదిత్యుఁడు కోపముతో మండిపడుచు నిట్లనెను, "హాఁ! హాఁ! కోపపడవచ్చును! కోపపడు నధికార మందఱికిని గలదు. కాని డిల్లీపురాధీశ్వరుఁడు నా యీశ్వరుఁడు కాఁడే! అతనికోపము చూచి గజగజ వణఁకువారు లోకములో ననేకు లున్నారు — మానసింహుఁ డున్నాఁడు, వీరబలుఁ డున్నాఁడు, రాయలనేకు లున్నారు, నీవుకూడ నున్నావని యిప్పుడు తెలిసికొంటిని. కాని "ఆత్మవత్ సర్వభూతాని అనుకొనకుము."

"చిత్తము మహారాజా, నిజమే, వట్టి జడిపింపులకు నేను నంతగా జడియను, కాని ఆజడిపింపులతోపాటు కత్తిడాలు కనఁబడుచున్నయెడల కొంచెము యోచింపఁదగిన విషయముగదా! డిల్లీపురాధీశుని కోపమున కర్థము ఏఁబదివేల సైన్యము, అని మంత్రి నవ్వుచుననెను.

దానికిఁ దగినయుత్తర మేమియు నీయలేక మహారాజు, "డిల్లీ రాజుపేరు చెప్పి నన్ను జడిపించి నేను చేయఁదలఁచుకొన్నపని నాపవలెనని ప్రయత్నింపకుము, మంత్రీ, నాకు దానివలన నవమానము గలుగును" అని యనెను.

మంత్రి—"ప్రజలకుఁ దెలిసినయెడల వారేమందురు?"

ప్రతాపాదిత్యుఁడు—"ప్రజలకుఁ దెలిసినయెడలకదా?"

మంత్రి—"ఈ పని చాలకాలము దాఁగియుండదు. ఇది తెలియఁగానే సమస్తదేశమును మీకు శత్రు వగును. ఏది నెఱవేర్పుట కీపని చేయఁదలఁచుకొంటిరో అది సమూలముగ నాశనమగును. మిమ్ములను ప్రజలు జాతిచ్యుతులనుగఁ జేసె-దరు, మీ రనేకములైన బాధలకోర్చి యుండవలసివచ్చును."

ప్రతాపాదిత్యుఁడు — "చూడుము మంత్రీ, నీతో మఱలఁ జెప్పుచున్నాను, నేనేపని చేసినను బాగుగ నాలోచించి-గాని చేయను. కనుక నేనేదైన చేయునప్పుడు నన్ను భయ-పెట్టి యాపని విడిచిపెట్టునట్లు చేయుటకుఁ బ్రయత్నింపకుము; నేను చంటిపిల్లవాఁడను. గాను. అడుగడుగునకును అడ్డు-వచ్చి నాకు శృంఖలములై యుండుటకు నిన్ను నే నుంచ లేదు."

మంత్రియేమియు మాటాడలేదు, రాజుగారు తనకిచ్చిన యాదేశములు రెండు. తనకును తనప్రభువునకును మత-భేదమున్నప్పుడు అది స్పష్టముగ తెలియఁజేయనలె ననునది మొదటిది రెండవది, తన భిన్నాభిప్రాయమును వ్యక్తపఱచి రాజుగారిని నిరుత్సాహపఱపఁగూడదని ఈ రెంటిని సమా-ధానపఱచుట యెట్లో మంత్రి యీనాఁటివఱకును దెలిసికొన-లేకున్నాఁడు

కొంచెము సేపయినతరువాత మంత్రి మఱల—"మహా-రాజా. ఢిల్లీ పురాధీశుఁడు—అని ప్రారంభించుసరికి ప్రతాపా-

దిత్యుఁడు రౌద్రుఁడై, "మంత్రీ, నీవు డిల్లీపురాధీశుని పేరు రోజున కెన్ని పర్యాయము లనుచున్నావో, అన్నిపర్యాయము లీశ్వరుని పేరు స్మరణచేయుచున్న యెడల పరలోకమున సౌఖ్యము పొందుటకు చేయవలసిన ప్రయత్నము చేయుచున్న వాఁడవౌదువు," అనెను. "నేను చెప్పినపని పూర్తిచేయ నంతసేపు నీనోటివెంట డిల్లీ రాజుపేరు రానీయకుము. ఈసాయంకాలము ఆపని నెఱవేరినట్లు నాకు కబురుతీసుకొని వచ్చి, పిమ్మట నా చెవి దగ్గఱ నీమనసార ఆనామము స్మరింపవచ్చును. అంతవఱకు ప్రయత్నముచేసి నీమనస్సును కొంచెము కట్టిపెట్టుకొనియుండుము.

మంత్రి కొంచెమునే పూరకుండి, ఈమాఱు డిల్లీ రాజుమాట ఎత్తక, "మహారాజా, యువరాజుగారు——"

ప్రతాపాదిత్యుఁడు——"డిల్లీరాజుగారయినారు, ప్రజలయినారు, చివరకు, ఆభార్య చేతిలో నున్న బాలకుఁడు, ఉదయుని పేరెత్తియా నన్ను భయపెట్టవలెనని చూచుచున్నావు?"

మంత్రి——"మహారాజా, మీరు చాల పొరపాటు పడుచున్నారు. మీపని కడ్డురావలెనను నుద్దేశము నాకు కొంచెమేనను లేదు"

ప్రతాపాదిత్యుఁడు కొంచెము శాంతించి, "అట్లైన మఱియేమి చెప్పఁబోవుచుంటివో చెప్పుము" అని యనెను.

మంత్రి—"నిన్నరాత్రి హఠాత్తుగ యువరాజుగారు గుఱ్ఱమెక్కి ఒక్కఁడే యెక్కడికో వెళ్లిపోయిరి, ఇప్పటివఱకు తిరిగి రాలేదు.

ప్రతాపాదిత్యుఁడు చీకాకుపడుచు, "ఎటువైపునకు వెళ్లెను," అని యడిగెను.

మంత్రి—"తూర్పు దిక్కునకు"

ప్రతాపాదిత్యుఁడు పండ్లు కఱచుచు "ఏ వేళప్పుడు?" అని యడిగెను.

మంత్రి—"సుమారు అర్ధరాత్రి వేళ."

ప్రతాపాదిత్యుఁడు—"శ్రీపురపు జమీందారుగారి కొమార్తె యిక్కడనే యున్నదా?"

మంత్రి—"చిత్తము."

ప్రతాపాదిత్యుఁడు—"ఆమె పుట్టినింట నుండుటయే మంచిది."

మంత్రి జబాబు లేదు.

ప్రతాపాదిత్యుఁడు—"ఉదయాదిత్యునిలో రాజలక్షణము లెన్నఁడును గానరాలేదు. చిన్నప్పటినుండియు వాఁడు ప్రజలతోనే కలసి మెలసియుండువాఁడు. నాయింటఁబుట్టినవాఁ డిట్లు కాఁగలఁడని యెవ రనుకొనఁగలరు? సింహాము పిల్లకు సింహమగుమార్గము మనము చూపవలెనా? 'రాణాంమాతులక్రమః' కదా, వాఁడు తల్లివైపువారిబుద్ధి సంపాదించి నట్టు

న్నాఁడు. దానిపైని శ్రీపురపు రాజకన్యనిచ్చి పెండ్లి చేసినాను, అప్పటినుండి పూర్తిగ నధోగతిపాలయినాఁడు. నాకనిష్టపుత్రుఁడైనను యోగ్యుఁడౌనట్లును, నేను ప్రారంభించిన మహా-కార్యము పూర్తికాకముందు నామరణము సంభవించినయెడల ఆకార్యము నాచిన్నకొమారునిమూలమున నెరవేఱునట్లును ఈశ్వరుఁడు ప్రసాదించునుగాక — కాని, వాఁ డింకను రాలేదా?

మంత్రి—"లేదు మహారాజా!"

ప్రతాపాదిత్యుఁడు కాలితో నేల నొకతాపు తన్ని, "వానితో నొకభటుఁ డెవడైనను పోలేదా?" అని యడిగెను.

మంత్రి—"ఒకఁడు పోఁబోవుచుండెను. కాని యువ-రాజుగారు నిషేధించిరి."

ప్రతాపాదిత్యుఁడు—"కనఁబడకుండ దూరము దూర-ముగనుండి వెనుకకు వెళ్లవలసియుండెను"

మంత్రి—"భటులకెట్టి యనుమానమును లేకుండెను."

ప్రతాపాదిత్యుఁడు — అనుమానము లేకుండెనా? భటులు చాల మంచిపని చేసిరని చెప్పవలెనని కాఁబోలు నీ ప్రయత్నము? అర్థములేని మాటలేవో చెప్పి నన్ను దృప్తి-పఱచుటకుఁ బ్రయత్నింపకుము. సింహద్వారమునొద్దనుండు పహరావాండ్రు అతి నిర్లక్ష్యముగ నున్నట్లున్నారు. అక్కడ యెవరెవరుండిరో వాండ్రను పిలిపింపుము. అజాగ్రత్తవలన

నాపని నిష్ఫలమైనయెడల అందఱిని నాశనముచేసి పాఱవేసె-దను. నీకుఁగూడ తగినశాస్తియగునుమంత్రీ! ఈవిషయములో నెవరిమీఁదను నిందమోపఁగుఁడదని చెప్పుటకు వచ్చితివా? అట్లయిన ఆనిందయంతయు నీదే.

ప్రతాపాదిత్యుఁడు ద్వారపాలకులను రమ్మని కబురు పంపెను! కొంచెమునే పేమియు మాట్లాడక యూరకుండి "హాఁ; ఢిల్లీ రాజుగారిమాట ఏమి యనఁబోవుచుంటివి మంత్రీ?" అని యనెను.

మంత్రి—"ఎవరో ఢిల్లీమహారాజుగారితో మీమీఁద ఫిర్యాదు చేసిరఁట."

ప్రతాపాదిత్యుఁడు—"ఎవరు? మీయువరాజు, ఉద-యాదిత్యుఁడా ఏమి?"

మంత్రి—"అట్లన్నుఁడు వినఁడు మహారాజా! కాని చేసినవారెవరో యింకను దొఱకలేదు."

ప్రతాపాదిత్యుఁడు—"చేసినవా రెవరైనను సరే నీవు దానినిగుఱించి మఱి యాలోచింప నవసరములేదు ఢిల్లీ పురాధీశుని విచారణచేయవలసినవాఁడను నేను, అతనికిఁ దగినశిక్ష విధించు ప్రయత్నమే జరుగుచున్నది. ఆపఠాను లింకను రాలేదా! ఉదయాదిత్యుఁ డింకను రాలేదా? ద్వార-పాలకులను త్వరగా పిలిపింపుము."

## మూఁడవపరిచ్ఛేదము

గుఱ్ఱమును పరుగెత్తించుచు విద్యుద్వేగముతో విజన-పథములఁబడి యువరాజు పోవుచున్నాఁడు. అర్ధరాత్రిసమ-యము, గాఢాంధకారము. దారి చక్కనిది వెడల్పైనది యగుటచేత నెంతదూరముపోవుచున్నను యువరాజునకుభయ మనిపించలేదు. అక్కడక్కడ కుక్కలుమాత్రము బౌబౌ మని యఱచుచున్నవి. నక్కలు దారివిడిచి ప్రక్కనున్న వెదురు తుప్పల వెనుకకుఁ బారిపోవుచున్నవి. ఆనిశ్శబ్దనిశీథముగుఱ్ఱపు డెక్కలశబ్దమును ప్రతిధ్వనించుచున్నది. ఆయంధకారములో ఆకాశమున మిణుకుమిణుకు మనుచున్న చుక్కలు, దారి ప్రక్కను చెట్లమధ్యను మెఱుఁగుడుఁబురుగులు—వీనివలన వచ్చునది తప్ప మఱే యెట్టివెలుతురును లేదు. చెట్టుచెట్టున గీఁ మని పురుగులు అఱచుచున్నవి. ఎముకలుమాత్రము మిగి-లియున్న ముసలి ముష్టివాఁ డొకఁడు రోడ్డుప్రక్కను చెట్టు-దిగువను పండుకొనియున్నాఁడు. ఐదుక్రోసులదూరము పోయినతరువాత మంచి రోడ్డు వదలి యువరాజొకపొలము-దారిని బడెను, గుఱ్ఱమువడి తగ్గింపవలసివచ్చినది. పగటివేళ వర్షము కురిసియుండుటచేత, భూమి బాగుగఁ దడిసియున్నది, గుఱ్ఱముకాళ్లు మాటిమాటికిని తడినేలను కూరుకొని పోవు-చున్నవి. పోవుచుఁ బోవుచు గుఱ్ఱము ముందుకాళ్లపై ముమ్మాఱు పడిపోయినది. అలసియున్న గుఱ్ఱము ముక్క-

రంధ్రములను పెద్దపెద్దవిగఁ జేయుచున్నది; దానినోటివెంటను తోడలమధ్యను నురగ కారుచున్నది, దేహమంతయు చెమ-టలో మునిఁగియున్నది. లోపుననుండి యొకవిధమైన శబ్దము పుట్టుచున్నది. ఈవల నడువేసవి, లేశమైనను గాలిలేదు. యువరాజు పోవలసినస్థానము అక్కడ కింకను చాలదూరము, నీటిలోనుండి, దున్నిన పొలములలోనుండి, చాలదూరము గుఱ్ఱమును నడిపించుకొనిపోయి మఱియొకరోడ్డును చేరిన తరువాత గుఱ్ఱమును మఱలఁ బరుగెత్తింప నారంభించెను. గుఱ్ఱమును "సుగ్రీవా" యని పిలిచి మెడమీఁద తట్టి, ఉత్సాహపఱచెను. గుఱ్ఱ ములికిపడి సంతోషముతో చెవులు నిక్కపొడిచి కండ్లుపెద్దవిచేసి, తనప్రభువువైపుచూడఁ బ్రయ-త్నించెను; తలయెత్తి గట్టిగా సకిలించి మఱల మెడవాల్చి కళ్లెము లాగుకొని, అతివేగముగఁ బరుగెత్త మొదలుపెట్టెను. రెండుపార్శ్వముల నుండుచెట్లు చేమలు కంటికగపడుటలేదు; ఆకాశముననుండు నక్షత్రములు రాసులు రాసులుగ స్ఫులింగ-ములవలె తలపైని ఎగురుకొనిపోవుచున్నవి; నిశ్చలముగనున్న వాయువులో పుట్టిన కెరటము లుదయాదిత్యుని చెవులదగ్గఱ ఝూఁ ఝూఁ మని శబ్దముచేయుచున్నవి. మూఁడుజాముల-రాత్రి యగునప్పటికి ఉదయాదిత్యుఁడు 'శిములతలీ' సత్ర-ద్వారమున కెదురుగ వచ్చి నిలఁబడెను. అతఁడు క్రిందికి దిగియుఁ దిగకమునుపే గుఱ్ఱము నేలఁబడి ప్రాణము విడిచినది. యువరాజు దానివీఁపుమీఁద తట్టెను, దాని తలనెత్తి ఎంతో

ముద్దుగ దానిని "సుగ్రీవా సుగ్రీవా" యని పిలిచెను. కాని సుగ్రీవుఁడు మఱి కదలలేదు. పెద్దనిట్టూర్పు విడిచి యువరాజు ద్వారముదగ్గఱకు వెళ్లి తలుపు తట్టెను. అనేకపర్యాయములు తలుపుమీఁద కొట్టినతరువాత సత్రము సూపరెంటు తలుపు-తీయక కిటికీలోనుండి, అర్ధరాత్రివేళ వచ్చిన నీవెవరని యడుగుచు, శస్త్రహస్తుఁడై యున్న యువకుని లోపలనుండి చూచెను.

యువరాజు—"ఒకమాట యడుగవలసి యున్నది. తలుపుతీయుము."

"తలుపు తీయవలసిన యవసర మేమున్నది, అడుగ-వలసినది అక్కడనుండి యడుగవచ్చునే," అని లోపలనుండి జవాబు వచ్చినది.

యువరాజు—"రాయగడు రాజు వసంతరాయ లిక్కడ నున్నారా?"

లోపలనుండి—"ఆయన సాయంకాల మిక్కడకు వచ్చెదరని యేర్పాట్లు జరిగియుండెను, కాని ఇప్పటివఱకు రాలేదు. బహుశః నేఁడు బయలుదేర లేకపోయిరి కాఁబోలు!"

యువరాజు రెండుకాసులు పైకితీసి వాయించి, "ఇదిగో యివి తీసికొనుము" అనుచు అవి వాని కిచ్చెను.

సూపరెంటు తొందరతొందరగ వచ్చి తలుపుతీసి ఆ కాసులు తీసికొనెను. అప్పుడు యువరాజు, "నేను లోనికిఁ

బోయి యిందులో నెవ రెవరున్నారో, ఒక మాఱు చూడ-వలెను" అని యనెను.

సూపరెం టనుమానించుచు, "అదిమాత్రము వీలు లేదు," అని యనెను.

ఉదయాదిత్యుఁడు "నా కడ్డురాకుము, మహారాజు గారి యిలాకాలోనివాఁడను నేను, దొంగ లిద్దఱిని వెదకుటకు వచ్చినాను."

ఇట్లనుచు యువరాజు సత్రములోఁ బ్రవేశించెను. సూపరెంటు మఱియడ్డురాలేదు. యువరాజు సత్రమంతయు వెదకి చూచెను.

వసంతరాయలు లేరు, ఆయన యనుచరులు లేరు, పఠానులు లేరు, నిద్రలో కలవరించుచున్న ముసలివాఱిద్ద రెవరో మాత్రము కనఁబడిరి.

యువరాజు సత్రమునుండి వచ్చి బయటనిల్చుండి యాలోచింపసాగెను. "మంచిదే యైనది దైవవశమున నాయన నేఁడు రాలేక పోయినాఁడు గాఁబోలు" నని యొకమాఱు అనుకొనును; "కాని పఠాను లిక్కడాయనను కానక ఆపైనుండు సత్రములో నుండునేమోయని అక్కడకు వెళ్లినారేమో" అని మఱియొకమాఱు అనుకొనును. ఇట్లనుకొనుచు ఆముందు సత్రముదారిని వెళ్ల నారంభించెను. కొంచెముదూరము వెళ్లినప్పటికి గుఱ్ఱమెక్కి ఎదురుగా వచ్చుచున్నవాఁ డెవఁడో

అతనికి కనఁబడెను. అతఁడు దగ్గఱకు వచ్చినతరువాత, "ఎవరది రతనా?" అనియడిగెను. అతఁడు గుఱ్ఱముదిగి, "చిత్తము, యువరాజుగారు ఇంత రాత్రివేళ ఇక్కడకు వచ్చినారే" అనియనెను.

యువరాజు—"వచ్చుటకు కారణము తరువాత చెప్పెదను, తాతయ్య ఎక్కడ నున్నాఁడో ముందు నాకుఁ జెప్పుము."

"చిత్తము, ఆయన ఈసత్రములో నుండును."

"అక్కడ కనఁబడలేదే!"

"ముప్పదిమంది నౌకర్లను వెంటఁబెట్టుకొని ఆయన యశోరునకు బయలుదేరెను. పనియుండుటచేత నేను వెనుకఁ-బడితిని. ఈసత్రములో ఈసాయంకాల మాయనను గలిసి-కొనెదనని చెప్పియుంటిని."

"నేల తడిసి మెత్తగా నున్నది. అందుచేత నడుగులు తప్పక కనఁబడును. ఆజాడ ననుసరించి వెదకుటకు బయలు-దేరినాను. నీగుఱ్ఱము నేను తీసికొనిపోయెదను, నీవు నడచి రమ్ము."

—•◆•—

# నాల్గవ పరిచ్ఛేదము

నిర్జనపథప్రాంతమున వసంతరాయలు ఒంటరిగా పల్లకీలోఁ గూర్చుండియుండెను. దగ్గఱ నొకపఠాను తప్పమఱియెవ్వఱును లేరు, పల్లకీమోయువారైనను లేరు. దూరమున వినఁబడుచుండు కోలాహలము నిలిచిపోయినది. రాత్రి మఱల నిశ్శబ్దమయిపోయినది.

"నీవు వెళ్లలేదేమి ఖాన్‌సాహేబ్?"

పఠాన్—"నేనెట్లు వెళ్లఁగలను హుజూర్? మా ప్రాణములను ధనమును గాపాడుటకు తమరు తమ యనుచరుల నందఱిని బంపివేసితిరి, అట్టిసమయమున నేనుగూడ తమ్ము విడిచిపోఁగలనా? నేనంత కృతఘ్నుఁడ ననుకొనకుఁడు. 'మన కపకారము చేయువాఁడు మనకు ఋణగ్రస్తుఁడై యుండును, వాఁ డాఋణమును బరలోకములోఁ దీర్చవలసి యుండును. మన కుపకారము చేయువానిఋణము మన మెప్పటికిని తీర్చలేము. అని మామహాకవి ఒకచోట చెప్పి యున్నాఁడు"

పఠాను చాల మంచివాఁడని వసంతరాయలు తనలోఁ దా ననుకొనెను. ఇద్దఱును గొంతసేపు వాదించినతరువాత రాయలు బట్టతలను బయటకుఁ బెట్టి, "ఖాన్‌సాహేబ్ నీవు చాల మంచివాఁడవు" అని యనెను.

ఖాన్‌సాహేబ్ తత్క్షణము సలాముచేసెను, ఈవిషయములో నతని కెట్టి మతభేదమును లేదు. దివిటీవెలుఁగున వసంతరాయ లతనిముఖము చూచుచు "నీముఖము చూచినయెడల నీవు పెద్దయింటివాఁడవని తోఁచును ఖాన్" అని యనెను.

పఠాన్ మఱల సలాముచేసి "తమరు నిజము పోల్చుకొంటిరి మహారాజా—నా కాశ్చర్యముగ నున్నది," అని యనెను.

వసంతరాయలు—"నీ విప్పు డేపనిలో నున్నావు?"

ఖాన్ పెద్దనిట్టూర్పు విడిచి ఇట్లనెను. "నారోజులు మంచివి కావు మహారాజా, చాల దురవస్థలో నున్నాను, వ్యవసాయముచేసికొని బ్రతుకుచున్నాను. మాకవి ఎక్కడనో ఒకచోట నని యున్నాఁడు—ఓభాగ్యదేవతా, గడ్డిని నీవు గడ్డిగా సృజించుటలో నిర్దయ యేమియు లేదుగాని రావిచెట్టును పెద్దవృక్షముగా సృజించి చివరకు దానిని తుపాను దెబ్బలచేఁ బడఁద్రోసి తృణముతో సమానముగఁ జేయుటవలన నీహృదయము ఱాయివంటిదని బయలుపడుచున్నది."

వసంతరాయలు మిక్కిలి యుల్లాసముతో, "వహావ్వా వహావ్వా ఎంతచక్కనిసంగతులు మీకవి యన్నవి!" అని యనెను. "సాహేబ్, నాకు మీకవి మాటలు వ్రాసి ఈయవలెను.

'నేనెంత యదృష్టవంతుఁడను' అని పఠాను అనుకొనెను. "తాతగారిది దయగలస్వభావము, పేదవారికి నవసరకాలమున సహాయముచేయవలసినవారు." అని పఠానుకు నమ్మకముకలిగి నది. 'ఒకప్పుడు మంచిస్థితిలో నుండినవానికి నేఁడెట్టిదుర్దశ పట్టినది' అని వసంతరాయలు తనలోఁ దా ననుకొనుచుండెను. 'చపలచిత్తురాలగు లక్ష్మీదేవి చేసినదుష్కృత్య మిది' వసంత రాయలు దుఃఖితుఁడై "నీ కంత దేహదార్ఢ్య మున్నందుకు నీవు అత్యనాయాసముగ సేనలోఁ జేరియుండవచ్చును" అని పఠానుతో నన్నాఁడు.

పఠాను—"చేరఁగలిగియుందును, నిజమే హుజూర్ అది మావృత్తియే. నాతండ్రి, తాతలు కత్తి చేతఁబుచ్చుకొని యుద్ధభూమిపైఁ బ్రాణములు విడచిరి. నాకుఁగూడ నదియే కోరిక. మాకవి యొకచోట—"

వసంతరాయ లామాటలు పూర్తికాకుండ నవ్వుచు ననెను,—"కవి యేమనినను నాయిలాకాలో నుద్యోగము కావలెనన్న కత్తిచేతఁ బుచ్చుకొని ప్రాణములు వదలవలెనన్న కోరిక ఫలింపఁగలదు, కాని ఆకత్తి యొఱనుండి పైకిఁ దీయు భాగ్యము నీకు లభించదేమో. నేను ముసలివాఁడ నయి పోయినాను. నాప్రజ లెట్టిభయమును లేకుండ సుఖముగా కాలముగడపుచున్నారు. భగవంతుని కరుణవలన ఇఁకముం దెన్నఁడునుగూడ యుద్ధము లేకయే గడచిపోవునుగాక యనియే

నాకోరిక. వయస్సు మళ్లిపోయినది,అస్త్రములు విడిచివేసినాను.
అస్త్రమునకు మాఱుగా మఱియొకతె నాపాణిగ్రహణము
చేసినది. "ఇట్లనుచుఁ దనప్రక్కను నిద్రించుచున్న తనసహాచరి,
వీణను, రెండుమూఁడు ఝూంకారములతో లేపెను.

పఠాను "కళ్లుమూసికొని తల యూఁచుచు," ఆహా,
మీరు చెప్పినదానిలో నెంత నిజమున్నది," అనెను. "ఒక
సామెత యున్నది, కత్తి శత్రువులను జయించునుగాని సంగీ-
తము శత్రువులను మిత్రులుగఁ జేయును"

వసంతరాయలు—"ఏమంటివి ఖాఁసాహేబ్? సంగీ-
తమువలన శత్రువులను మిత్రులుగఁ జేయవచ్చునని యంటివా?
ఎంతగొప్పమాట యంటివి!" వసంతరాయలు కొంచెము సే-
పేమియు మాటలాడక కూర్చుండి తనలోఁ దా నాలోచించు-
చుండెను; ఆలోచించినకొలఁది ఆశ్చర్య మధికమగుచుండెను.
మఱికొంతసే పయినవెనుక ఆఖాఁసాహేబ్ నోటివెంటవచ్చిన
కవివచనములకు వ్యాఖ్యానము చెప్పుట మొదలుపెట్టెను:
ఖడ్గ మంత భీషణమైన వస్తువైనప్పటికిని దానితో శత్రువుల
శత్రుత్వము నాశనము చేయలేము—రోగిని చంపి రోగ
మును వదలఁగొట్టుట ఎట్లో శస్త్రముతో శత్రుత్వమును జంపు-
టయు నట్లే కాని సంగీత మతిమధురమైన పదార్థము, దానివలన
శత్రువును జంపకయే శత్రుత్వమును నాశనము చేయవచ్చును.
ఇదియేమి సామాన్యకవు లనఁగలమాటయా? వహ్వా, ఎంత

ఘనమైనమాట!" వృద్ధుఁడు మిగుల నుత్తేజితుఁడై కాళ్లు పల్ల-కిలోనుండి పైకిఁబెట్టి పఠానుకు మఱింత దగ్గఱగ వచ్చి "ఖడ్గ-ముతో శత్రువును జయింపవచ్చును, సంగీతముతో శత్రువును మిత్రునిగఁ జేయవచ్చును—కాదా, ఖాఁ సాహేబ్?". అనెను.

ఖాన్—"చిత్తము మహాప్రభూ!"

వసంతరాయలు—"నీవొకమాఱు రాయగడు రమ్ము. నేను యశోరునుండి వచ్చి నాకు చేతనైన సహాయము చేసెదను."

పఠాను సంతోషముతో పొంగిపోవుచు "తలఁచుకొని-నచో తమరు చేయలేని దేమియుండును," అనెను. అంతయు ననుకూలముగానే జరిగినదని చెప్పవచ్చునని పఠాన్ తనలోఁ దాననుకొనుచు, తాతగారిని "తమరు వీణవాయింపఁగలరా?" అని యడిగెను.

వసంతరాయలు "వాయింపఁగలను," అని యనుచు, తత్క్షణమే ప్రక్కనున్న వీణనెత్తి వ్రేలి నక్కి—తగిలించు కొని, బేహాగురాగ మాలాపన ప్రారంభించెను. మధ్యమధ్యను పఠాను 'వహావ్వా వహావ్వా' అనుచు తల యూఁచుచుండెను. అంతకంత కుత్సాహ మధికమగుటచేత వసంతరా యలు పల్లకిలో మఱి కూర్చుండి యుండలేక బయటను వచ్చి, నిలుచుండి వీణవాయించుట ప్రారంభించెను; తనపదవిని మఱచి

వాయించి వాయించి, మైమఱచి చివరకు పాడుట మొదలు పెట్టెను.

ప్రియను బాసినే
నెట్లు గడపఁగల
నొక్క నిమిషమైనా!

పాట ముగియగానే ఫతాను "వహ్వా ఏమి గాత్రము!" అని యనెను.

వసంతరాయలు — "ఇటువంటి నిశ్శబ్దరాత్రియందు, ఇటువంటి బయలులోఁ గూర్చుండి పాడినయెడల ఎవరి కంఠమైనను మధురముగానే యుండునని దానియర్థము. నేను చాల సాధనచేసితిని నిజమే గాని నాకంఠము విని సంతోషించినవారు చాలతక్కువ. అయిన నేమి, జగత్తులోనుండు ప్రతిరోగమునకు నేదో యొకమం దుండును, ఆలాగుననే ప్రతివానికంఠమును విని మెచ్చుకొనువాఁ డెవఁడో ఒకఁడుండును. నాకంఠము వినిసంతోషించువా రిద అజ్ఞానులున్నారు. లేనిచో నాదుకాణ మిప్పటివఱకు తెఱచుకొని యుండఁగలుగుదునా, సాయిబూ? నాకున్న యిద్దఱు బేరగాండ్రును సరకుసంగతి తెలియకుండఁగనే వహావ్వా అనుచుందురు. వారిద్దఱిని చాలకాలమునుండి చూడలేనందున నాపాట నిలిచిపోయినవి. అందుచేతనే బయలుదేరినాను, మనసార పాడి పాట వినిపించి మనస్సులో నున్నభారము తగ్గించుకొని యిం-

టికి తిరిగి వచ్చెదను. కాంతి క్షీణించిన యావృద్ధుని నేత్ర-
ములు ఆనందముతోను, అనురాగముతోను దేదీప్యమానము-
లైనవి.

అప్పుడు పఠాను తనలోఁ దా నిట్లనుకొనెను—"పాట
వినిపించుటవలన మీకోరికలో నొకటి నెఱవేరినది. తాత-
గారూ, ఇప్పుడు ప్రాణభారము తగ్గించి రెండవకోరిక నేను
నెఱవేర్చవలెనా? అవా! ఎంతపాపము, ఎంతపాపము! అటు-
వంటి పనులుకూడ మనుష్యులకు సాధ్యమవుచుండును గాఁ-
బోలు! కాఫిరును చంపుట పుణ్యమే, కాని అట్టిపుణ్యము
కావలసినంత సంపాదించితిని, పరలోకసుఖము విషయమై
యిఁక మఱేమియు యోచింప నక్కఱలేదు. కాని నాయై-
హికావస్థ తారుమారుగానున్నది; ఈకాఫిరుప్రాణము కాపాడి
అతనిమూలమున నాయవస్థ కొంచెము బాగుచేసికొనుటలో
దోషమేమియు నాకు కానరాకున్నది."

వసంతరాయలు కొంచెముసేపు మాటాడలేదు. కాని
తరువాత మఱి యాపుకొనలేకపోయెను, ఉత్తేజితుఁడై
పఠాను దగ్గఱకు వచ్చి నెమ్మదిగా, "ఎవరిమాట అనుచుంటినో
నీకుఁ దెలియునా సాయిబూ? నామనుమనిమాట మనుమరాలి
మాట అనుచుంటిని," అని యనెను. ఇట్లనుచుకొంచెము గడ-
బిడపడుచు, "నాయనుచరు లెప్పుడు వచ్చెదరు" అని తనలోఁ
దా ననుకొనెను. మఱల వీణతీసి పాట ప్రారంభించెను.

ఇట్టిసమయమున నశ్వారోహి యొకఁడు వచ్చి, "అన్నా! ప్రాణములు తిరిగి వచ్చినవి," అనుచు, "తాతయ్యా, ఈ అర్ధరాత్రివేళ ఎవరికి నీపాట వినిపించుచున్నావు?" అని యడిగెను.

వసంతరాయ లాశ్చర్యపడుచు నావీణను పల్లకీలోనుంచి ఆనందపరవశుఁడై ఉదయాదిత్యుని గుఱ్ఱముమీఁదనుండి దింపి మనస్ఫూర్తిగాఁ గౌఁగిలించుకొనుచు, "ఏమి తాతా, అందఱును క్షేమమా? ముసలమ్మ కులాసాగా నున్నదా?"

"అందఱును కులాసాగా నున్నారు" అనెను ఉదయాదిత్యుఁడు.

తాతగారు రామాట వినినతోడనే నవ్వుచు మరల వీణను పైకిఁదీసి తలయాడించుచు కాలితో తాళము వేయుచు పాట ప్రారంభించెను.

ఉదయాదిత్యుఁ డాపతానువైపు చూచుచు వసంత-రాయలుచెవిలో "నీకా కాబూలీవాఁడెక్కడ దొఱకినాఁడు" అని యడిగెను.

"ఖాన్‌సాహేబ్ మిక్కిలి మంచివాఁడు, మనుష్యుల విలువ పోల్చుకొనఁగలవాఁడు; ఈరాత్రి వానితోఁ గలసి అత్యానందముతో గడపినాను," అని వసంతరాయ లనెను.

ఖాన్‌సాహేబ్ ఉదయాదిత్యునిఁ జూచి గాబరా-పడుచుండెను, ఏమిచేయవలెనో అతనికిఁ దోఁచలేదు.

ఉదయాదిత్యుఁడు—"సత్రములోనికి పోకుండ నిక్క-
డనే, యున్నావేమి తాతయ్యా?"

పఠాను హఠాత్తుగా నిట్లు మొదలుపెట్టెను, "క్షమిం-
చెదరనిన నేనొకసంగతి చెప్పెదను. హుజూర్. నేను ప్రతా
పాదిత్య మహారాజుగారి ప్రజలలోనివాఁడను. తమరు యశో-
రునకు వచ్చుచున్నప్పుడు దారిలో తమ్ము వధింపుమని నియ-
మించి నన్నును మాతమ్మునిని మహారాజుగారు పంపిరి.

వసంతరాయలు—"రామ రామ!"

ఉదయాదిత్యుఁడు—"నీకుఁ దెలిసినదంతయుఁ బూర్తిగాఁ
జెప్పుము."

పఠాను—"మే మిట్టిపని ఎన్నఁడును చేయలేదు. ఆపని
మాచేత కాదని రాజుగారితో మేము చెప్పితిమి, చేయక వీలు-
లేదని రాజుగారు మమ్మనేకవిధముల జడిపించిరి వేఱుదారిలేక
అట్లే చేయుదుమని చెప్పి బయలుదేఱి దారిలో మిమ్మును కలసి-
కొంటిమి. ఊరిలో బందిపోటు జరుగుచున్నదని చెప్పి
ఏడ్చుకొనుచు మాతమ్ముఁడు వెళ్లిపోయెను. ఆపనిచేయు భార-
మంతయు నా యొక్కనిమీఁదనే పడినది. కాని, మహాప్రభూ,
రాజుగారి ఆజ్ఞ యైనప్పటికిని నే నీపని చేయలేను, ఎందుచేత
ననఁగా, 'రాజుగారి యాజ్ఞానుసారముగాని ప్రభువుగారియాజ్ఞ
ననుసరించిగాని ప్రపంచమునంతయు నాశనము చేయు-

వచ్చును, గాని స్వర్గమున రవంత మేరయైనను ముట్టఁగూడదు. ఆమాట జ్ఞాపక ముంచుకొనుఁడు' అని మాకవి ఒకచోట ననెను. అందుచేత ఈయభాగ్యుఁడు మీశరణుఁ జొచ్చుచున్నాఁడు. నేనిప్పు డింటికి మఱల పోయినయెడల రాజుగారు నన్ను నాశనముచేయుదురు, మీరు నన్ను గాపాడకున్న నాకు వేఱుగతిలేదు." ఇట్లనుచు చేతులు జోడించి పఠాను వసంతరాయల యెదుట నిలిచెను.

వసంతరాయ లాశ్చర్యపడి యతనివైపు చూచుచు కొంతసే పయినతరువాత నిట్లనెను— "నేను నీకొక జాబిచ్చెదను, అది తీసికొని రాయగడు పొమ్ము. నేనక్కడకు వచ్చిన తరువాత నీవిషయమై యేర్పాటుచేసెదను."

ఉదయాదిత్యుఁడు—"నీ వింకను యశోహరకు పోవలెననుకొనుచున్నావా తాతయ్యా?"

వసంతరాయలు—"అవును వెళ్లెదను."

ఉదయాదిత్యుఁ డాశ్చర్యపడుచు. "అది యేమి!" అనెను.

వసంతరాయలు—"ప్రతాపుఁడు నాకు పరాయివాఁడు కాఁడు, ఎన్ని యపరాధములుచేసినను నావాఁడేకదా! నా విషయమై నాకేమియు భయములేదు. నేను భవసాగరకూలమున నిలిచియున్నాను, ఒక్కకెరటము వచ్చి తగిలినయెడల సర్వమును ముగియును. కాని ఈపాపకార్యము చేసినచో

ప్రతాపుని యిహాపరముల కెట్టిహానికలుగునో యని చింతించక యెట్లూరకుండఁగలను? అక్కడికి వెళ్లి యతనినిఁ బ్రేమతోఁ గౌఁగిలించుకొని యంతయు నతనికి బోధపఱచి చూచెదను."

ఇట్లనుచు వసంతరాయలు కనుల నీరుపెట్టుకొనెను.

అట్టిసమయమున వసంతరాయని యనుచరులు కోలాహలము చేసికొనుచు నక్కడకుఁ దిరిగివచ్చి "మహారాజుగారెక్కడ, మామహారాజుగారెక్కడ?" అని కేకలువేసిరి.

"ఇక్కడనే యున్నాను, మఱియెక్కడకు పోఁగలను?"

"ఆ తురకవాఁడేడి?" అని అందఱును కలసి యనిరి.

"మీరా ఖాన్‌సాహేబు కేమియు చేయకూడదు సుమా!" అనుచు భయపడుచు వసంతరాయలు వారి కడ్డుపడెను.

మొదటివాఁడు—"మహారాజా, నేఁడు బహుకష్టపడవలసివచ్చినది, వాఁడు—"

రెండవవాఁడు—"నీవు నోరుమూసికొనుము, నేనంతయు స్పష్టముగా చెప్పెదను. ఆపఠాను నన్ను తిన్నగా తీసికొనిపోయి చివర కెడమప్రక్కనున్న యొకమామిడితోఁటలోనికి—"

మూఁడవవాఁడు—"కాదురా అది పనసతోఁట!"

నాల్గవవాఁడు—"ఎడమవైపు కాదురా, అది కుడివైపు!"

రెండవవాఁడు—"ఏడ్చినట్లున్నది—అది ఎడమవైపే!"

నాల్గవవాఁడు—"నీవనుటచేత నది ఎడమవైపునకు పోవును కాఁబోలు?"

రెండవవాఁడు—"ఎడమవైపు కానియెడల, ఆ-చెఱువు—"

ఉదయాదిత్యుఁడు—"అవునురా అది ఎడమవైపే, తరువాత జరిగినకథ చెప్పుము."

రెండవవాఁడు—"చిత్తము మహాప్రభూ! ఆయెడమవైపుననున్న మామిడితోఁటలోనుండి నన్ను ఆపైనున్న బయలులోనికి తీసికొనిపోయినాఁడు. తరువాత లెక్కలేనన్ని-పొలములను పొదలను, వెదురు డొంకలను దాటించి ఎంతో దూరము తీసికొనిపోవుచుండెను, కాని యేపల్లె జాడయు కానరాలేదు. ఈవిధముగా మూఁడు గంటలు నన్ను నడిపించి నడిపించి ఆతురక అకస్మాత్తుగా నెక్కడనో మాయమైపోయి-నాఁడు, ఎంతవెదకినను దొరకలేదు."

మొదటివాఁడు—"వానిని చూడఁగానే నాకు కొంచెము అనుమానముగా నుండెను."

రెండవవాఁడు—"ఇట్టిది ఏదో జరుగవచ్చునని నేనుఁ గూడ ననుకొంటిని."

ఇట్టిది జరుగఁబోవుచున్నదని తాను ముందుగానే పోల్చుకొనినట్లు చివరకు ప్రతివాఁడును జెప్పసాగెను.

---

## అయిదవ పరిచ్ఛేదము.

ప్రతాపాదిత్యుఁడు—"ఆపఠాను లిద్దఱు నింకను రాలేదు చూచితివా మంత్రీ!"

"అది నా తప్పు కాదు మహారాజా!" అని మెల్ల మెల్లఁగ మంత్రియనెను.

"తప్పుమాట నే ననలేదు. ఆలస్యమగుటకుఁ గారణ మొకటి యుండవలెనుగదా? నీకెట్టియనుమాన మున్నదో యని యడిగితిని," అని చీకాకుపడుచు ప్రతాపాదిత్యుఁ డనెను.

మంత్రి—"ఆపత్ర మిక్కడికి చాలదూరము. అక్కడికి వెళ్లి పనిపూర్తిచేసి తిరిగివచ్చుటకు వేళపట్టునుగదా!" ఈమాట విని ప్రతాపాదిత్యుఁ డసంతుష్టుఁడయ్యెను. తా ననుమానించురీతి మంత్రికూడ ననుమానింపవలెనని, రాజు కోరునది, కాని మంత్రి పోవునది వేఱుమార్గము. "ఉదయుఁడు నిన్న రాత్రి బయలుదేఱిపోయెనా?" అని ప్రతాపుఁ డడిగెను.

మంత్రి—"చిత్తము మహారాజా, అది మీతో మొదటనే మనవిచేసియుంటిని."

రాజు—"మొదటనే మనవిచేసియుంటిని!" ఔనౌను! సరియైన సమయమునఁ దెలియఁజేసితివి, కాదా? ఎప్పుడో ఒక మాఱు చెప్పినయెడల నీపూచి వదలిపోవును గాఁబోలు!

ఉదయుఁడింతకుఁ బూర్వ మెప్పుడునునిట్లు చేయలేదే! శ్రీపు-రపురాజు కొమార్తెచేసిన దురుపదేశ మనుకొనెదను దీనికి కారణము. నీకెట్లు తోఁచుచున్నది మంత్రీ?"

"నేనెట్లు చెప్పఁగలను మహారాజా?"

ప్రతా—"వేదవాక్యము నీనోటివెంట వినఁగోరుచు నడిగితి ననుకొంటివా? నీయూహ కెట్లు తోఁచుచున్నదని నేనడిగినది."

మంత్రి—"తమరు మహారాణిగారివలన నంతయు వినుచుందురు, మీరావిషయమును నూహింపఁగలరు. నేనెట్లూహింపఁగలను?"

ఆసమయమున పఠాను నొకఁడు రాజసముఖమునకు వచ్చెను.

ప్రతాపుఁడు—"ఏమయినది? కార్యము నెఱవేర్చుకొని వచ్చితివా?"

పఠాను—"చిత్తము మహాప్రభూ, ఈపాటికి అంత-యు పూర్తియై యుండును."

ప్రతాపుఁడు—"అదియేమి? అట్టిజబాబేమి? ఆపని జరి-గినదో లేదో నీకు తెలియదా?"

పఠాను—"చిత్తము, మహాప్రభూ! నాకు తెలియును, పని పూర్తియైనది, కాని ఆసమయమున నే నక్కడ లేను మహారాజా."

ప్రతాపుఁడు—"అట్లైన పని పూర్తియైనదని చెప్పుట కర్థమేమి?"

పఠాను — "మహాప్రభువువారి యాజ్ఞానుసారము వసంతరాయ మహారాజుగారి యనుచరబృందమును ఆయన-యొద్దనుండి దూరముగా తీసికొనిపోతిని. హుసేన్‌ఖాన్ మిగిలినపని పూర్తిచేసినాఁడు."

ప్రతాపుఁడు—"చేసియుండక పోయినయెడల?"

పఠాన్—"నాతల మహారాజువారియొద్ద జామీనుం-చుచున్నాను."

ప్రతాపుఁడు—"అట్లైన అక్కడనే నిలిచియుండుము. మీాతమ్ముఁడాపని నెఱవేర్చుకొని వచ్చినయెడల నీకు బహు-మతి దొరకును."

పఠాను ద్వారముదగ్గరకు పోయి యచ్చటనున్న ఫారా-వాని యాధీనమున నిల్చుండి యుండెను.

ప్రతాపుఁడు చాలసేపటివఱకు నేమియు ననలేదు. తరువాత మెల్ల మెల్లగ మంత్రితో "ఈ సంగతి మనప్రజలకుఁ దెలియఁగూడదు. ఆయేర్పాటు నీవు చేయవలెను." అని యనెను.

మంత్రి — "మహారాజుగారికి కోపము రాదనిన, ఈసంగతి దాగియుండదని నేను చెప్పఁగలను."

ప్రతాపుఁడు—"నీవెట్లు పోల్చుకొనఁగలిగితివి?"

మంత్రి—"తమకుఁ దమ పినతండ్రిగారియెడల గల-ద్వేషము తమ రింతకుఁబూర్వము స్పష్టముగా వెల్లడిచేయు-చుంటిరి తమకొమార్తె వివాహకాలమున వసంతరాయలునకు తమ రాహ్వానపత్రిక పంపనేలేదు, మీరు పిలువకపోయినను ఆయన తనంతట తానే వచ్చెను. ఇప్పుడేమియు కారణము లే-కుండ హఠాత్తుగా తమ రాయనను పిలిపించుచున్నారు. అట్టి-సందర్భమున దారిలో నెవరైన ఆయనను చంపినయెడల మహారాజుగారే దానికి మూలకారణమని ప్రజలందఱు నను-కొనెదరు"

ప్రతాపాదిత్యుఁడు కోపముతో నిట్లనెను—"నీయుద్దే శము నాకేమియు బోధపడకున్నది మంత్రీ! ఈసంగతి బయలు పడినగాని నీకు సంతోషము గలుగదు కాఁబోలు, ఇదియందఱ-కును దెలియుటచేఁగాని నీమనఃకాంక్ష నెఱవేరనట్టున్నది! అట్లు కానిచో నిది బయలుపడక తీఱదని రాత్రింబగళ్లు నీవెందు చేత ననుచుండవలెనో నాకుఁ దెలియకున్నది. బయలుపడుటకు నాకేమియు కారణము కనఁబడుటలేదు. ఇది నలుగురకును తెలియకున్నచో నింటింటికి పోయి నీవే చెప్పెదవని నాయను మానము."

మంత్రి—"మహారాజా, క్షమింపుఁడు. తమ రన్నివిష-యములలో నాకంటె తెలిసినవారు. నావంటిక్షుద్రమతులు

తమవంటివారికి నుపదేశమిచ్చుటకుఁ బ్రయత్నించుట సాహసమైనపనియే. కాని యింతమంది యుండఁగా నన్నే తమరు మంత్రిగాఁ గోరుకొనుటచేత నాక్షుద్రబుద్ధికిఁ దోఁచినది అప్పుడప్పుడు తమకుఁ దెలియఁజేయుచుందును. నాసలహా తమకు కోపముమాత్రమే కలిగించుచున్నయెడల దాసుని క్షమించి యీపని విడచి పోనిండు."

ప్రతాపాదిత్యుఁడు కొంచెము సరుదుకొని కూర్చుండెను. మంత్రి కష్టము కలుగుమాట లప్పుడప్పుడు చెప్పునపుడు మహారాజుగారికి లోలోపున సంతోషముగూడఁ గలుగుచుండును.

ప్రతాపాదిత్యుఁడు—"ఈయిద్దఱు పఠానులనుఁ జంపిన యెడల భయపడుటకు కారణ ముండదేమో యని తోఁచుచున్నది."

మంత్రి—"ఒక కూనీనైనను దాఁచియుంచుట సులభముకాదు, మూఁడుకూనీలు దాఁచియుంచుట యసంభవము—తప్పక యందఱికిని దెలిసిపోవును"—తానన్న మాట వదలిపెట్టలేదు. మంత్రి.

ప్రతాపాదిత్యుఁడు—"అట్లైన నేట్లు? చావన్నమాటయే! ప్రజలందఱకుఁ దెలిసిపోవునే! కాని యశోహరపురము రాయగడుకాదు. ప్రజలరాజత్వములేదిక్కడ, ఇక్కడ రాజొక్కఁడే

రాజు, అందుచేత ప్రజలపేరుచెప్పి నన్ను భయపెట్టుటవలన లాభముండదు. నాప్రజలో నెవఁడైనను దీనివిషయమై యేదైన నెన్నఁడైన ననినచో ఎఱ్ఱగా కాలుచుండు ఇనుముతో వాని నాలుకను కాల్పించెదను."

మంత్రి తనలోఁ దాను నవ్వుకొనుచు నిట్లనుకొనెను—"ప్రజలనిన నింతభయము! కాని మనస్సును సమాధాన-పఱచుకొని భయముపోఁగొట్టుకొనఁ బ్రయత్నించుచున్నారు!"

ప్రతాపుఁడు—"కర్మ ముగించుకొని యనుచరులతోఁ గలసి రాయగడున కొకమాఱు నేను పోవలెను. ఆ రాజ్య-ముపై హక్కుగలవారు నేనుతప్ప నింకెవ్వరును లేరుకదా."

వృద్ధవసంతరాయలు మెల్ల మెల్లగ లోనికిఁ బ్రవే-శించెను. ప్రతాపాదిత్యుఁడు ఉలికిపడి చూచుచుండెను. కన్నులయెదుట కనఁబడుచున్నది. ఉపదేవతరూపమును ధరిం-చిన వసంతరాయలు కాఁబోలునని యనుకొనెను, నిశ్చేష్టుఁడై యేమియు మాటాడలేకుండెను. వసంతరాయలు ప్రతాపుని-దగ్గఱకుఁబోయి అతనిమీఁద చేయివేసి దువ్వుచు ననెను, "నన్నుజూచి నీకు భయమెందుకు ప్రతాపా? నేను నీపిన-తండ్రిని. పినతండ్రినైనను నన్ను నమ్మలేనిచో నేను ముసలి-వాఁడనని జ్ఞాపకము తెచ్చుకొనిన నీభయము పోవును, నీకు హానిచేయఁగల శక్తి నాలో లేదుకదా!"

ప్రతాపున కిప్పటికి తెలివివచ్చినది, కాని మాటలు కల్పించి చేటాలున నేమియు నన లేకపోయినాఁడు. పినతండ్రికి ప్రణామము చేయవలెననియైనను ప్రతాపునకు తోఁచలేదు.

వసంతరాయలు నెమ్మదిగా మఱల నారంభించెను.—"ఏమైనను మాటలాడుము ప్రతాపా! నీలో సిగ్గును గాని సంకోచమును గాని పుట్టించునట్టిపని యేదైనను నీవు చేసి-యుండినచో దానివిషయమై ఆలోచింపకుము, అట్టి యేవిష-యమునుగూర్చియైనను నేను ప్రసంగింపను. రమ్ము నాయనా, నాదగ్గఱకురమ్ము, చాలకాలమయినది నిన్ను చూచి; ఇఁక నెంతో కాలము నిన్ను చూడలేనుగదా!"

ఇంతసేపైనతరువాత ప్రతాపుఁడు లేచి పినతండ్రి పాదములకు ప్రణామముచేసి, ఆయనను కౌఁగిలించుకొనెను. ఇంతలో మంత్రి మెల్లగ గదిలోనుండి బయటికి వెళ్లిపోయెను. వసంతరాయలు చిఱునవ్వునవ్వుచు ప్రతాపునిమీఁదఁ జేయి-వేసి, ఇట్లనెను, "వసంతుఁ డనేకసంవత్సరములు బ్రతికి-యున్నాఁడు కదా, ప్రతాపా! కాలమయిపోయినది. రమ్మని యేల కబురింకను రాలేదో ఆవిధాతకే తెలియవలెను. కాని ఇఁకమిగల యాలస్యము చేయఁడు."

ప్రతాపుఁడు దానికి జబా బీయలేదు, వసంతరాయలు కొంచెమూరకుండి"అట్లయిన స్పష్టముగాఁ జెప్పెదను వినుము, నీవు నామీఁదికి కత్తియెత్తితివి. అది నాకు కత్తిదెబ్బకంటె

విస్తారముగ బాధ కలిగించినది," అని యనుచు కన్నుల నీరు-పెట్టుకొనెను. "కాని నాకేమియు కోపము గాలేదు. నీతో రెండుమాటలు చెప్పవలెనని వచ్చినాను. నన్ను చంపకుము ప్రతాపా, దానివలన నీయిహపరములకుఁ గూడ నష్టము గలుగును. ఇంతకాల మోర్చియుండఁగలిగినవాఁడవు మఱి కొంచెముకాల ముండలేవా? తొందరపడి పాప మొడికట్టు-కొనెదవేల?"

వసంతరాయ లనినదానికి విరుద్ధముగా నేమియు ననలేదు ప్రతాపుఁడు, దానికి జబాబీయలేదు, అనుతాపము కనపడలేదు. వసంతరాయ లదిచూచి యేదైన నితరప్రసంగ-ములోని కతనిని దింపవలెనని, "ప్రతాపా, నీ వొకమాఱు రాయగడు రావలెను," అనెను. "నీ వక్కడకు వచ్చి చాల-కాలమయినది, రాయగడులో చాలమార్పులు జరిగినవి. నాగళ్లిప్పుడు సైనికులయస్త్రములు, సేనకొఱకుంచిన భవన మిప్పుడు అతిథిశాల——"

ఆసమయమున పఠాను ఆగదిలోనుంచి పారిపోవఁ బ్రయత్నము చేయుచుండుట ప్రతాపుఁడు కనిపెట్టెను. ఇప్పటి-వఱకు మనస్సులో పట్టియుంచిన కోపము జ్వాలయై పైకివచ్చి-నది. పిడుగువలె శబ్దముచేయుచు, "ఖబర్దార్! వానిని దవలకుఁడు, పట్టుకొని యుంచుఁడు," అని అతివేగముతో గది విడిచి వెళ్లిపోయెను.

రాజు మంత్రిని పిలిపించి, "రాజ్యవ్యవహారములలో నీవు చాల నజాగ్రత్తగా నున్నావు," అనెను.

"ఇందులో నాతప్పేమియు లేదు మహారాజా," అని మెల్ల మెల్లగ మంత్రి ప్రత్యుత్తర మిచ్చెను.

రాజు గొంతుకఎత్తి బిగ్గరగాకేకలువేసెను; "నేనేడో ఒకవిషయమును గుఱించి ప్రత్యేకించి అనలేదు! నీవు రాజ్య-సంబంధమైన కార్యములలో మిక్కిలి నిర్లక్ష్యముగా నున్నా-వనిమాత్ర మంటిని. దాచుమని ఆనాఁడు నీచేతి కొకయుత్తర మిచ్చినాను, అది పాఱవేసితివి!" రెండుమాసములక్రింద నొకమాఱిట్టిది ఘటించినది, కాని రాజప్పు డొక్కమాట-యైనను అనలేదు.

"ఇంకొకనాఁడు ఉమేశరాయలయొద్దకుఁ బొమ్మని నిన్నాజ్ఞాపించితిని; నీ వచ్చటికి వెళ్లక యెవరినో పంపి కార్యము నెఱవేర్చితివి.—మాటలాడకుము, ఊరకుండుము, చేసినతప్పు దాచుకొనుటకు వృథాప్రయత్నము చేయకుము. ఎట్లైనను, నీవు శ్రద్ధతో పనిచేయుటలేదు, ఇదియే నీతో చెప్పుట, జ్ఞాపక ముంచుకొనుము!"

తరువాత రాజు ద్వారపాలకులను బిలిపించెను. ఏదో యపరాధమునకై పూర్వ మొకమాఱు రాజుగారు వాంద్ర-

జీతము నాపిరి. ఇప్పుడు వాం|డ్రను ఖైదులో నుంచుమని యాజ్ఞాపించిరి. రా జంతఃపురములోనికిఁ బోయి రాణిని పిలిపించి యిట్లనెను—"రాణీ, ఇంటిలో నిర్లక్ష్యమును, తిరుగు-బోటును అధికముగా నున్నవి. ఉదయుఁడు పూర్వ మెన్నఁడును నిట్లు ప్రవర్తించుచుండలేదు. ఇప్పుడు తనయిష్టము వచ్చి-నప్పుడు బయటికి వెళ్లుచుండును, ప్రజలతోఁ గలసి నాకు విరుద్ధముగా పనిచేయుచుండును. దీని యర్థమేమి?"

రాణి భయపడుచు నిట్లనెను—"వానిది కాదు తప్పు మహారాజా! ఈ యనర్థ మంతటికిని కారణము మనకోడలు. నాకొడుకు పూర్వ మెన్నఁడు నిట్లు చేయలేదు. శ్రీపురపు రాచకొమార్తెను పెండ్లిచేసిననాఁటినుండి వాని క్షేమైనదో నాకుఁ దెలియకున్నది"

సురమను కట్టుబాటులో నుంచవలయునని చెప్పి రాజుగారు వెళ్లిపోయిరి. రాణి ఉదయాదిత్యుని పిలిపించినది. ఉదయుఁడు వచ్చినతరువాత అతని ముఖము చూచుచు ఇట్లనెను—"ఆహా! ఎంత చిక్కిపోతివిరా తండ్రీ, ఎంత నల్లఁగా నయిపోతివిరా నాయనా! పెండ్లి కాకముందు ఏలాగున నుంటి-విరా—చూచినవారెల్ల వెలిగారమద్దిన బంగార మనుచుం-డిరి. అటువంటివాని కీదశపట్టుట కెవరు కారణము? కోడలి-మాట యింకముం దెన్నఁడును వినకుము తండ్రీ, వినుటవల-

ననే నీ కీడశపట్టినది.” సురమ ముసుఁగు వేసికొని యొకమూ-
లను నిలిచియున్నది. రాణి మఱల ప్రారంభించెను——“చిన్న
కులమున పుట్టినది యామె, నీకు తగిన దెట్లు కాఁగలదు? నీకు
సలహా నిచ్చుయోగ్యత దాని కెట్లు కలుగును? అది నీకెన్నఁటికిని
మంచిసలహా నీయదు, నీ వెంతచిన్న వాఁడవైన నంతమంచిది
దానికి. అట్టిరాక్షసిని తెచ్చి మహారాజుగారు నీకు పెండ్లి-
చేసిరి.” రాణినేత్రములనుండి అశ్రువర్షము మొదలుపెట్టినది.

ఉదయాదిత్యుని ప్రశాంతలలాటమునఁ జెమటక్రమ్ము-
చుండెను. తనలోనున్న అశాంతి బయలుపడునేమో యని
జడియుచు నుదయాదిత్యుఁడు తన పెద్దపెద్దకన్నులను, మఱి-
యొకప్రక్కకు త్రిప్పివేసెను.

అక్కడ గూర్చుండియున్న ముసలిదాసి యొకతె, “శ్రీ-
పురపుస్త్రీలు మంత్ర మెఱుఁగుదురు, తప్పక మన యువరాజు-
నకు రాజకన్య మందుపెట్టియుండును, సందేహము లేదు,”
అనినది. ఇట్లనుచు ఆదాసి ఉదయుని యొద్దకు పోయి,
“ఆమె నీకు మందుపెట్టినది నాయనా, అదిగో చూడుము, ఆమె
సామాన్యురాలు కాదు, శ్రీపురమునుండి వచ్చినది, శ్రీపురము
స్త్రీ అనఁగా అసాధ్యురాలన్నమాట! ఆహా, పాప మాయబ్బా-
యిలో నేమియు నుంచలేదు.” ఈలాగున ననుచు బాణముల-
వంటిచూపులను సురమవైపు ప్రసరించి పైఁటచెంగుతో కళ్లను
గట్టిగా రుద్ది ఎఱ్ఱగాఁ జేసికొనినది. ఇది చూచుసరికి రాణి

దుఃఖము మఱల రేఁగినది. అంతఃపుర వృద్ధనారీగణమున రోదన అంటురోగమువలె వ్యాపించినది. ఏదవ్వవలెనని ఉద్దేశించి యందఱును రాణిగదిలోనికి వచ్చిచేరిరి. ఉదయాదిత్యుఁడు జాలిపడుచు సురమవైపు చూచెను. సురమ ముసుగులోనుండి ఆసంగతి కనిపెట్టి, కనులు తుడుచుకొనుచు మెల్ల మెల్లగ తనగదిలోనికిఁ బోయెను.

రాణి సాయంకాలము ప్రతాపాదిత్యునియొద్దకు వచ్చి యిట్లనెను—"ఉదయునికి నంతయు బోధపఱచి చెప్పితిని, నాకొడుకు చాలమంచివాఁడు, బోధపఱచి చెప్పినయెడల బోధపఱచుకొనును, ఇప్పుడు వానికనులు విడినవి." అని చెప్పినది.

---

## ఆఱవ పరిచ్ఛేదము

సురమ విభ ముఖము వాడియుండుట చూచి సహింపలేక, ఆమెదగ్గఱకుఁ బోయి యామె మెడపైఁ దనచేయివేసి కౌఁగిలించుకొని, "ఏమియు మాటాడక విచారముతో నట్లూరక కూర్చుండియున్నావేమి విభా, నీమనస్సులో నున్నది ఎప్పటికప్పుడు నాతో చెప్పుచుండవేల?" అని యడిగెను.

"నేను చెప్పవలసిన దేమున్నది?" అని విభ మెల్ల మెల్లగ ననెను.

సురమ—"నీ వాయనను చూచి చాలకాలమయినది, నీ కెంత కష్టముగానున్నదో నే నెఱుఁగుదును. రమ్మనిఆయన కొకజాబు వ్రాయుము, అది ఆయనకు చేరగలయేర్పాటు మా అన్నయ్యచే చేయించెదను.

విభ భర్త చంద్రద్వీపాధీశుఁడైన రామచంద్ర రాయలు, వారిద్దఱు నిప్పుడు మాటలాడినది, అతనిని గూర్చియే.

విభ తలవంచుకొని జబాబీయ నారంభించెను — "ఆయన రావలసిన అవసర మిచ్చటివా రెవ్వరికిని కనఁబడకపోయిన? ఇక్కడ ఆయనకు జరగవలసిన మర్యాదలు జరగకపోయిన? అట్లైన ఆయన యిక్కడికి రాకపోవుటయే మంచిది. తనంతట తాను రావలెనని యనుకొనినగూడ రావద్దని నేను చెప్పెదను. ఆయన రాజు, మర్యాద జరగని స్థలమున కేల

రావలెను? మనకంటె ఆయన ఏవిషయములో చిన్న యని నాన్నగా రాయన నవమానపఱచుట?" విభ మఱి, యాపు కొనలేక ముఖమెఱ్ఱగాచేసికొని ఏడ్వ నారంభించినది.

విభముఖమును తనవక్షముపైఁ బెట్టుకొని యామె కనులు తుడుచుచు ననెను—"సరేగాని విభా, నీవు మగ వాఁడవై యుండిన నేమిచేసియుందువు? పిలువలేదని చెప్పి ఎన్నఁటికిని అత్తవారియింటికి వెళ్లవు కాఁబోలు!"

విభ—"నేనే పురుషుఁడనై యుండిన తత్క్షణమే వెళ్లి యుందును, మానావమానములమాట యాలోచించుచుఁ గూర్చుండను. అట్లని చెప్పి ఆదరించి పిలువకపోయినను ఆయన యిక్కడకు రావలెనని కాదు నాయభిప్రాయము.

విభ ఇంతగా మాట లనవలసినది కాదు. ఉద్రే-కముకొలఁది నేఁడింత యనినది, ఇంతసేపైన తరువాత ఆమాట జ్ఞప్తికివచ్చి సిగ్గుపడ నారంభించినది. "నేఁడెంత విస్తా-రముగా మాట లాడితిని, ఎట్టిమాట లాడితిని!" అని తనలోఁ దాననుకొనుచుఁ జాల సిగ్గుపడినది క్రమక్రమముగ ఉద్రే-కముతగ్గి, గొప్పబాధ యామె గుండెపైఁ గూర్చున్నది. విభ తన-కనులను చేతులతో నొక్కుకొనుచు సురమ యొడిలో తల నుంచినది. సురమ ముందుకువంగి చేతులు విభ తలమీఁద వైచి, కడుముద్దుతో నామె దట్టమైనజుట్టును దువ్వుచుండెను. కొన్ని-నిమిషము లిట్లు నడచినవి. ఇద్దఱిలో నెవ్వరును ఒకమాటయైన

నాడ లేదు. విభ కన్నులనుండి యశ్రుబిందువులు ఒక్కొక్కటిగ రాలుచుండెను, వానిని మెల్లమెల్లగ సురమ తుడుచుచుండెను.

ఇట్లు చాలసేపయినది; సంధ్య సమీపించినది. విభ మెల్లగ లేచి కూర్చుండి కనులు తుడుచుకొని చిన్ననవ్వు నవ్వినది—"చిన్నపిల్లవలె నేఁడు నేను ప్రవర్తించితిని" అప ఆనవ్వున కర్థము. విభ ముఖము త్రిప్పుకొని బయటికి పారి-పోవలెనని ప్రయత్నించుచుండెను. సురమ ఏమియు ననక విభ చేయిమాత్రము పట్టుకొని వెనుకటిప్రసంగము నెత్తక తాతయ్య వచ్చినాఁడని నీకు తెలిసినదా విభా?" అని యనెను.

విభ—"తాతయ్య వచ్చినాఁడా?"

సురమ—"వచ్చినాఁడు."

"ఎప్పుడు వచ్చెను?" అని అత్యుత్సాహముతో నడిగినది విభ.

సురమ—"కొంతసేపయినది."

విభ—"ఇంకను మనలను జూచుటకు రాలేదే!"

విభకు కొంచెము కష్టమనిపించినది. తాతగారిమీఁద తనకుఁ గలహక్కును సదా అతిజాగ్రత్తగా ఆమె కాపాడు-చుండును. మును పొకనాఁడు వసంతరాయలు వచ్చి ఉదయా-దిత్యునితో మాటలాడుచు కూర్చుండి చాలసేపటివఱకు విభను జూచుటకు అంతఃపురములోనికి రాలేదు. దాని-వలన విభకు మిక్కిలి బాధకలిగినది; తాతయ్యతో దానివిష-

యమై పోట్లాడకపోయినను, ఆయనతో నోరువిప్పి మాట-లాడలేక పోయినది.

వసంతరాయలు ఇంటిలో నడుగుపెట్టుచు పాట ప్రారం-భించెను.

పాట విని విభ తలవంచుకొని నవ్వుచుండెను. ఆమెకు చాల యానందము కలిగినది, ఆనంద మంత అధికమగుటచే పట్టుబడిపోయెదనేమో యని కొంచెము కలతపడుచుండెను.

సురమ విభ ముఖమునెత్తి పట్టుకొనుచు, "తాతయ్య-గారు విభ నవ్వుచూచుటకు దాఁగొనియుండ నవసరములేదు!" అనినది—"దాఁగొని వెనుకనుండి నవ్వుముఖ మొక్కమారు-చూచి పోయెదనని తాతయ్య పాటమూలముగా సూచించిన-దానికి సురమ యిచ్చిన ప్రత్యుత్తర మిది.

వసంతరాయలు—"అవును అవసరము లేకపోయినది. 'అసలు నవ్వకపోయినయెడల తాత వెళ్లఁడేమో, కొంచెము నవ్వి వదలించుకొనుట మంచి'దని విభ అనుకొనినది. ఆ-గయ్యాళి యభిప్రాయము నాకు బోధపడినది. నన్ను పంపి-వేయవలెనని వేసిన ఎత్తు ఇది. కాని అది శీఘ్రముగా నెఱవేఱ-కున్నది. వచ్చితినిగాన బాగుగా కాల్చుకొని తినినగాని వెళ్లను, మఱల చాలదినములవఱకు రాలేకున్నను జ్ఞాపక-ముండవలెనుగదా!"

సురమ—"తాతయ్యా వింటివా, విభ నాచెవిలో ఏమనుచున్నదో—జ్ఞాపకము పెట్టుకొనుటయే నీయుద్దేశమైనచో ఇప్పటివఱకు నీవు కలిగించినబాధ చాలునఁట, ఇప్పుడు క్రొత్తగా మరి బాధపెట్ట నక్కరలేదఁట."

ఇది వినఁగానే మహానందము కలిగి వసంతరాయలు పకపక నవ్వ నారంభించెను.

"నే నట్లనలేదు. నేనేమియు ననలేదు" అని విభ సిగ్గుపడుచు నన్నది.

సురమ—"తాతయ్యా, నీకోరిక నెఱవేరినదా? నవ్వు ముఖము చూడవలెనని కోరితివి, చూచితివి; మాట వినవలెనని కోరినావు మాట వింటివి. ఇఁక నీవు వెళ్లిపోవుట న్యాయము!"

వసంతరాయలు—"వెళ్లలేను తల్లీ, వెళ్లలేను. నేను తెచ్చినవి పదునైదుపాటలు, నెత్తెడు పండువెండ్రుకలు. అవి యిక్కడ ఒప్పఁజెప్పనిదే వెళ్లలేను."

విభ నవ్వు ఆపుకొనలేకపోయినది—"సగము మేరతప్ప నీతలను వెండ్రుకలే లేవు తాతయ్యా."

తాతగారి సంకల్పము సిద్ధించినది. చాలకాలమైనతరువాత కలసికొని నప్పుడు ఎంతో ప్రయత్నముపైనగాని విభ నోరు విడునది కాదు. కాని తాతగారిదగ్గఱ విభ నోరాకమాఱు తెఱచినచో దానిని మూయుట కష్టము. కాని తాత-

గారి ఎదుటతప్ప మఱియెవరియెదుటనుగూడ నెట్టి యవస్థలో-నైన విభను మాటలాడించుట సులభమైన పని కాదు.

వసంతరాయలు బట్టతలపై చేయి త్రిప్పుకొనుచు ననెను, నానెత్తినిండ నెత్తెడు వెండ్రుక లుండురోజులు పోయి-నవి. ఆరోజులే ఉన్నయెడల ఇంతదూరము నడచివచ్చియుండ-దునా? నాలుగు వెండ్రుకలు పండునంతలో మీవంటిరూపసులు పదిమంది నాదగ్గఱకు వచ్చి ఆపండు వెండ్రుకలును, వానితో-పాటు పది నల్ల వెండ్రుకలును తీసివేయుచుండరా?"

విభ తన నవ్వుముఖము మార్చి, "అది సరేగాని తాతయ్యా, తలనిండ జుట్టుండురోజులలో నీవు ఇంతకంటె అందముగా నుండువాఁడవా?" అని యడిగెను.

ఈవిషయమై విభకు సందేహ ముండకపోలేదు. తాత బట్టతల, ఆమీసములు గీయించిన పెదవులు, వాని ప్రశాంత-మగునవ్వు, పండినమామిడిపండువంటి తాతగారి నిండుబుద్ధి— వీనిలో నొక్కటైనను లేనట్లూహించినంతమాత్రమున విభ కసంతుష్టికలిగినది తాతకు బట్టతల లేకపోయినయెడల రాణిం-చదు. మీసము లున్నయెడల వికారముగానుండును. అనివిభ తనలోఁ దాననుకొనినది. మీసములున్నయెడల ఎంతవికార-ముగా నుండునో ఊహించుకొని నవ్వాపుకొనలేకపోయినది— 'తాతయ్యకు మీసములా! బట్టతలలేని తాతయ్యా!"

వసంతరాయలు—"ఈవిషయములో గొప్పమతభేదము కలదు. నామనుమరాండ్రు నాబట్టతల చూచి మోహిత లగుచున్నారు, వారు నాజుట్టును చూడలేదు. నా నాయనమ్మలు, అమ్మమ్మలు, నాజుట్టుచూచి మోహితలగుచుండిరి, వారు నాబట్టతలను చూడలేదు; రెండింటినికూడ చూచియున్నవారు దేనికి అందమధికమో ఇప్పటికిని స్థిరపరచకున్నారు"

విభ—"కాని తాతయ్య కిప్పటికంటె బట్టతల యైనయెడల వికారముగా నుండును."

సురమ—"బట్టతలనుగుఱించి తరువాత వాదించవచ్చును తాతయ్యా, ఇప్పుడు విభనుగుఱించి ఏదైన నుపాయము చూడవలెను."

తొందరతొందరగ విభ తాతగారి దగ్గఱకు జోయి ప్రక్కను నిలిచి "తాతయ్యా—నీ పండువెండ్రుకలను తీయనీయవా?" అనెను.

సురమ—"నే ననునది—"

విభ—"చూడుము తాతా నీ—"

సురమ—"నీవు మాటలాడకుము విభా ఊరకుండుము—!"తాతయ్యా నీవు వెళ్లి—

విభ—"తాతయ్యా, నీతలను బందువెండ్రుకలుతప్ప మఱియేమియు లేవే. అవియన్నియుఁ దీసివేసినయెడల దల పూర్తిగా బోడియైపోవునే!"

వసంతరాయలు—"నన్ను విననీయక చీకాకుపెట్టిన-యెడల మలయమారుత మాలాపన ప్రారంభించెదను జాగ్రత్త!" ఇట్లనుచు తన చిన్నవీణ శ్రుతివేయుట మొదలుపెట్టెను. విభకు మలయమారుత మనిన చీకాకు.

"అట్లైన నేను పారిపోయెదను." అనుచు విభ గది-లోనుండి పైకివెళ్లిపోయినది.

అప్పుడు సురమ నెమ్మదిగాఁ జెప్పెను—"విభ నిశ్శబ్ద-ముగ తనలోఁ దాను భరించుచున్న దుఃఖమును తెలిసినయెడల మహారాజుగారికిఁ గూడ దయపుట్టును తాతయ్యా!"

"ఏమీ? ఏమీ? విభ కేమైనది? అని మిక్కిలి యాతు-రతతో నడుగుచు వసంతరాయలు సురమ దగ్గఱకువచ్చి కూర్చుండెను.

సురమ—"అల్లునికి కబురు పంపి పిలిపింపవలెనని మున్నూట అరువదిరోజులలో నొక్కనాఁడైన నెవ్వరికిని తోఁచలేదేమి?"

"నిజమే!" అనెను వసంతరాయలు, ఆలోచించుచు.

సురమ—"భర్త కిట్టి అమర్యాదచేయుచున్నప్పుడు సహించి యూరకుండఁగల స్త్రీలెందఱుందురు, చెప్పుము,

ఈలోకములో? విభ సాధువై నదిగనుక దొంగతనముగా తనలో
తా నేడ్చుచు కూర్చుండును."

"లోలోపల నేడ్చుచు కూర్చుండునా?" అని వసంత-
రాయలు విచారముతో నడిగెను.

సురమ—"సాయంకాలమంతయు నాదగ్గఱ కూర్చుండి
యేడ్చుచుండెను."

"సాయంకాల మేడ్చుచు కూర్చుండి యుండెనా?"

సురమ—"ఏడ్చుచుండెను."

వసంతరాయలు—"విభ నొకమాఱు, పాపము, తీసి-
కొని రమ్ము చూతము?"

సురమ విభను జేయిపట్టుకొని తీసికొనివచ్చెను. వసంత
రాయలు ముద్దుతో విభగడ్డము పట్టుకొని అనెను—
"ఎందుచేత నేడ్చుచున్నావుతల్లీ? నీకెప్పుడు దేనివలన కష్టము-
కలిగినను తాతయ్యతో చెప్పవేల? దానికేదైన నుపాయము
చేయుననెదవా? ఇదిగో ఇప్పుడే వెళ్లి ప్రతాపునితో చెప్పి-
వచ్చెదను."

విభ—"తాతయ్యా, నీకాళ్లు పట్టుకొనెదను. ఈవిష-
యమై నాన్నతో నేమియు చెప్పకుము, కాళ్లు పట్టుకొనెదను
తాతయ్యా!"

విభ ఇట్లనుచుండఁగనే వసంతరాయలు బయటకుఁబోయి
ప్రతాపాదిత్యునియొద్దకు వెళ్లి యిట్లనెను— "అల్లు నిన్ని

నాల్లింటికి పిలువకపోవుటవలన ఆయన కమర్యాద చేసినట్లు కనఁబడును. యశోహర పురాధీశుని యల్లునికి తగినమర్యాద నీవతనికి జరపకపోవుట నీకే యవమానము, దానివలన నీవెట్టి-గౌరవమును పొందవు."

ప్రతాపాదిత్యుఁడు పినతండ్రిమాట కడ్డు చెప్పలేదు, అల్లుని పిలిపింపుమని యాజ్ఞాపించెను.

అంతఃపురమున విభా సురమలయొద్దకుఁ బోయి వసంత-రాయ లుత్సాహముతో వీణవాయించుట మొదలుపెట్టెను.

"తాతయ్యా! నాన్నతో నంతయు చెప్పివేసితివా?" అని విభ సిగ్గుపడుచు నడిగినది.

వసంతరాయ లది వినిపించుకొనక వీణవాయించు-చుండెను.

విభ వీణతీగలపై చేయివేసి పాట నాపి "నాన్నతో నాసంగతి చెప్పితివా?" అని మఱల నడిగెను.

అప్పుడు ఉదయాదిత్యుని చిన్నతమ్ముఁడు, ఎనిమిదేండ్ల వయస్సుగల సమరాదిత్యుఁడు గదిలోనికి తొంగిచూచి, "అక్కా చూచినానులే, తాతయ్యతో మాటలాడుచున్నావు అమ్మతోఁ జెప్పెద నుండుము," అని యనెను.

"ఇటు రారా తాతా, రా ఈలాగున రమ్ము" అనుచు తాతగా రాపిల్లవానిని పట్టుకొనిరి.

వసంతరాయలును సురమయుఁ గలసి యుదయుని పాడుచేయుచున్నారని యింటి యందఱి యుద్దేశము. ఆ-

కారణముచేత వసంతరాయ లాయింటికి వచ్చునప్పుడెల్లను అందఱును మహాజాగ్రత్తతో నుందురు. సమరుఁడు తాత-గారి చేతినుండి తప్పించుకొనవలెనని చేతులు లాగుకొను-టయు, గంతులు వేయుటయు ప్రారంభించెను. తాత వానికి వీణ నిచ్చి, తన సులోచనముల నిచ్చి వానిని తన భుజముమీఁద నెక్కించుకొని, నాలుగునిమిషములలో వానిని పూర్తిగా వశపఱచుకొనెను. తరువాత మనుమఁడు తాతను మఱి విడువలేదు, తాతగా రున్నంతసేపును ఆయన వెనుకనే తిరుగుచుండి, తాతగారి వీణను వాయించి వాయించి వీణ-తీగలలో ఐదింటిని త్రెంచివేసెను; చివరకు వీణవాయించు నక్క లీసికొని తాత కడి తిరుగ నీయలేదు.



## ఏడవ పరిచ్ఛేదము.

చంద్రద్వీపాధిపతియైన రామచంద్రరాయలు రాజసభా-మందిరమున గూర్చుండియుండెను. ఎనిమిది పలకలహాలు ఆయన కూర్చున్నది. దూలములనుండి బట్టలు కప్పియున్న గాజులస్టర్లు వ్రేలాడుచున్నవి. గోడలనుండు గూళ్లలో, ఒక-దానిలోమాత్రము విఘ్నేశ్వరుని ప్రతిమ యున్నది. మిగిలిన-వానిలో వేరువేరు అవస్థలను నిరూపించు శ్రీకృష్ణుని ప్రతిమ-లున్నవి.అవి యారోజులలో ప్రఖ్యాతిచెందినవఁట.కృష్ణ కుంభ-కారుని స్వహస్తఘటితములు. నలుదిక్కులను తివాసులు పరచియున్నవి, మధ్యను జరీపనిచేసియున్న సింహాసనమున్నది. దానిపైనున్నవి రెండుపదార్థములు—ఒకరాజు ఒక బాలీసు. నాలుగువైపులను జరీ జాలరు వ్రేలఁబడుచున్నది. గోడలను దేశవాళి అద్దములున్నవి. ఈస్వదేశదర్పణములలోఁ జూచు-వారికి ముఖములు సరియైన పరిమాణముతోఁ గనఁబడవు. రాజుగారిచుట్టునున్న మనుష్యదర్పణములుకూడ స్వదేశదర్ప-ణములవంటివే, వానిలో రాజుగారి ముఖము మిక్కిలి పెద్ద-దయి కనఁబడుచుండును. రాజుగారి యెడమప్రక్క నొక పెద్ద హుక్కాడా నున్నది. మంత్రి హరిశంకరుఁ డున్నాఁడు. కుడివైపున రమాయి విదూషకుఁడును, సులోచనములు పెట్టుకొనియున్న ఫర్నాండిజ్ సేనాపతియు నున్నారు.

రాజు—"ఏమోయి రమాయ్"

రమాయి—"చిత్తము మహాప్రభూ!"

రాజుగారు అలసినంతవఱకు నవ్విరి. మంత్రి రాజుగారికంటె నధికముగ నవ్వెను. ఫర్నాండిజ్ చప్పట్లుకొట్టుచు నవ్వ నారంభించెను. రమాయి సంతోషముతోఁ గంతులు-చికిలింప నారంభించెను. రమాయిమాటలకు నవ్వకుండుట రసికతలేనట్లని రాజుగారి యభిప్రాయము. రాజుగారు నవ్వు-చున్నప్పుడు నవ్వుట కర్తవ్యమని మంత్రి నమ్మకము. నవ్వఁదగిన సంగతి యేదో అందులో నున్నదని ఫర్నాండిజ్ దొరగారి యూహ. ఇంతేకాక తనమాటలకు నవ్వని యభాగ్యుని నే-డ్పింపకగాని వదలఁడు రమాయి. ఈకారణముచేతప్ప ఎవ్వ-రును రమాయి హాస్యములను విని నవ్వరు. అనాదిగా నవ్వు-చున్నహాస్యములే అవి? భయమువలన కొందఱు, కర్తవ్య-పాలనమునకై కొందఱు—రాజుగారు మొదలు ద్వారపాలకుని వఱకు, అందఱును రమాయిమాటలకు నవ్వుచుందురు.

"సంగతు లేమి రమాయ్!" అని రాజుగా రడిగిరి.

రసికత కనపఱపవలెనని రమాయి అర్థముచేసికొని "సేనాపతిగారియింటిలో దొంగలు పడ్డట్టు వింటిని," అని రమాయి ప్రారంభించెను.

ప్రాఁతపురాణము మఱల విప్పి తన్నిఁగతాళి చేయఁబో-వుచున్నాఁడని ఫర్నాండెజ్‌కు బోధపడినది. రమాయి రసిక-తను జూచి సేనాపతి ఎంతభయపడుచుండునో రమాయి అంతగా నతనివిషయమైయే హాస్యమాడుచుండును. ఇదిమాచి

రాజుగారు మిక్కిలి యానందించుచుందురు. అందుచేత రమాయి వచ్చినతోడనే ఫర్నాండెజ్‌కు కబురుపంపి పిలిపించు-చుందురు. రాజుగారి కామోదము నిచ్చువానిలో ముఖ్య-మైనవి రెండుండెను. మొదటిది, గొత్తిపోతులపోట్లాట, రెండ-వది పర్నాండెజ్ దొరగారిని పిలిపించి ఆపోట్లాట జరుగుచు-న్నప్పుడు ఎదుటనిలబెట్టుట. ఉద్యోగములో ప్రవేశించినప్పటి-నుండి సేనాపతి దేహముపై బాణములదెబ్బలవలన ఒక్క-గీతైనను పడలేదు. కాని హాస్యపుగుండ్లదెబ్బలు ప్రతిదినమును ఏడ్పు తెప్పించుచుండెను. రమాయి రసికతలో చాలభాగము వదలకుండ నుదహరించుట సారస్యము వదలుకొనినవారికి-గాని సాధ్యముకాదు.

"తరువాత?" అని ప్రశ్నించిరి రాజుగారు కండ్లు చికి-లించుచు.

"మనవిచేయుచున్నాను మహాప్రభూ" (పర్నాండెజ్ కుడిలినీగుండి తీసి మఱల తగిలించుచుండెను.) మూఁడు నాలుగురోజులనుండి సేనాపతిగారియింటికి దొంగలరాకపోకలు జరుగుచున్నవి. ఇంటియిల్లాలు దొరవారిని లేపవలెనని ఎంతో-ప్రయత్నము చేయుచున్నది. కాని దొరవారికి మెలకువ తెప్పించలేకున్నది.

రాజుగారు—"హాః హాః హాః హాః"

మంత్రి—"హాాః హాాః హాాః హాాః హాాః"

సేనాపతి—"హీః హీః"

"తెల్లవాఱినది, భార్య సాధింపు మఱి సహింపలేక క్షమాపణకోరుకొని దొరవారు "ఈరాత్రి ఏలాగుననైన దొంగను పట్టుకొనెదనని" భార్యతో అనిరి. రాత్రి రెండు-గంటలవేళప్పుడు దొంగ యింట ప్రవేశించెను. "ఇదిగో దొంగ వచ్చుచున్నాఁడు చూచితిరా?"అనెను గృహిణి."ఇంట దీపము వెలుఁగుచున్నది. ఆవెలుతురులో మనము దొంగ కగపడు-దుము. వాఁడు మనలను చూచినతోడనే పారిపోవును" అని దొరవారు ప్రత్యుత్తరమిచ్చి దొంగతో నిట్లనిరి___ "దొంగా! నేఁడు బ్రతికిపోతివిరా, ఇంట దీపము వెలుఁగుచుండుటచే నీవు పాఱిపోఁగలుగుదువు. రేపు వచ్చినయెడల చీఁకటిలో నేమిజ-రుగునో చూచెదవు రమ్ము."

రాజు___"హ హ హ హ!"

మంత్రి___"హా హా హా హా హా!"

సేనాపతి___"హిః"

రాజు___"తరువాత?"

రాజుగారు తృప్తిపొందలేదని కనిపెట్టి రమాయి మఱల ప్రారంభించెను. "ఎందుచేతనోగాని దొంగకు భయము పూర్తి-గాఁగలుగక ఆమఱుచటిరాత్రికూడ దొరవారియింటికివచ్చెను. ఇంటియావిడ, "అంతయు అఖరైనది లేవండి లేవండి" అని కేకలువేసినది. "నీవు లేవఁగూడదా?" అని దొరవారనిరి, "నేను లేచిన నేమిప్రయోజనము?" అని యన్నది భార్య. "ఏమి ప్రయోజనమా! లేచి దీపము వెలిఁగింపవచ్చును, చీఁకటిలో-

నేనేమియుం జూడలేకున్నాను," అని యనిరి సేనాపతిగారు. భార్య చాలకోపగించినది. భర్త అంతకంటె కోపగించి, "నష్టమునకు నీవే కారణము, దీపము వెలిఁగించి తుపాకితీసికొని రావేల?" అని యనెను. ఇంతలో దొంగ తనపని తానుచేసికొని "అయ్యా నేను చాల అలసియున్నాను, నాకొక చిలుముగుడుగుడు పీల్పనిచ్చెదరా" అనెను. "అహా ఉండుము, గుడుగుడు సిద్ధముచేసి యిచ్చెదను, కాని నాదగ్గఱకు వచ్చినచో ఇదిగో ఇదిచూడుము ఈతుపాకితో నీతల యెగురును, జాగ్రత్త" అని సేనాపతి దొంగను పెద్దగర్జనతో బెదరించెను. గుడుగుడు పీల్చినతరువాత దొంగ "స్వామీ కన్నము వేయుగునపము ఎంతవెదకినను కనబడకున్నది, మీరు దీపము వెలిఁగించినయెడల నాకును మేలగును" అని యనెను. గాడిద భయపడుచున్నాఁడు, దగ్గఱకు రావలదు, జాగ్రత్త" అని కేకవేసి దొరగారు దీపము వెలిఁగించిరి. దొంగ సావకాశముగ సామానులు మూటగట్టుకొని నిర్భయముగ బయటకు వెడలెను. "గాడిద చాల భయపడెను," అని దొరగారు భార్యతో ననిరి.

రాజు మంత్రులు నవ్వాపుకొనలేకున్నారు. ఫర్నాండిజ్ బలవంతమున నవ్వు తెచ్చుకొని మధ్యమధ్య, 'హిః హిః' అనుచు బయటకు వెడల ప్రయత్నించెను.

రాజు—"నేను మా అత్తవారియింటికి పోఁబోవుచున్నాను నీ వెఱుఁగుదువా?"

రమాయి— "అసారం ఖలు సంసారం సారం శ్వశురమందిరం" (నవ్వు—మొదట రాజుగారు, తరువాత మంత్రి, చివరకు సేనాపతి) "ఆమాట నిజమే. శ్వశురమందిరములో నుండునవన్నియు సారవంతములైనవి—అక్కడనుండు ఆహారము, ఆదరము—అన్నియు సారవంతములే, పాలలోనిమీగడ దొరకు నక్కడ, చేపలకూర తినునప్పుడు చేపతలలు ప్రాప్తించును. అక్కడ దొఱకు నన్నివస్తువులును సారవంతములే (నిట్టూర్పు విడుచుచు) నిస్సారమైనది భార్యమాత్రమే!

"అదియేమి నీ అర్థాంగి—" అని నవ్వుచు ననుచుండ, రమాయి చేతులుజోడించి జబాబు మొదలుపెట్టెను—"ఆమె నర్థాంగి యనకూడదు మహారాజా మూఁడుజన్మములపాటు తపస్సుచేసినచో నేను ఆమె యర్థాంగుఁడ నౌదునేమోగాని, నావంటి అర్థాంగు లేడుగురు కలసినయైనను ఆమెకు సమానముకాలేము!" (యథావిధి నందఱును నవ్వసాగిరి) ఆహాస్యములోని రస మందఱకును బోధపడినదిగాని మంత్రిగారికి మాత్రమవగాహనము కాలేదు. అందువలన మంత్రిగారు నలుగురికంటె అధికముగ నవ్వవలసివచ్చినది.

రాజు— "మీయింటి యిల్లాలు మహాశాంతస్వభావముగలది యనియు, ఇంటిపనియం దాసక్తిగలది యనియు, నేను వినుచున్నాను!"

రమాయి—"దానివలన ప్రయోజనమేమి మహారాజా! మాయింట నన్నిరకముల చెత్తకు స్థలమున్నది. నాకుమా-

త్రము లేదు. ప్రతిదినమును ప్రాతఃకాలమున నామె యూడ్చిన యూడ్పువలన నేను మహారాజువారి ద్వారముదగ్గఱ వచ్చి పడుచుండును."

ఈసందర్భమున రమాయి భార్య విషయమై కొంత చెప్పవలసియున్నది. ఆమె అతికృశాంగి, రోజురోజు మఱింత సన్నమైపోవుచున్నది. రమాయి ఇంటికి వచ్చుసరి కామె యతనికంటె కగపడకుండ నేదో ఒకమూలను దాఁగొనుచుండును. రమాయి రాజసభయందు పండ్లిగిలించువిధము వేఱు. ఇంటికి వచ్చినతరువాత ఇగిలించువిధము వేఱు. గృహిణి యథార్థస్వరూపము వర్ణించిన మనమనస్సులలో హాస్యరస ముదయించుటకుమాఱుగ దుఃఖరస ముదయించును. కావుననే భర్తగారు రాజసభయందామెను స్థూలకాయగను ఉగ్రచండిగను వర్ణించుచుండును. అది విని రాజును మంత్రియు నవ్వాపుకొనలేకుందురు.

నవ్వాగిన పిదప, "నీవుకూడ నాతో రావలసియుండును రమాయి, సేనాపతినికూడ తీసికొనిపోవుచున్నాను," అని రాజుగారనిరి.

రమాయి తనమీఁద మఱియొకమాఱు అతనిశక్తిని ప్రయోగించునని సేనాపతి బోధపఱచుకొని కండ్లకు సులోచనములు తగిలించుకొనెను. చొక్కాకు గుండీలు తగిలించుటయు విప్పుటయుఁ జేయుచుండెను

రమాయి—"ఉత్సవస్థానమునకు వచ్చుటకు సేనాపతి దొరగారికి నెట్టి అభ్యంతరమును నుండఁగూడదు, ఉత్సవస్థానము యుద్ధభూమి కాదుగదా!"

గొప్ప నవ్వును తెప్పించుమాటలు రమాయి చెప్పఁబోవు-చున్నాఁడని నమ్మి రాజును మంత్రియు మిగుల కుతూహలులై "యుద్ధమునకైన నసమ్మతియేల?" అని యడిగిరి.

"దొరగారిముక్కున రాత్రింబగళ్లు సులోచనము లంటి-యేయుండును. నిద్రపోవునపుడుగూడ దొరగారు అవి పెట్టు-కొనియే యుందురు, లేనిచో స్పష్టముగా కలగనుటకూడ కష్టమవును. యుద్ధమునకుఁ బోయినయెడల గుండుదెబ్బకు అద్దములు ముక్కలయి కండ్లు కన్నములగునేమో యని దొర-గారు భయపడుచుందురు. అంతేకదా సేనాపతి మహాశయా!"

సేనాపతి కండ్లు చికిలించి "కాక మరేమి కాఁగలదు?" అనుచు లేచి నిల్చుండి "మహారాజా! ఆజ్ఞనిండు నేనుపోయెద నిఁక" అని యనెను.

రాజు— "ప్రయాణమునకు సిద్ధముగా నుండుము; నా ఆఱువదినాలుగుగడలయోడ సిద్ధపఱచి యుంచవలెను." మంత్రియు సేనాపతియును బయటికిపోయిరి.

రాజు— "గతపర్యాయము మాయత్తవారియింట పాడుచేసి పంపినారు, నీకంతయుఁ దెలిసియేయుండును రమాయీ?"

రమాయి—"చిత్తము మహాప్రభూ, మహారాజువా-
రికి తోఁక యొకటి తగిలించినారు,"

రాజుగారు నవ్విరి-నిజమే; నోటిలోనిపండ్లు మెఱపు-
వలె ఒక్కపర్యాయము మెఱయుటయు నిజమే, కాని మన-
స్సునమాత్రము ఘోరాంధకారమువంటి మేఘ మావరించి-
నది. ఆవృత్తాంతము రమాయికిఁ దెలిసినదని వినుటవలన రాజు-
గారికి సంతోషము కలుగలేదు. ఇంకెవఱికిఁ దెలిసినను రాజు-
గారికి ఇంతవిచార ముండకపోవును. రాజుగారు తదేకదీక్షగా
గుడుగుడు పీల్వ నారంభించిరి.

రమాయి— "తమ బావమరదులలో నొకడువచ్చి
నాతో నిట్లనెను, మహారాజా, 'పడకగదిలో ప్రవేశించుసరికి
మీా మహారాజుగారికి తోఁకయు ఉన్నదని బయలుపడినది.
అయన నిజముగా రామచంద్రుఁడో, రామదాసుఁడో నీవు
చెప్పఁగలవా? మునుపెన్నఁడును నిట్టిసంగతి నేను వినలేదే!"
"నేను దానికి తత్క్షణమే ప్రత్యుత్తర మిచ్చితిని" మునుపెట్లు
వినఁగలిగియుండురు, అది పూర్వమునుండియున్న వస్తువు కాదు.
వివాహమునకై మీాదేశమునకువచ్చి 'యస్మిన్ దేశే యదా-
చారం'గనుక మీాయాచారము నవలంబించిరి—"ఏదేశమున-
నున్న యాదేశాచారముల నవలంభింపవలెనుకదా!"

జబాబు విని రాజుగా రమితానందమును బొందిరి.

రమాయివలన తనముఖమే కాక తనపూర్వులముఖములు
కూడ నుల్లాసముచే వికాసముపొందినవనియు ప్రతాపాదిత్యుని-

లోనుండు ఆదిత్యుఁడు శాశ్వతముగా రాహుగ్రస్తుఁడాయె ననియు రాజుగారికి తోఁచినది. యుద్ధమనిన నెట్లుండునో రాజుగారెన్నఁడును జూచియుండలేదు, ఇట్టి చిన్నచిన్న ఘటనలనే యుద్ధమని యూహించి సంతోషించుచుందురు. ఈనాఁటివఱకు తనకు జరిగినఘోరావమానము తలఁపునకు వచ్చునప్పుడెల్ల రాజుగారు చావుఁగోరుచుండిరి, కాని నేఁడుమాత్రము రమాయియు సేనాపతియు యుద్ధమునందు జయముపొంది వచ్చిరా యనునంత యానందమును పొందిరి. ఐనను రాజుగారి మనస్సుననుండి సిగ్గు పూర్తిగాఁ బోలేదు.

రాజు—"రమాయీ, ఈమాఱుకూడ మనము జయముపొంది రావలెను, మనకే జయముకలిగినచో నీ కీయుంగరము బహుమానముగ నిచ్చెదను.

రమాయి—"జయమువిషయమై మీకు సందేహమేల మహారాజా? తమరు రమాయిని అంతఃపురములోనికిఁ దీసికొనిపోఁగలిగినచో అత్తగారిచే నాలుగుచెఱువులనీళ్లు త్రాగింపనిదే అతఁడు విడిచిపెట్టఁడు."

రాజు—"ఆవిషయమై అంత యాలోచనయేల? నిన్నంతఃపురములోనికి అతిసులభముగ తీసికొనిపోఁగలను."

రమాయి—"తమ కసాధ్యమైన దేమున్నది?"

రాజుగారి నమ్మకముకూడ నదియే! తాను చేయలేనిదేమియుండఁగలదు? రాజుగారి యనుగతవర్గములోనివాఁ డెవఁడైన వచ్చి 'మహారాజుగారికి జయమవుగాక' యనుచుఁ

'దాసుని ప్రార్థన నెఱవేర్పుడు మహాప్రభూ' అనినచో ఆమహా మహిమాన్వితుఁడైన రామచంద్రరాయలుకూడ ఆప్రార్థన నంగీకరించి అట్లేయగుఁగాక అని యనుచుండును. తాను చేయ-లేనిపని యేదైన నుండఁగలదని యెవ్వరును ననుకొనఁగూడదు. ఇదియే రాజుగారికోరిక. తాను రమాయిని అంతఃపురము-లోనికి తీసికొనిపోవలెను; అక్కడ, రాజమహిషియైన తన-యత్తగారిని రమాయి యొగతాళి చేయవలెను, అప్పుడే తన-పేరు రామచంద్రరాయలు కాఁగలదు ఈగొప్పకార్యము నెరవేర్పలేనిచో తాను రాజయి యేమి ప్రయోజనము?

చంద్రద్వీపాధిపతి యప్పుడు రామమోహనమాలును పిలిపించెను. రామమోహనుడు పరాక్రమమున భీమునివంటి-వాఁడు, సుమారు నాలుగుమూరలజేనెడుపొడవు, చక్కని కండలుపెరిగిన శరీరము. మోహాను పెద్దరాజుగారి కాలము-నాఁటివాఁడు. రామచంద్రుఁడు చంటివాఁడుగా నున్నప్పు డతని నాడించుచుండెను. కోటలో నుండువంరును రమాయిని చూచి జడియుచుందురు, రమాయిని జడిపింపఁగలవాఁడు, రామమోహనమా లొక్కఁడే. మోహానునకు రమాయిని జూచిన పరమాసహ్యము. మోహానుఁడు తనను తృణీకరిం-చుచున్నాఁడనుమాట యనుకొనినంతమాత్రమున రమాయి సంకోచమువలన క్రుంగిపోవుచుండువాఁడు, మోహానునిఁ దప్పించుకొని పాఱిపోవుటకు నెట్టి యవకాశమున్నను వదలు-వాఁడు కాఁడు. రామమోహానుఁడు వచ్చి రాజుగారియెదుట

నిలిచియుండెను. రాజుగారు తమతో నేఁబదిమంది యను-చరులను దీసికొనిపోవుచున్నారనియు మోహనుఁడు వారికి సర్దారుగా రావలెననియు మోహనునితోఁ జెప్పిరి.

రామమోహనుఁడు "చిత్తము మహాప్రభూ! రమాయి ఠాకూరు*గారుకూడ వచ్చెదరా?" పిల్లికండ్లను, హ్రస్వాకా-రమునుగల రమాయి ఠాకూరు ఒకమూలను అంటిపెట్టుకొని నిలిచియుండెను.



* 'శాస్త్రులువారు' 'పంతులుగారు' అని మనము పేరునకు కలుపు-నట్టుగా కలిపిన పదము.

## ఎనిమిదవ పరిచ్ఛేదము.

యశోహరపురరాజ ప్రాసాదమున నౌకరుచాకరులకు నేఁడు పనితొందర విశేషముగా నున్నది. అల్లుఁడు వచ్చునని అనేకవిధములైన యేర్పాట్లు జరుగుచున్నది, భోజనపు సరంజామూలుకూడ జరుగుచున్నవి. చంద్రద్వీపరాజవంశము యశోహరపురరాజవంశముతో సరిపోల్చి మాటాడుటకైనను దగినది కాదు. ఈవిషయములో రాణిమతముకూడ రాజుగారి మతము ననుసరించునదే యినను అల్లుఁడు వచ్చునుగదాయని రాణికి నేఁడు మహానందముగ నున్నది. ఉదయము లేచినది మొదలు రాణి విభను తనచేతులతో తానే ముస్తాబుచేయుట మొదలుపెట్టినది— దానివలన విభకు చీకాకుగా నున్నది. ముస్తాబుతో సంబంధించిన చిన్నచిన్న విషయములోఁగూడ వృద్ధురాలైన తల్లిరుచి వేఱు యువతియైన కొమార్తె రుచి వేఱు. కాని విభయభిప్రాయములతో పనియేమున్నది, కొమార్తె కేది బాగుగనుండునో తల్లికే కొమార్తెకంటె బాగుగఁ దెలియును గదా! ఆకాశమురంగు గాజులు, మూఁడేసి తొడుగుకొనిన-యెడల తన తెల్లని లేఁతచేతు లెంతయో చక్కఁగ కనఁబడునని విభ యభిప్రాయము. తల్లి వానికి మాఱుగా చేతికి నెనిమిదిచొప్పున లావైన బంగారపుగాజులు తొడిగించి వజ్రములుతాపిన మోటుకంకణములుపెట్టి ఆచేతులను చూచి భరింపలేని యానందముతో అంతఃపురములోనుండు ముసలివాం-

్రను, విభవరాణులను పిలిపించినది. తన చక్కని చిట్టిముఖ-
మునకు నత్తు ఎంతమాత్రము బాగుగనుండదని విభ యెఱుం-
గును ఐననేమి, తల్లి ఒక పెద్దనత్తు తెచ్చి విభ ముక్కునం దగి-
లించి యామె గడ్డముక్రింద చేయినుంచి ఇటునుండి అటు,అటు-
నుండి ఇటు త్రిప్పుచు గర్వముతో కొమార్తెముఖము చూచు-
చుండెను. ఇదియంతయు సహించి ఊరకుండినవిభ, తల్లి పెట్టిన
కొప్పు అద్దమున చూచి సహించి ఊరకుండలేక, సురమకడకుం
బోయి తనకు నచ్చినట్లు సిగవేయించుకొనివచ్చినది. తల్లి కండ్లు
తత్‌క్షణమే దానిమీఁద పడినవి ; ఇంత చక్కనినుస్వాబంతయు
కేవల మాసిగవలననే పాడైపోయినదని తల్లి యనుకొనినది.
విభ అందముగా నుండుట చూచి యోర్వలేక సురను అంత
చక్కనికొప్పు నసహ్యముగాఁ జేసినదని నమ్మి రాణి విభకు
మెలకువ తెప్పించవలెనని సురను నీచస్వభావమును వర్ణింప
మొదలుపెట్టినది. చాలసేపు సురమను దిట్టినతరువాత రాణి
తనప్రయత్నము సఫలమైనదని కనిపెట్టి విభసిగను విప్పి తన
యిష్టప్రకారము కొప్పు పెట్టినది. ముక్కుననుండు నత్తు తలపై
నుండుకొప్పు, చేతులను నింపియుండు గాజులు, హృదయము
నింపుచుండు ఆనందము—వీనినన్నియు భరించుచు విభ
మిగుల యాందోళన పడుచుండెను. తనహృదయమును నింపి,
ఎంత నొక్కియుంచినను పైకి వచ్చుచుండు నాహ్లాద మింక
దాగియుండదని విభ తెలిసికొనినది. లోనుండి తొంగిచూచు-
చుండు మెఱుపా యనునట్లు మధ్యమధ్య విభముఖమున నది

వ్యక్తమగుచుండెను. ఇంటిగోడలు సహితము తన్నెగతాళి చేయుచున్నవా యనునట్లా మెకుఁ దోఁచుచుండెను. యువరాజు, ఉదయాదిత్యుఁడు వచ్చి సిగ్గుతోను ఆనందముతోను నిండియున్న చెల్లెలిముఖము ముద్దుతోఁ జూచుచు నానందించెను; చెల్లెలి యానందమువలన కలిగినసంతోషమును భరింపలేక తనగదిలోనికిఁ బోయి నవ్వుచు నతిప్రేమతో సురమను ముద్దు పెట్టుకొనెను.

సురమ—"ఏమి జరిగినది?"

ఉదయాదిత్యుఁడు—"ఏమియు లేదు."

అంతలో వసంతరాయలు విభను చేయిపట్టుకొని బలవంతముగ లాగుకొని వచ్చి గదిలో నిలువఁబెట్టి "తాతా ఒక్కమాఱు, మాముసలమ్మవైపు చూడుము; సురమా, మీామఱఁదలిముఖ మొక్కమాఱు చూడుము," అనెను. వసంతరాయలు ఆనందపరవశుఁడై నవ్వాపుకొనలేక దేహమంతయు వణఁకునట్లు నవ్వుచు విభముఖముచూచి, "నీకానందముగ నున్నయెడల మనసార ఒక్కమాఱు నవ్వుము తల్లీ చూడవలెనని యున్నది—" అని యనెను.

"ముసలివాఁడ నయిపోతిని, వయస్సు మరలిపోయినది. అట్లు కాకుండిన నీముఖము చూచుచు నిక్కడనే పడియుండి, ఇక్కడనే చచ్చియుందును — ముసలివాఁడ నైపోతి; మరణించువయస్సు దాఁటిపోయినది. యౌవనమున నుండినచో

ప్రతిక్షణము చావగలిగియుందును, ఇప్పుడు రోగమేదైన రానిదే చావు ప్రాప్తింపదు.

అల్లని యాదరించి తీసికొనివచ్చుట కెవరు వెళ్లినారని బావమఱఁది ప్రతాపాదిత్యుని అడిగెను. "ఏమో" అన్నారు మహారాజావారు. "దారివెంట దీపములు తప్పక వెలిఁ-గింపింపవలెను" అన్నాఁడు బావమఱఁది. "తప్పక వెలిఁగింప-వలెను, అనుదానికి అర్థములేదు," అనిరి రాజావారు, కండ్లు పెద్దవిచేయుచు బావమఱఁది సంకోచముతో, "నహాబత్ ఏర్పాటుచేయనక్కరలేదా?" అని యడిగిరి. "ఆవిషయముల గుఱించి మీరాలోచింపనవసరములేదు," అనిరి రాజుగారు___ బాజాభజంత్రీలు వాయించి అల్లుని నింటికిదీసికొనివచ్చుట ప్రతాపాదిత్యునిపనికాదు___అది అసలుసంగతి.

మామగారు తన్ను మనఃపూర్వకముగా అవమాన-పరచుచున్నారని నమ్ముటవలన రామచంద్రరాయలలో కోప-ము, పౌరుషము ఉదయించినవి. ఇంతకుఁ బూర్వము రెండు-మాఱులును అల్లుని సన్మానించి తీసికొనిరమ్మని ప్రతాపా-దిత్యుఁడు తనరాజధానికి కొంతదూరమున నున్న 'చకదిహి' యను గ్రామమువఱకు తనమనుష్యులను పంపియుండెను. ఈ మాఱు గ్రామము దాఁటి రెండుకోసు లివతలనున్న "వామన-హాటీ" యను స్థలమునకు వచ్చువఱకు దివానుగారు రామ-చంద్రుని కలియలేదు, సన్మానించుటకు వచ్చిన దివానుగారితో

నిన్నూటయేఁబదిమంది మనుష్యులుమాత్ర ముండిరి. యశో-హారపురమంతయు వట్టిదైయిపోయినదా? ఎంత వెదకినను ఉంత-కంటె నధికముగ మనుష్యులు దొరుకలేదేమో! అల్లునిసెక్కించి తీసికొనివెళ్లుటకు వచ్చిన ఏనుఁగుకంటె స్థూలకాయుఁడైనదివా నేఖారీ విగ్రహమని నిశ్చయించి రమాయి దివానుతో, "ఈ-ఏనుఁగు మీకనిష్ఠభ్రాత గాఁబోలు" అని యనెను. దివాను చాల మంచివాఁడు, ప్రశ్న విని ఆశ్చర్యపడి "లేదు అది ఏనుఁగు." అని ప్రత్యుత్తరమిచ్చెను.

"మీమంత్రి ఎక్కుచుండు ఏనుఁగు ఇంతకంటె చాల పెద్దది," అని కోపముతో సెలవిచ్చిరి రామచంద్రరాయలు వారు.

దివాను—"యేనుఁగులన్నిటిని రాజ్యకార్యముల మహారాజావారు పంపినారు. మిగిలియున్నది ఇదిమాత్రమే

తన్నవమానపఱచుటకే ఏనుఁగులను దూరదేశము పంపించియుందురు. మామగారు అని రామచంద్రుఁ డూహిం-చెను—అదికాక వేఱుకారణ మేమియుండఁగలదు. రాజాధి రాజగు రామచంద్రరాయలు ముఖ మెఱ్ఱగచేసి, "ప్రతాపా-దిత్యరాయలకంటె నే నేవిషయమున చిన్న?" అని యడిగెను.

రమాయి—"వయస్సున మీరు చిన్న, సంబంధమును-బట్టిచూచిన మీరు చిన్న, మఱిదేనినిబట్టి చూచినను మీరు,

చిన్న కారు,—వారికొఱకైను మీరు వివాహమాడితిరి కనుకనే..."

రామమోహనుఁడు సమీపముననే నిలిచియుండెను. వాఁడది విని సహించి యూరకుండలేక, "అనవసరముగ మాటలాడుట మీ కభ్యాసమైపోయినది, మా రాణియమ్మగారి విషయమై మీ రేమియు ననగూడదు ఆమాట కొంచెము జ్ఞప్తియుంచుకొనుఁడు." అని కోపముతో పలికెను.

ప్రతాపాదిత్యుని సూచించుచు రమాయి యిట్లనసాగెను—"నే నిట్టియాదిత్యుల ననేకులను చూచియున్నాను. ఇట్టి యాదిత్యుని చంకను నొక్కియుంచగలవాఁడు రామచంద్రునిదాసులలో లేకపోలేదు. అది మహారాజువారెఱుఁగని విషయము కాదు."

రాజుగారు నోటికి అడ్డుపెట్టుకొని నవ్వసాగిరి. రామమోహనుఁడప్పుడు మెల్లఁగ నడుగులువేసికొని రాజుగారియెదుటకు వచ్చి, "ఈబాపనవాఁడు మీమామగారివిషయమై నోటికి వచ్చినదంతయు కూయుచున్నాఁడు, అదిచూచి సహించి యూరకుండుట నాకు సాధ్యముకానిపని. మీయాజ్ఞయైనచో ఈక్షణమే అతని నోరుమూసెదను," అని యనెను.

రాజుగారు—"ఓర్చు ఓర్చు రామమోహన్!"

రామచంద్రుఁడు నేఁడు అనేకములగు అత్యల్పవిషయములను గూర్చికూడ నాలోచించి ప్రతాపాదిత్యుఁడు తన్నవ-

మానవలేకపవలెనని చాలకాలమునుండి ప్రయత్నించుచున్నాఁడని నిశ్చయించెను. ఈనమ్మకము తనగర్వమును మఱింత అధికముచేసినది. తానెంతవాఁడో చాటగలయాకారము ప్రతాపాదిత్యునియెదుట ధరించియుండవలెనని అతఁడు నిశ్చయించుకొనెను.

రామచంద్రరాయలు ప్రతాపాదిత్యుని చూచుటకు వచ్చుసరికి ప్రతాపాదిత్యుఁడు మంత్రులతో కలసి సభచేయుచుండెను. ప్రతాపాదిత్యుఁడు కనఁబడినతోడనే అల్లుఁడాయనకడకుపోయి ఆయనకు ప్రణామ మొనరించెను.

ప్రతాపుఁడు కొంచెమైనను సంతోషముగాని చీకాకుగాని కనబఱపక "క్షేమమా?" అని అతి నిశ్చలభావముతో నడిగెను.

'చిత్త'మని రామచంద్రుఁడు మృదుస్వరముతో ప్రత్యుత్తర మిచ్చెను.

ప్రతాపాదిత్యుఁడు మంత్రివైపు చూచుచు, "భాంగామాథీ పరగణాతహాసీల్‌దారుపై వచ్చిన ఫిర్యాదును గుఱించి ఏమిచేసితివి?" అని యనెను.

మంత్రి పెద్దకాగిత మొకటి పైకితీసి రాజావారిచేతి కిచ్చెను. రాజవారది చదువ నారంభించిరి. చదువుచు చదువుచు ముఖమును కొంచె మెత్తి "గతసంవత్సరమునకువలె

ఈయేఁటకూడ మీవైపు వరదలు రాలేదుకదా?" అని అల్లుని ప్రశ్నించిరి.

రామచంద్రుఁడు—"చిత్తము లేదు. ఆశ్వయుజమాస-మున నొకమాఱు—"

ప్రతాపాదిత్యుఁడు—"దీని నక లొకటి ఉంచితివా, మంత్రీ?" అని మంత్రితో ననుచు మంత్రివ్రాసినది చదువుచుం-డెను. చదువుట పూర్తియైన పిదప "అంతఃపురములోనికి వెళ్లు-ము బాబూ," అని అల్లునితో ననెను.

రామచంద్రుఁడు నెమ్మదిగ లేచెను, మామగారికి తన-కంటె నేది విలువగలవస్తువో పోల్చుకొనెను.

## తొమ్మిదవ పరిచ్ఛేదము

రామమోహనుఁ డంతఃపురములోనికి వచ్చి, "విభను నమస్కరించి, "అమ్మా! నిన్ను చూడవలెనను నాశతో వచ్చితిని," అనిచెప్పినప్పుడు విభమనస్సున నెంతయో ఆనంద ముదయించినది, మోహానునియెడల ఆమె కెంతయో ప్రేమ! నానావిధములగు పనులనడుమ సందుచేసుకొని మోహానుఁడు విభను చూచి పోదమని అప్పుడప్పుడు వచ్చుచుండెను. ఎట్టియావశ్యకత లేకున్నను, తనయవకాశమునుబట్టి, విభను చూడవలెననియే కేవలము వచ్చిపోవుచుండువాఁడు. రామమోహాను నెదుట విభ కేవిధమైన సిగ్గును లేదు. బలిష్ఠుఁడును, వృద్ధుఁడును, దీర్ఘకాయుఁడునైన మోహానుఁడు "అమ్మా" యనుచు వచ్చి యెదుట నిలిచియున్నప్పుడు వానిలో నుదయించునది అలంకారరహితమగు సరళానురాగము. విభ కట్టి సమయములయందు తాను కేవలము చిన్నబాలిక యని అనిపించుచుండును. విభ రామమోహానుని "నీవింత కాలమువఱకు రాలేదేమి-మోహాన్!" అని యడిగెను.

రామమోహానుఁడు— "కుపుత్త్రుఁ డుండవచ్చునుగాని కుమాత యనువస్తు వుండదుకదా అమ్మా! అమ్మ నన్ను పిలువనంత కాలము వెళ్లనని నాలో నే ననుకొంటిని— ఎంత కాలమునకు నేను మాయమ్మ మనస్సునకు వత్తునో చూడవలెనని

నిశ్చయించుకొంటిని—అయిననేమి, ఎన్నటికిని అమ్మకు నా-మాట జ్ఞప్తికి రాలేదు!"

విభ గొప్పచిక్కులో పడినది. తాను కబురుపంపకుండు-టకు కారణము స్పష్టముగ చెప్పలేక పోయినది. కాని కబురు పంపకుండుట మఱచిపోవుట అనువాదములో పొరపాటున్న-దనిమాత్రము తెలిసికొనినది. అయినను అది పొరపా టెట్లో మోహానునకు బోధపఱపలేకపోయినది.

విభ కంగారుపడుచున్నదని కనిపెట్టి రామమోహానుఁడు "లేదమ్మా రాకపోవుటకు నిజమైనకారణ మదికాదు— నాకు తీరినది కాదు. అందుచేత రాలేకపోతిని" అని యనెను.

విభ—"కూర్చుండుము మోహాన్, కూర్చుండి మీ ఊరిమాటలు చెప్పుము."

కూర్చుండి రామమోహానుఁడు చంద్రద్వీపము వర్ణింప నారంభించెను. గడ్డము చేతిపై నానుకొని విభ తదేకధ్యాన-ముగ వినుచుండెను. ఆమాటలు విభమనస్సున నెట్టియూహా-లను పుట్టించుచుండెనో, ఆనాఁడు విభ ఆకాశమున నెన్నెన్ని-మేడలను, ప్రాసాదములను కట్టుచుండెనో చెప్పుట కెవరితరము! మోహా నిప్పుడు గతసంవత్సరపు వరదలమాట చెప్ప నారం-భించెను—తన ఇల్లు వాఁకిలి వరదలలో కొట్టుకొనిపోయినది; తనముసలితల్లిని వీఁపుపై కూర్చుండఁబెట్టి ఈఁదుకొనిపోయి దేవాలయశిఖరముపై కూర్చుండబెట్టెను, వారిద్దఱు నా-

రాత్రి యంతయు నచ్చటనే గడపవలసివచ్చినది—విభ యీకథ మిగుల యాతురతతో వినుచుండ ఆమెలోనుండు చిట్టిగుండె దడదడ కొట్టుకొనసాగినది.

కథ పూర్తియైనతోడనే మోహానుఁడు రెండుజతలు గాజులు బయటికి తీసి "ఇవి నీకొఱకు తీసికొనివచ్చితిని, ఇవి నీవు తొడుగుకొనియుండ నాకు చూడవలెనని ఉన్నది." అని యనెను.

విభ తనచేతినున్న బంగారుగాజులలో నాల్గింటిని తీసి మోహాను తెచ్చినవానిని తొడుగుకొని నవ్వుచు తల్లి యొద్దకుఁ బోయి, "అమ్మా మోహానుఁడు నీవిచ్చినగాజులు తీయించి ఈ-గాజులు తొడిగించెను," అని చెప్పెను.

తల్లి కోపపడక నవ్వుచు "మోహాను నీకు ముస్తాబు చేయుచున్నాఁడా! అవి నీ చేతికి ఎంతయో అందము నిచ్చు-చున్నవి" అనెను.

దీనివలన రామమోహానునకు ఉత్సాహమును, సంతో-షమును కలిగినవి. రాణి వానిని తీసికొనిపోయి తానే స్వయముగా దగ్గఱనిల్చుండి వానిచే భోజనము చేయించినది.

మోహానుఁడు కడుపార భోజనముచేయుట చూచి రాణి మిగుల సంతసించి భోజనానంతరము "ఆ 'ఆగమని' లోని పాట పాడుము మోహాన్ వినవలెనని యున్నది." అని యనెను.

మోహాను విభవైపు చూచుచు పాట పాడుచుండెను.

రామమోహానుని కనులనుండి నీటిధారలు పడుచుండెను, విభవైపు చూచుచు రాణికూడ కనులు తుడుచుకొనుచుండెను, ఆగమనిపాట వినుటవలన రాణికి తన 'విజయ' మాట జ్ఞాపకము వచ్చినది.

సాయంకాల మగుచున్నది, పురనారీగణముతో నంతఃపురము నిండుచున్నది. అల్లునిఁ జూచుటకును, తమతమసంబంధముల కుచితమగునట్లు అతనిని హాస్యమాడుటకును ఇరుగుపొరుగులవారు ఒక్కొక్కరుగ వచ్చుచున్నారు. ఆనందము, సిగ్గు, సంకోచము—ఇవియన్నియు కలసి "ఏమికాఁబోవుచున్నదో" యను నొక అస్పష్టభావమును విభమనస్సున కల్పించుచున్నవి, ఆమె ముఖమును రక్తిమతో నింపినవి; కాళ్లుచేతులు చల్లనగుచున్న ట్లామె కనిపించినది. మనస్సున నున్నది సుఖమో కష్టమో ఆమెకే తెలియలేదు.

అల్లుఁ డంతఃపురమున ప్రవేశించినతోడనే రమణీమణులతనిని నాలుగువైపులను ముట్టడించుట మొదలుపెట్టిరి. నవ్వు వరదలై పరుగెత్తుచున్నది. నలుదిక్కులనుండియు హాస్యపుమాటలు కోకిలస్వరములతో వచ్చి తగులుచున్నవి, మృణాళహస్తములు మొట్టికాయలు పెట్టుచున్నవి, పుష్పములవంటి వ్రేళ్లచివరనుండు గోళ్లతనిని గిల్లుచున్నవి. రామచంద్రుఁడు ఏమియుచేయలేక ఇటునటుచూచుచు నిలిచియున్న సమయ-

మునసడిమివయస్సునసుండు స్త్రీయొకతె అతనిపక్షమయి దగ్గఱకు వచ్చినిలిచినది. ఈమె నోటివెంట వచ్చుమాటలకు మార్దవము తక్కువ, అవి యంతకంతకు మోటైనవి. చిట్టచివర కామె యెవ్వరును వినరానిమాటలుకూడ పలుకుట ప్రారంభించినది, పురస్త్రీలనోళ్లుమూసికొనిపోయినవి. 'థాకో దీదీ'*మణి నోరు తెఱవలేక పోయినది, విమల దీదీ నోరుమూసికొని బయటికి వెళ్లిపోయినది. 'మాలతి' తల్లిమాత్రము జోరైన మాటలు నాలుగు వినిపించుచున్నది. ఆమధ్యను గట్టిగాకేకలు వేయుచు "నీముఖమునసుండునది నోరుకాదే, చీపురు," అన్నదిఆక్రొత్తగా వచ్చిన యామెది. "నీముఖము పెంటకుప్పకంటెతక్కువైనదే, చీపురుతో నెంత తుడిచినను శుభ్రము కాదు" అని యనుచు గదిలోనుండి పైకి వెళ్లినది మాలతితల్లి. ఈవిధమున, ఒకొ్క-క్కరుగ, గదివిడిచి అందఱును బయటికిపోయిరి, రామచంద్ర-రాయలునకు కొంతవిరామము దొరకినది.

అప్పు డాక్రొత్తగా వచ్చినయామె రాణిగదిలోనికి పోయెను. రాణి యప్పుడు దాసీవాండ్రనందఱిని నొక్కచోట కూర్చుండబెట్టి వారికి విందుచేయుచుండెను, రామమోహ-నుడుకూడ నొకమూలను కూర్చుండి భోజనముచేయుచుం-డెను. ఈమె రాణియొద్దకు పోయి, "ఇదిగో రాణి యిక్కడ!" అన్నది ఈమాటలు రామమోహనుని చెవినిపడగానే వాడు ఉలికిపడిఅటువైపుచూచెను; తత్క్షణమే విస్తరివిడిచి పెద్దపులివలె

*దీదీ=అక్క.

నుతికి ఆక్రాంతగా వచ్చిన యాఁడుదానిపైఁబడి తన రాక్షసబలమంతయుఁ బ్రయోగించి తనచేతితో నామెచేతులను గట్టిగాఁబట్టుకొని, "మీ రెవరో నేనెఱుఁగుదును ఠాకూర్," అనెను. అట్లనుచు ఆతలమీఁదనున్న ముసుగు నూడలాగెను-ముసుగులోనున్నది. వేఱెవ్వరును కాదు రమాయి ఠాకూరుగారే! కోపమువలన రామమోహానుని దేహమున వణఁకుపుట్టినది, తనమీఁదనుండు కండువాపారవైచి రమాయిని అతిసులభముగా ఆకాశముపై కెత్తిపట్టుకొని, "నేఁడు నాచేతిలోనున్నది నీ చావు," అనుచు అతని రెండుమూఁడుమాఱులు ఇటునుండి అటు, అటునుండి ఇటు వడిగా త్రిప్పెను. రాణి అది చూచి మోహానునొద్దకు పరుగెత్తుకొని వచ్చి, "ఏమి మోహాన్, ఏమి నీవుచేయుచున్నది?" అని గడబడపడుచు ననెను. రమాయి "శరణు శరణు బాబూ, బ్రహ్మహత్య చేయకుము, నన్ను క్షమింపుము," అని మిక్కిలి భయపడుచు వేఁడుకొనెను. నాలుగు వైపులనుండి కేకలు లేచినవి. రామమోహానుఁడు రమాయిని క్రిందకు దించి కోపముతో వణఁకుచు, "ఓరి యభాగ్యుఁడా, నీకు చచ్చుటకు వేఱుస్థల మేదియు దొరకలేదఁటరా, ఇక్కడికి వచ్చితివి?" అని యనెను.

"మహారాజావారు నన్నిక్కడికి పంపినారు," అని రమాయి యనెను. మోహానుఁ డది విని "ఏమంటివిరా, విశ్వాసఘాతకుఁడా! ఆమాట నీనోట మఱియొకతూరి వింటిని యనిన

నీముఖము ఆనేలపై రాసెదను," అనుచు వానిదగ్గఱకు పోయి వానిపీక పట్టుకొనెను.

రమాయి యప్పుడు మిగుల భీతిఁజెంది కేకలు వేయ-నారంభించెను. రామమోహనుఁడు రమాయిని తన కండు-వాతో కట్టిమూటవలె చేతులలోనుండి వ్రేలాడించుచు బయ-టకుఁ బోయెను.

ఈసంగతి ఇంతలో నాలుగువైపుల నల్లుకొనినది. అప్పటికి రాత్రి పదిపదునొకండు దాటినది. భావముఱఁది వెళ్లి ప్రతాపాదిత్యునితో నల్లుఁడు రమాయిని స్త్రీవేషముతో నంతఃపురములోనికిఁ దీసికొనిపోయెననియు, అక్కడ నావిదూ-షకుఁడు పురరమణులనే కాక రాణినిఁగూడ నెగతాళిచేయ నారంభించెననియుఁ జెప్పెను.

అది విని ప్రతాపాదిత్యుఁ డొక భయంకరరూపమును దాల్చెను. కోపముచే నతని దేహమంతయు వణఁక నారంభిం-చెను. కేసరములు పొడుచుకొని వచ్చుచున్నసింహమువలె లేచి పఱుపుపై కూర్చుండి 'లఖ్‌మన్'* సరదారును పిలుచు-కొనిరమ్ము" అని కేకలువేయుచు దగ్గఱనున్న నౌకరతో ననెను. లక్ష్మణ్ సర్దార్‌తో "రామచంద్రరాయని నఱికి యతనితల నా కీరాత్రియే చూపవలెను," అని రాజాజ్ఞాపిం-చెను. లక్ష్మణ్‌సర్దార్ సలాముచేయుచు "చిత్తము మహా-

* లక్ష్మణ.

ప్రభూ!" అన్నాఁడు. బావమఱఁది రాజుగారికాళ్లు పట్టుకొని, "క్షమింపుఁడు మహారాజా అట్టిపనిచేయఁబోకుఁడు, విభమాట కొంచెమాలోచింపుఁడు" అనెను.

ప్రతాపుఁడు మొదటికంటె భయంకరముగ "నేటిరాత్రే రామచంద్రునితల నేను చూడవలెను." అన్నాఁడు దానికి జబాబుగా. బావమఱఁది రాజుకాళ్లు గట్టిగాపట్టుకొని "వారిద్దఱును అంతఃపురమున సంతసకొనియున్నారు. క్షమింపుఁడు మహారాజా క్షమింపుఁడు!" అనెను. ప్రతాపాదిత్యుఁడు కొంతసేపేమియు ననక యూరక యుండి, "చూడుము లఛ్మన్ ఉదయము రామచంద్రుఁడు అంతఃపురమునుండి బయటకు వచ్చుసమయమున అతనిని చంపవలెను—ఆపూచీ నీదే జ్ఞాపకముంచుకొనుము," అని యనెను. తానసుకొన్నదానికంటె కథ చాలదూరము వెళ్లినదని కనిపెట్టి బావమఱఁది విభ గదికడకు వచ్చితలుపుతట్టెను. దూరమున నడిరేయి నహాబత్ వాఁగుచున్నది. ఆనిశ్శబ్దమున దూరమునుండి వచ్చుచున్న నహాబత్ ధ్వని మెల్లగా వీఁచుచున్న దక్షిణవాయువు, చల్లగా కాయుచుండు వెన్నెల,—ఇవియన్నియు కలిసి నిద్రించుచున్న ప్రాణులలో స్వప్నమును రేపుచున్నవి. తెఱచియున్న కిటికీలోనుండి వెన్నెల ప్రవేశించి విభ మంచముపైఁ బడుచున్నది, రామచంద్రరాయలు నిద్రించుచున్నాఁడు విభ చేతిపై తలనానుకొని ఏమో యాలోచించుచుఁ బఱపుపైఁ గూర్చుండియున్నది. విభ ముఖము వెన్నెలవైపు త్రిప్పియున్నది. కనుల-

నుండి రెండుమూఁడు అశ్రుబిందువులు రాలినవి—తా నను-
కొనిన క్లేదియునుజరుగలేదని, అనుకొనుచున్నదేమో! లోపున
దుఃఖము పుట్టుచున్నది గాఁబోలు! ఎంతకాలమునుండియో
యెదురుచూచుచుండిన దినము వచ్చినదే!

పఱపుమీఁదఁ బరుండినది మొదలు రామచంద్ర రాయలు
విభతో నొక్కమాటయైన నాడలేదు. ప్రతాపాదిత్యుఁడు
తన్నవమానపఱచెను—తా నెట్లు తిరిగి యతనినవమానపఱచఁ-
గలఁడు?—విభను విడిచి వెళ్లిపోవుటవలననా? రామచంద్రుఁ
డటుప్రక్కకుఁ దిరిగి పరుండి విభతో నిట్లనవలెనని తలఁచు-
చుండెను—"నీవు యశోహరపు రాధీశుఁడగు ప్రతాపాదిత్యుని
కొమార్తెవు. చంద్రద్వీపాధిపతియగు రామచంద్రుని ప్రక్క-
నెట్లుండఁగలవు? నీకుతగినపదవి యిదికాదే!" ఇట్లనవలెనని నిశ్చ
యించుకొనెను, కాని ఆప్రక్కను తిరిగినవాఁడు ఈప్రక్కను
తిరుగనేలేదు. అతని గొప్ప అతనిపౌరుషము—అంతయు విభ-
మీఁదనేగదా! విభ నిద్రలేక కూర్చుండి ఆలోచించుచున్నది,
ఒకతూరివెన్నెలవైపు ముఖము త్రిప్పుచున్నది, ఒకతూరి భర్త
వైపుతిరుగుచున్నది, అగుండెలలో వణఁకుపుట్టుచున్నది,లోపున
నెంతయో బాధపుట్టుచున్నది—ఆమె ఉండియుండి పెద్ద-
నిట్టూర్పు విడుచుచున్నది. రామచంద్రుని నిద్రకు హఠాత్తుగ
భంగము కలిగినది, చూచుపరికి ప్రక్కను కూర్చుండియున్న-
విభ కన్నులనుండి నీరు కారుచున్నది. హఠాత్తుగ నిద్రనుండి
లేచుటవలన, తత్క్షణమే తనయవమానము జ్ఞప్తికి రాలేదు,

మంచినిద్రవలన మనస్సు మొదటిస్వస్థతనుబొందినది; అందుచేరి-యున్న కోపమంతయు చెదరిపోయినది. అట్టిసందర్భమున అశ్రుధారలతో నిండియున్నవిభ కోమలముఖ మతనికంట-పడినది. అతనిమనస్సు కరిగినది, దయతో నిండినది. అప్పు డాయన విభ చేయి పట్టుకొని, "ఏడ్చుచున్నా వేల విభా?" అని యడిగెను. విభ ఏమియు జబాబు చెప్పలేక తడబడుచుండెను. విభకంటి కేమియు నగపడలేదు. విభ మాటాడక పరుండఁ బడిపోయెను. రామచంద్రుఁ డప్పుడు లేచి విభతలను మెల్లగ తనయొడిలోఁ బెట్టుకొని ఆమె కనులను తుడువసాగెను. అట్టి సమయమున ఎవరో వచ్చి తలుపుకొట్టిరి. "ఎవరది?" అన్నాఁడు రామచంద్రరాయలు. "తలుపు తీయవలెను తత్క్షణమే" అని జబాబు వచ్చినది బయటినుండి.



## పదియవ పరిచ్ఛేదము.

రామచంద్రరాయలు పడకగది తలుపుతీసి బయటకు వచ్చెను. మహారాజుగారి బావమఱఁది రమాపతి యతనిని జూచి "నీవు ఈక్షణమే పాఱిపోవలెను, ఒక్కక్షణమైనను, ఆలస్యము చేయఁగూడదు." అనెను.

అర్ధరాత్రి వేళ అకస్మాత్తుగా ఆమాట వినుటవలన రామచంద్రునికి మతిపోయినట్లైనది, ముఖము తెల్లఁబారిపోయినది, "ఏమి, ఏమి, జరిగినదేమి?" అని యడిగెను.

"జరిగినదంతయు నేనిప్పుడు చెప్పను, నీవుమాత్రము క్షణమైన నాలస్యము చేయక పాఱిపోవలెను."

విభ మంచము దిగివచ్చి, "ఏమి జరిగినది మామా? ఏమి జరిగినది?" అని యడిగెను.

"అదియంతయు నిప్పుడు చెప్పిన లాభము లేదమ్మా."

విభకు లోపునుండి వణఁకుపుట్టినది. వసంతరాయలామెకు జ్ఞప్తివచ్చెనొకమాఱు. ఉదయాదిత్యుఁడు జ్ఞప్తికివచ్చెనొకమాఱు, "ఏమి జరిగినదో చెప్పవు మామా?" అని మఱియొకతూరి యడిగెను.

ఆప్రశ్న కేమియు నుత్తర మీయక రమాపతి రామచంద్రునితో "ఆలస్యము చేయక యిక్కడనుండి పాఱిపోవుసుపాయ మొకటి చూచుకొనుము" అని యనెను.

చేటాలున విభమనస్సున కొక భయంకరమగు యనుమానము తట్టెను, వెళ్ళిపోఁబోవుచున్న మామగారి కడ్డపడి “మామా, నీకాళ్ళు పట్టుకొనుచున్నాను, ఏమి జరిగినదో చెప్పవలెను,” అని యన్నది.

రమాపతి భీతిఁజెంది నాలుగువైపులఁ జూచుచు, “కేకలు వేయకుమమ్మా, అంతయు నీతోఁజెప్పెద నూరకుండుము,” అనెను.

కొంచెము కొంచెముగ రమాపతి జరిగినదంతయు విభతోఁ జెప్పెను. అది విని విభ బిగ్గరగ నేడ్వఁబోవుచుండుట, చూచి రమాపతి యామెనోటిని మూసి, “ఊరకుండుము తల్లీ, అంతయు మంటఁగలసిపోవును జాగ్రత్త” అనెను. విభ రుద్ధశ్వాసముతో నోరు బిగించుకొని యేడ్చుచు నక్కడనే చతికిలఁబడిపోయినది.

రామచంద్రరాయ లాశలేనివానివలె, “నే నిప్పు డేమి చేయఁగలను? పాఱిపోవుటకు దారేదియు లేదే!” అనుచు నచ్చటనే నిలువఁబడిపోయెను.

“ఈ రాత్రి అన్నివైపులను పహారా చురుకుగా జరుగుచున్నది. నేను నాలుగుచోట్లను చూచి వచ్చెద, దారేదైన నుండునేమో!” అనుచు రమాపతి అచ్చటనుండి వెళ్ళఁబోవుచుండ, విభ యాతనిఁబట్టుకొని “ఎక్కడికి వెళ్ళెదవు మామా, నీవు మమ్ములను విడిచిపోవద్దు ఇక్కడనే యుండుము” అనెను.

"విభా, నీకు పిచ్చెత్తినది, నేనిక్కడ కూర్చుండుటవలన నెవ్వరికిని నెట్టిమేలును గలుగదు, నాలుగువైపులకును పోయి స్థితిగతులు చూచివచ్చుట దానికంటె మంచిది."

విభ బలవంతమున లేచి నిలిచినది. ఆమెకాళ్లు గజ-గజ వణఁకుచున్నవి, "మామా, నీవు మఱికొంచెమునే పిక్క-డనే యుండుము నేనొక్కమాఱు అన్నయ్యదగ్గరకుఁ బోయి-వచ్చెదను," అని యనుచు ఉదయాదిత్యునిగదిలోనికి వెళ్లినది.

క్షీణచంద్రుఁ డప్పుడే అస్తమించుచున్నాఁడు. అంధ-కార మన్నివైపులను గ్రమ్ముకొని వచ్చుచున్నది. ఎటువైపు-నను చప్పుడు లేదు. రామచంద్రరాయలు గడపపై నిలువఁ-బడి చూచుచున్నాఁడు—రాజాంతఃపురమున నుండు రెండు-వరుసలగదులలో నొకదానితలుపైనను దెఱచియుండలేదు, అందఱును నిస్సంశయచిత్తములతో నిద్రించుచున్నారు. ఎదుటనుండు అంగణమున ప్రక్కలనుండు ప్రహరిగోడలనీడ పడుచున్నది, ఒక్కప్రక్కనుమాత్రము వెన్నెలకొంచె మింకను మిగిలియుండెను. అదికూడ క్రమముగా నడిచి పోవుచున్నది. అంధకారము ఒకొక్కయడుగు వేయుచు సమస్తపృథ్విని నాక్రమించుచున్నది, దూరమున కొబ్బరితోఁటలయందు వరు-సలుతీరియున్న కొబ్బెరచెట్లనడుమను జమకూడుచున్నది. క్రమక్రమముగాఒడలినిదాకునంత దగ్గరకువచ్చుచున్నది. నలు-ప్రక్కల వ్యాపించియున్న యంధకారమధ్యమున నాకొఱకు కత్తి యొకటి ఎక్కడ వేచియున్నను యుండవచ్చునుగదా

యని రామచంద్రుఁ డనుకొనుచుండెను. వెనుకనా ముందునాఁ కుడివైపుననా ఎడమవైపుననా? అదిగో ఈమూలను ! ఆమూలను ఏదో కదలుచున్నట్లున్నది. ఎవరైన ఆమూలలలో నొక-మూలను ముసుఁగు వేసికొని కూర్చుండియుండలేదు కదా! నాగదిలో నెవరైన దాఁగొనియుండలేదుకదా! మంచముక్రింద నెవఁడైన నుండునేమో లేక గోడమూలను నక్కియున్నాఁడా! ఇదేరీతిని పలుపలువిధముల ననుకొనుటవలన రామచంద్రుని-యొడలిని భయముచే పులకరింపు పుట్టుచున్నది, దేహమున చెమట క్రమ్ముచున్నది. మామ యేమైన చేయఁదలఁచుకొని ఇక్కడకు వచ్చెనా యని అతనికి భయము వేసిన దొకమాఱు, కొంచెము ముందునకుఁ బోయి నిలుచుండెను. గాలివలన దీప-మారిపోయినది, మనుష్యుఁ డెవఁడో దీప మార్పి యుండును కాబోలు! గదిలో నెవఁడో ఉన్నాఁడు కాబోలు! అని తోఁచి-నది రామచంద్రునకు. రామచంద్రుఁడు రమాపతికి దగ్గఱగా వచ్చి యతనిమీఁదచేయివేసి, "బాబయ్యగారూ!" అన్నాఁడు. "ఏమి బాబూ?" అన్నాఁడు రమాపతి. విభ దగ్గఱనుండిన నెంతబాగుగనుండును అనిపించినది రామచంద్రునికి. రమా-పతిపై నమ్మకము చాలదతనికి.

విభ అన్నదగ్గఱకు పోయి యేడ్చుచు నేలకూలినది, నోటివెంబడి మాటరాలేదు. సురమ యామెను లేవఁదీసి కూర్చుండఁబెట్టి "ఏమి జరిగినది విభా?" అని యడిగెను. విభ సురమను రెండుచేతులతో గట్టిగా కౌఁగిలించుకొని ఏడ్చు-

చుండెను. నోటితో నేమియుఁ జెప్పలేకపోయెను. ఉదయాదిత్యుఁడు ముద్దుగా విభతలపై చేయివేసి "ఏమి చెల్లీ, ఏమి జరిగినదమ్మా?" అని యడిగెను. అన్న చేతులను పట్టుకొని, నాతో కలిసిరమ్ము, నీకంతయు బోధపడునన్నయ్యా" అన్నది విభ.

ముగ్గురును కలిసి విభ గదిలోనికిఁ బోయిరి. అక్కడ చీఁకటిలో రామచంద్రుఁడు కూర్చుండియున్నాఁడు, రమాపతి నిలుచుండియున్నాఁడు. "జరిగిన దేమి మామా?" అని ఉదయాదిత్యుఁడు గాబరాపడుచు నడిగెను. రమాపతి సమస్తమును సవిస్తరముగఁ దెలియఁజేసెను. తన పెద్దకండ్లను మఱింత పెద్దవిచేసి సురమవైపు చూచుచునుదయాదిత్యుఁ డిట్లనెను— "నేనిప్పుడే నాన్నయొద్దకు వెళ్లెదను. ఏమైనను, ఆపనిమాత్రము, నాన్నను చేయనీయను; ఎంతమాత్రము చేయనీయను."

సురమ—"మీరు పోవుటవలన లాభ మేమి? అంతకంటె తాతయ్య నక్కడకు పంపుట మేలు, ఆయన యేమైన చేయఁగలుగవచ్చును!"

యువరాజు—"ఔ నది నిజమే!"

వసంతరాయ లప్పుడగాధనిద్రలో నుండెను. కళ్లువిప్పునరికి నుదయాదిత్యుఁడు కనఁబడెను. తెల్లవాఱవచ్చినదని యనుకొని వసంతరాయలు లలితరాగముపై పాట మొదలు పెట్టఁబోయెను.

"కొంపమునిఁగినది తాతయ్యా!" అన్నాఁడు, తాతయ్య పాట నాఁపుచు.

వసంతరాయలు పాట నిలిపి గాబరాపడుచు, "హాఁ! ఏమి? ఏమయినది తాతా, ఏమిప్రమాదము!" అని యడిగెను.

ఉదయాదిత్యుఁడు సమస్తమును తాతయ్యతోఁ జెప్పెను. వసంతరాయలు పఱపుమీఁద చతికిలపడెను, ఉదయాదిత్యుని ముఖమువైపు చూచుచు, "ఎన్నఁడైన నటువంటిది జరుగఁగలదా ? అట్టిది సంభవమే? అని యనుచుండెను.

వసంతరాయలు ప్రతాపాదిత్యునియొద్దకు వెళ్లి "నిజమేనా నాయనా ప్రతాప్, అట్టి దెన్నఁడైన జరుగఁగలదా?" అని యడిగెను. ప్రతాపుఁడు అప్పటి కింకను శయనగృహమునకుఁ బోలేదు, సభామందిరమందే యుండెను. ఆజ్ఞయిచ్చినతరువాత లక్ష్మణ్ సరదారును కొంచెమాగుమని చెప్పవలెనని ప్రతాపునకు బుద్ధిపుట్టినది. కాని యాకోరిక యెంతలో పుట్టినదో అంతలోనే మాయమైపోయినది. రెండుమాటలవాఁడు కాఁడు ప్రతాపుఁడు, ఆజ్ఞయిచ్చిన నోటితోనే ఆయాజ్ఞ నాఁపుట ప్రతాపుఁడు చేయుపని కాదు—ఆజ్ఞలతో పరిహాసమా! కాని విభమాట యేమికాను? విభ విధవ యానే! కాని రామచంద్రుఁ డిచ్ఛాపూర్వకముగ కాలుచున్నమంటలోనికి దుమికి చచ్చిపోయినను విభ విధవ కావలసినదేకదా ! రామచంద్రుఁ డిప్పుడు చేసినదేమి?—ఇచ్ఛాపూర్వకముగ ప్రతాపునిరోషా-

గ్నిలోని కుతికెను, విభ విధవ యగుట దానిఫలస్వరూపమే; అది యతఁ డెట్లాపఁగలఁడు? ఇదియంతయు నింత స్పష్టముగా ప్రతాపునిమనస్సున నుదయింప లేకపోయినను, అప్పుడప్పుడు జరిగినదంతయు కండ్లకు స్పష్టముగఁ గనబడినట్లయి అతనిలో నొకవిధమైన అశాంతియు ఎప్పుడు తెల్లవారునా యనుకోరికయు మాటిమాటికిఁ బుట్టుచుండెను. ప్రతాపుఁ డట్టియవస్థలలో నుండ వృద్ధవసంతరాయలు గడబడపడుచు గదిలోనికి వచ్చి ప్రతాపుని రెండుచేతులను పట్టుకొని, "నిజమే! నాయనా ప్రతాప్, అట్టి దెన్నఁడైన జరుగఁగలదా?" అని ప్రశ్నించెను.

ప్రతాపాదిత్యుఁడు రౌద్రుఁ డగుచు, "ఏల జరగఁగూడదు?" అని యనెను.

వసంతరాయలు—"వాఁడు కుఱ్ఱవాఁడు, ముందు రాఁబోవునది తెలిసికొన లేనివాఁడు—అట్టివానిపై వెళ్లఁబుచ్చఁదగినది కాదు నీక్రోధము"

ప్రతాపాదిత్యుఁడు—"కుఱ్ఱవాఁడా! మంటలో చేయిపట్టినయెడల చేయి కాలునని తెలిసికొనునటి యూహ రాలేదా వానికి! కుఱ్ఱవాఁడు, పాపము! మూర్ఖులయెదుట పండ్లిగిలించుకొనుచు హాస్యములుచెప్పి పొట్టపోషించుకొనుచున్న దరిద్ర గొట్టు మూర్ఖబ్రాహ్మణుని నొకనిని ఆడు వేషము వేయించి రాణితో నెగతాళిచేయవలెనని తీసికొనివచ్చుటకు తగినతెలివిగలవానికి అట్టితెలివివలన గలుగులాభనష్టములు తెలిసి-

కొనుబుద్ధి యేల కలుగలేదు ? బుద్ధి తలలో దూరుసరికి తల దేహమును విడిచి పాఱిపోవును; దుఃఖకరమైన సంగతి యిదియే!" ఇట్లు మాటలనుచున్నకొలఁది నతని దేహమున మఱింత వణఁకు పుట్టుచున్నది, అతని ప్రతిజ్ఞ మఱింత దృఢపడుచున్నది, అతని యధీరత మఱింత యధికమగుచున్నది.

"పాపము, వాఁడు వట్టికుఱ్ఱవాఁడు, ఏమియు నెఱుఁగని పసిబాలుఁడు !" అని తలయాడించుచు అనుచుండెను వసంతరాయలు.

ప్రతాపాదిత్యుఁడు మఱి యోర్చియుండలేక ఇట్లనసాగెను— "యశోహరపుర రాయలవంశమునకు మానావమానములు దేనివలన కలుగునో అజ్ఞానము నీకున్నయెడల నీపండుతలపైని మొగలాయీపాదుషాల పగిడీపెట్టుకొని తిరుగుచుండఁగలిగియుందువా *బాబా ? పాదుషా ప్రసాదగర్వితుఁడవై నీవు తల మీఁదికెత్తి తిరుగుచుండుట చూచి నేను తలవాల్చుకొనవలసివచ్చుచున్నది. యవనులపాదములనుండు మట్టిని తిలకము చేసి నీవు నొసటఁ బెట్టుకొనుచున్నావు. ఆ యవనపాదధూళిమయమగు నీతలను ధూళిపాలు చేయవలెనని నాకు కోరికగానుండెను, కాని విధాత యడ్డుపడుటవలన అది నెఱవేఱలేదు. రాయలవంశమునకు నేఁడెంతయవమానము జరిగినదో నీవు గనుక పోల్చుకొనలేకుంటివి, నీవు గనుక

---

* పినతండ్రీ.

మనవంశము నవమానపఱచినవానిని క్షమింపుమని యడుగుకొనుచున్నావు!"

"నాకిప్పుడు బోధపడినది ప్రతాపా!" అన్నాఁడు వసంతరాయలు. "నీవు కత్తి యెత్తితి వెప్పుడో అది యెవరో యొకరిపైఁ బడియే తీరవలెను. దానికి గుఱియైన నేను ప్రక్కకు జరిగిపోవుటచేత నాకుమాఱుగా మఱియొకరు నీకు కావలసివచ్చినది. నీమనస్సులో దయపుట్టక, నీక్రోధక్షుధ కెవరైన నాహారముగ కావలసియుండిన, నన్నే ఆయాహారముగఁ దీసికొనుము. ఇదిగో నీపినతండ్రితల," అనుచు వసంతరాయలు తనతలను వాల్చెను. నీకిది తృప్తినిచ్చుచో దీనిని తీసికొనుము-కత్తిని తీసికొనిరమ్ము—ఈతలపై జుట్టులేదు, ఈముఖమున యౌవనము లేదు. యమునియొద్దనుండి నిమంత్రణపత్రము వచ్చియున్నది, దాని కనుగుణమైన ముస్తాబే ఇప్పు డీతలలో కనఁబడుచున్నది. (వసంతరాయలముఖమున చిఱునవ్వు కనబడుచున్నది) ఏదైనను కానిమ్ము, కాని పాలుత్రాగుపసిబిడ్డయగు మన విభ కంట నీరు—" ఇట్లనుచు వెక్కి వెక్కి ఏడ్వనారంభించెను. "నన్నాఖరు చేసివేయుము ప్రతాపా, బ్రతికిన సుఖ మింక లేదు, విభ కంట నీరు చూడకముందే నన్ను చంపివేయుము నాయనా!"

వసంతరాయ లిట్లనినతోడనే ప్రతాపాదిత్యుఁడు మెల్లఁగ లేచి బయటకుఁ బోయెను, కథ అందఱకును తెలిసిపోయినదని పోల్చుకొనెను. క్రిందికిఁ బోయి ప్రహరీవాండ్రను

పిలిపించి, కోటనంటియుండు కాలువలో పెద్ద పెద్ద దూలముల నడ్డు వేయుమని చెప్పెను—ఆకాలువలోనే యున్నది రామచంద్రుని త్రోవ. ఆరాత్రి అతిజాగ్రత్తగా నుండవలెననియు, కోటనుండి యెవ్వరినిఁగూడ బయటకు పోనీయఁగూడదనియు వాండ్రతోఁ జెప్పెను.



## పదునొకండవ పరిచ్ఛేదము.

వసంతరాయ లంతఃపురములోనికి తిరిగివచ్చెను. విభ తాతను చూచినతోడనే యేడ్వనారంభించెను. వసంతరాయలు మరి, ఉదయునిచేతులు పట్టుకొని "తాతా నీవు దీని కేదైన నుపాయము కనిపెట్టవలెను," అనుచు మఱి యాపుకొనలేక ఏడ్వసాగెను. రామచంద్ర రాయలు గడిబిడిపడుచువణఁకుటకు మొదలుపెట్టెను. ఉదయాదిత్యుఁడు కత్తి చేతఁబుచ్చుకొని "మీరు నాతో కలిసి రండు," అనెను. అందఱును వెనుక వచ్చుచుండుట జూచి ఉదయుఁడు, "విభా నీ విక్కడనే యుండుమమ్మా, నీవు మాతో రావద్దు" అనెను. విభ వినలేదు, రామచంద్రుఁడుకూడ, "విభను మనతో రానిమ్ము"అని అనెను. పాదములెత్తి వ్రేళ్లపై నడచుచు అందఱును అతిభయముతో నడచుచుండిరి, అన్నివైపులను చిట్టచీఁకటి. అంధకారగర్భము-నుండి భయంకరమగునదేదో తనచేతులను చాచుచున్నదా యనిపించుచుండెను. రామచంద్రుఁడు నాలుగువైపులను జాగ్రత్తగాఁ జూచుచుండెను. రమాపతి జ్ఞప్తికివచ్చి ఆతనిపై ననుమానించుచుండెను. అంతఃపురమునుండి బయ-టకుఁ బోవుద్వారముకడకు వచ్చి చూచుసరికి ఆతలుపులు మూసియున్నవి. "అన్నయ్యా, క్రిందికి పోవుద్వారము తెఱచియుండునేమో, అటుపోయి చూదము," అని భయ-

ముతో వణఁకుచు నన్నది విభ. అందఱును అటువైపునకుపోవు మెట్లు దిగ నారంభించిరి; చీఁకటి; ఎంతకును తెలుగనట్లున్నవి మెట్లు. ఈ మెట్లు దిగువారికి మఱల వానినెక్కుట కవసరముండ దేమో యనిపించుచున్నది రామచంద్రునికి-ఇది వాసుకి నివసించు కన్నమునకు మార్గమా? పాతాళమునకు పోవు మెట్లా ఇవి? అనిపించుచున్నది. మెట్లు దిగి చూచుసరికి ఆద్వారముకూడ మూసియున్నది. అందఱును మరల నామెట్ల నెక్కిరి. అంతఃపురమునుండి బయటికిఁ బోవుద్వారము లెన్ని యున్నవో అన్నియును మూసియున్నవి. రెండుమూఁడుమారు లందఱును అక్కడనుండు ప్రతిద్వారమునొద్దకును బోయి పరీక్షించిరి ప్రతిద్వారమును మూసియున్నది.

బయటికిఁ బోవుటను దారి యేదియు లేదని తెలిసికొనఁగానే విభ కన్నీటిని తుడుచుకొనుచు భర్తను చేయిపట్టుకొని తన పడకగదిలోనికి తీసికొనిపోయినది, ధైర్యము వహించి ద్వారముకడ ఠీవిగా నిలుచుండి "నిన్నెవ రీగదిలోనుండి బయటికి తీసికొనిపోఁగలరో చూచెదను. నీవెచ్చటకు పోయినను నేను నీయెదుటనే నిలిచియుండెదను, నన్నెవరాపఁగలరో చూచెదను," అని విభ దృఢస్వరముతో నన్నది. ఉదయుఁడు ద్వారముకడ నిలువఁబడి "నన్ను చంపనిదే గదిలో నెవ్వఁడును ప్రవేశింపలేఁడు," అనెను. సురమ ఏమియు మాటాడక భర్తప్రక్కనే నిలుచుండెను. తాతయ్య అందఱికంటె ముందుగ నిలుచుండెను, మామ మెల్లమెల్లగ వెళ్లి-

పోయెను కాని యీ ఏర్పాట్లవలన లాభమున్నదని తోఁచ లేదు రామచంద్రునకు. "ప్రతాపాదిత్యుఁ డిట్టివాఁడుకదా, అతఁడు చేయలేనిదేమున్నది? ఉదయాదిత్యుఁడును విభయు నడ్డురాఁగలరనియాశ అంతగాలేదు. ఎట్లైన నీయింటినుండి బయటికిఁ బోయినఁ గాని బ్రతుకాస తక్కువే!" అని యని-పించిన దతనికి.

కొంచెముసేపుండి సురమ మృదుస్వరముతో ననెను, "మన మిక్కడ నిట్లు నిలబడుటవలన లాభములేదు. పైగా అపాయముకూడ కలుగవచ్చును. అడ్డుపెట్టినకొలఁది మామా-న్నగారిసంకల్పము దృఢమౌను—ఈరాత్రియే కోటవదలి పాఱిపోవుటుపాయ మేదైన కనిపెట్టవలెను.

ఉదయాదిత్యుఁడు సురమవైపుచూచుచు నేదోయాలో చించుచుండెను. కొన్నినిమిషము లట్లుండి "ఔనది నిజమే! కనుక నేను వెళ్లి బలము ప్రయోగించి చూచెద"నని అనెను.

సమ్మతిని సూచించుచు దృఢముగా నిలఁబడి వెళ్లుమని-నది సురమ.

ఉదయాదిత్యుఁడు తన యుత్తరీయము నచ్చట విసరి-వేసి వెళ్లిపోయెను. సురమ కొంతదూర మతనితో కలిసి వచ్చి ఏకాంతస్థానమునకు రాఁగానే ఉదయాదిత్యుని తన రెండుచేతు-లతోపట్టుకొని కౌఁగిలించుకొనెను. ఉదయాదిత్యుఁడు ముఖము వంచి ఆమెను మనఃపూర్తిగ ముద్దుపెట్టుకొని చీఁకటిలోని

కంతర్ధానమాయెను. సురమ కండ్ల నీరుపెట్టుకొని తనపడక-గదిలోనికి వచ్చి చేతులు జోడించి ప్రారంభించినది—"నేనే పతివ్రత నైనచో నీవు నాభర్త నతని తండ్రి చేతులలో పడకుండ కాపాడుము తల్లీ! నిన్ను నమ్మియే నే నతని నిప్పుడు విపత్తులోనికి పంపితిని. నన్ను నీవు ముంచివేసినచో జగత్తున నెవ్వరును నిన్నిఁక నమ్మరు సుమీ!" ఇట్లనుచు వెక్కివెక్కి యేడ్వ నారంభించినది ఆచీఁకటిలోఁ గూర్చుండి సురమ యెన్నోమాఱులు 'తల్లీ' 'తల్లీ' అనినది, కాని తల్లి కామెమాటలు వినఁబడనట్లున్నది. సురమ తనమనస్సులో తా నాతల్లికి పుష్పాంజలి నిచ్చినది. కాని "తల్లి యాపుష్పముల నంగీకరింప లేదని సురమకుతోఁచినది. "ఏమితల్లీ నేనేమిచేసితినే?" అని యేడ్చుచు అడిగినది సురమ, కాని తల్లి యిచ్చుజవాబు సురమకు వినఁబడ లేదు. నాలుగుదిక్కులను వ్యాపించియున్న గాఢాంధకారమున నాట్యముచేయుచున్న ప్రళయమూర్తియా యనునట్లు సురమకనుల కేదో కనఁబడుచుండెను. సురమ యచ్చట నొంటరిగ కూర్చుండి యుండలేక విభగదిలోనికి వచ్చి చేరుకొన్నది.

"తాత యింకను రాలేదు, ఏమయినదో కదా!" అని జడియుచు వసంతరాయ లనెను.

గోడకు చేరఁబడి నిల్చుండి "ఈశ్వరేచ్ఛ, యేమో-కదా!" అనుచుండెను సురమ.

రామచంద్రరాయలప్పుడు తనయింటి పురాతనభృత్యుం-డైన రామమోహానుని తనమనస్సులో తాను ధ్వంసము చేయుచుండెను. దీనియంతటికిని కారణము వాఁడే. కనుక తనకు చేతనైనన్నివిధముల తనమనస్సులో తాను వానిని శిక్షించుచుండెను. ఉండియుండి తెలివి తెచ్చుకొని, "వానిని శిక్షించు నవకాశము నాకు మఱి చిక్కదేమో!" అని యనుకొనుచుండెను.

ఉదయాదిత్యుం డంతఃపురము దాఁటి వెళ్లిమూసి-యున్నతలుపులను గట్టిగా తన్నుచు—"ఎవఁ డక్కడ?" అని కేక వేసెను.

"నేను మహాప్రభూ, సీతారాముఁడను," అని బయట-నుండి వినఁబడెను.

తత్క్షణమే తలుపుతీయుమని యువరాజు దృఢస్వర-ముతో ననెను.

వాఁడు తత్క్షణమే తలుపుతెఱచెను. ఉదయాదిత్యుఁడు ద్వారముదాటి బయటికిఁబోవుట చూచి వాఁడు చేతులు జోడించి, "క్షమింపుఁడు మహాప్రభూ, నేటిరాత్రి యెవ్వరును అంతఃపురమునుండి బయటికి రాఁగుండదని యాజ్ఞయైనది!"

"నీవుకూడ నాపై కత్తినెత్తఁ బూనుకొంటివా అట్లైన రమ్ము" అనుచు యువరాజు తనకత్తిని ఒఱనుండి బయటికిఁ దీసెను.

"లేదు మహాప్రభూ, తమపై కత్తియెత్తుటకు నాకు చేయిరాదు, నాప్రాణములను తమరు రెండుసార్లు కాపాడియుంటిరి—అది నేనెన్నఁడును మఱవను" అనుచు యువరాజు పాదధూళి తీసి తలనద్దుకొన్నాఁడు సీతారాముఁడు.

"నీవు చేయఁబోవునదేదో త్వరగా చేయుము అట్టి న వ్యవధి లేదు"

"తమరు రెండుమార్లు కాపాడినప్రాణమును తమరే నాశనము చేయకుఁడు. నాకత్తి తీసికొనుఁడు—ఇదిగో, నాకత్తి. నన్నాపాదమస్తకము బంధించి మీరు పొండు, లేనిచో నాబ్రతుకు మఱి యుండదు."

యువరాజా యస్త్రమును దీసికొని సీతారాముని కండువాతీసి దానితో వానిని గట్టిగాకట్టి తాను బయటికిఁ బోయెను. సీతారాముఁ డక్కడనే పడియుండెను. అక్కడికి దగ్గఱగనే ప్రహరీగోడవంటి గోడ యొకటి అడ్డుగ నున్నది. దాని కొక్కటే ద్వారము ఆద్వారము దాటినయెడల నంతః-పురము దాటినట్లే. ఆతలుపులుకూడ మూసియుండుటచూచి యువరాజు వానిని తెఱవఁ బ్రయత్నముచేయక గుప్పున గోడపై నుఱికెను. ద్వారముపై చేరఁబడి హాయిగా నిద్ర-పోవుచున్న పహారావానిని జూచి యువరాజతిజాగ్రత్తగా గోడదిగి విద్యుద్వేగముతో వానిపైఁ బడెను. వానికత్తిని దూరముగాఁ బాఱవైచి ఏమియు బోధపఱచుకొనలేక కంగా-రుపడుచుండు ఆపహారావాని కాళ్లుచేతులను కట్టివేసెను. వాని

యొద్దనుండు తాళముచెవిని తీసికొని యువరాజు తలుపును తెఱచెను; అప్పటి కాపవాఁడు పూర్తిగా తెలివివచ్చి, "ఏమి తమరు చేయుచున్నది మహాప్రభూ" అనెను.

" అంతఃపురములోనికి పోవుతలుపులు తెఱచుచున్నాను."

"రేపు మహారాజుగారడిగిన నేనేమి చెప్పఁగలను?"

"యువరాజు బలము ప్రయోగించి మమ్ముల నతిక్రమించి తలుపులు తెఱచెనని చెప్పుము; అట్లైన మీ కేమియు శిక్ష కాదు.

అంతఃపురము వెడలివచ్చి యువరాజు రామచంద్రుని పరివార ముండుబసకు వచ్చెను ఆబసలో నిప్పుడు రామమోహను రనూయిమాత్రమే పండుకొనియున్నారు, భోజనముకాఁగానే మిగిలినవారందఱును రామచంద్రుని పడవలోనికి వెళ్లిపోయిరి. యువరాజు మోహానునిపై మెల్లగ చేయివేసెను, మోహానుఁడు ఉలికిపడిలేచి నిల్చుండి గాబరాపడుచు "ఏమిది! యువరాజే!" అనెను. యువరాజు వానిని బయటకు తీసికొనిపోయి జరిగినదంతయు వానితోఁ జెప్పెను.

మోహానుఁడు పగిడి చుట్టి లాఠీ చేతఁబుచ్చుకొని కోపముతో మండిపడుచు "లఛ్మన్ సర్దార్ ఎంతటివాఁడో నేనును చూచెదను, మారాజుగారిని తీసికొనివచ్చి నాకొప్పఁజెప్పుఁడు. ఈలాఠీతో నూరుమందిని పరుగెత్తింపఁగలను యువరాజా" అనెను.

"అది నిజమేగాని యశోహరప్రాసాదములో భటులు వందకంటె చాల నధికముందురు. బలము ప్రయోగించి నీవు చేయఁగలిగినది అంతగా లాభింపదు. వేఱుపాయ మేదైన చూడవలెను.

"అట్లైన మహారాజావారిని నాకడకు తోడ్కొని రండు. వారు నాయొద్ద నుండిన నేను నిశ్చింతుఁడ నై యేదైన యుపాయము నాలోచింపఁగలుగుదును." మోహనుఁ డిట్లనిన-తోడనే యువరా జంతఃపురములోనికిఁ బోయి రామచంద్రుని తీసికొనివచ్చెను. మిగిలినవా రందఱును రామచంద్రునితో వచ్చిరి.

రామమోహనుఁడు కంటఁబడగానే రామచంద్రుఁ డిట్ల-నెను—"నీవు నా కక్కరలే దిఁక—దూరముగ పొమ్ము. నీవు చాలకాలమునుండి యున్నవాఁడవు—నిన్నంతకంటె శిక్షింప-లేను, ప్రాణములతో మరల యిల్లు చేరుకొనఁగలిగిన నీముఖ మెన్నఁడును మఱి చూడను—" కోపమువలన మాటాడలే-కున్నాఁడు రామచంద్రుఁడు.

మోహనుఁడన్న నాతనికి నిజముగా ప్రేమయే, రామ-చంద్రుఁడు చంటివాఁడుగా నున్నప్పటినుండియును మోహనుఁ డతనికి సంరక్షణ చేయుచుండెను. చిన్నప్పుడు ముద్దుచేయుచు నతని నాడించుచుండెను.

మోహనుఁడు చేతులు జోడించి యనెను—"నన్ను పొమ్మనుటకు నీవెవరవు మహారాజా? నాకీ నౌకరీ యిచ్చినది

భగవంతుఁడు. యముఁడు నన్నీ లోకమునుండి తీసికొనిపో-యిననాఁడే భగవంతుఁడునన్నీయుద్యోగమునుండి తప్పించఁ-గలఁడు. నీవుంచినను ఉంచకపోయినను నేను నీ నౌకరునే!" ఇట్లనుచు మోహానుఁడు రామచంద్రుని యెదుటకు వచ్చి నిలిచెను.

"మోహానా, ఏమియుపాయ మాలోచించితివి?" అని యువరా జడిగెను. తమకృప యుండవలెనుగాని నాకుపా-యము లేకపో లేదు——నాకుండునుపాయము ఈలాతీయే—— తల్లి మహాకాళిని నమ్మియున్న నాకిది చాలును!"

"ఆయుపాయ మెందుకును పనికివచ్చునది కాదు," అని తలయాడించుచు "మీరాజాగారి ఓడ యెటువైపున నున్నది చెప్పుము." అని యువరా జడిగెను.

"కోటకు దక్షిణపుదిక్కున కాలువలో."

"డాబా పైకెక్కిచూచి వత్తము రండు" అనెను యువరాజు.

హఠాత్తుగ నేదో యొకయూహ తట్టి మోహానుఁడు, "ఔనౌను మంచిమాట! అక్కడకు పోయి చూదము రండు" అని యనెను.

అందఱును డాబామీఁదికి వెళ్ళిరి. అడుగున కాలువ కనఁబడుచున్నది, వారు నిలిచియున్న చోటునుండి సుమారు దెబ్బదిమూర లుండును; అందులో నున్నది రామచంద్రుని

యఱువదిగడల యోడ. రామచంద్రుని వీపునఁగట్టుకొని దాని-పై కుతికెదనని మోహనుఁడనెను.

వసంతరాయలు తడఁబడుచు మోహనునొద్దకు పరు-గెత్తి వానిని గట్టిగా పట్టుకొని "వద్దువద్దు నీవట్టి యసాధ్యమైన పని ఎన్నఁడును నూహింపకుము, దానివలన ప్రయోజనముండదు," అనెను. విభ యులికిపడి భయముతో వణఁకుచు "ఏమిటి మోహాన్ నీవనునది!" అన్నది; రామచంద్రరాయలు, "అసాధ్యమైన దాపని" అన్నాఁడు.

ఉదయుఁడప్పుడు లోనికిఁ బోయి దళసరిపంచెలు,కండు-వాలు దొఱకినవన్నియు తీసికొనివచ్చెను. వానిని నులిపి ఒక-దానిచివర నొకటి కట్టి పెద్దత్రాఁడొకటి తయారుచేసినాఁడు రామమోహనుఁడు. పడవయుండు వైపునకుఁబోయి అక్కడ-నుండు చిన్న స్తంభమువంటి ఎత్తుదిమ్మకొక దానికి ఆత్రాడును కట్టెను. ఆత్రాడు పడవనందుకొనలేదు. మీఁద కొంతదూరము వఱకుమాత్రము వచ్చినది. "మహారాజా,నీవు నావీఁపుమీఁద నెక్కి గట్టిగాపట్టుకొని కూర్చుండియుండుము. నేనుత్రాఁడు పట్టుకొని క్రిందికి జారెదను,"అన్నాఁడు మోహనుఁడు. రామ-చంద్రుఁ డడ్డుపెట్టలేదు.మోహనుఁడప్పు డక్కడనుండువారం-దఱకును ప్రణామముచేసి ఒక్కొక్కరి పాదధూళి తీసికొని రామచంద్రుని వీఁపుపై నెక్కించుకొనెను; రామచంద్రుఁడు గట్టిగా వానినిపట్టుకొనికూర్చుండి కండ్లుమూసికొనెను. రామ-మోహనుఁడు దిగుచు, విభవైపు తిరిగి, "నేను వెళ్లుచున్నా-

నమ్మా, నీబిడ్డఁడు బ్రతికియున్నంతకాలము నీవు భయపడకు మమ్మా," అనెను.

రామమోహనుఁడు త్రాడును గట్టిగా పట్టుకొని, మెల్లఁగ దిగుచుండెను. విభ స్తంభమునొద్దకు పోయి దానిని నొక్కిపట్టుకొని నిలిచెను. వసంతరాయలు కండ్లుమూసికొని, వణఁకుచు, దుర్గానామస్మరణ చేయుచుండెను. మెల్లఁగా దిగిదిగి, మోహనుఁడా త్రాడుచివరకు వచ్చెను. అత్రాటి-నప్పుడు నోటితో కఱచిపట్టి తనరెండుచేతులతో రామచం-ద్రుని ప్రేలాడవేసి మెల్లఁగా పడవమీఁదికి దించెను. అప్పుడు-తానుగూడ పడవపై నుఱికెను. రామచంద్రుఁడు పడవను చేరుకొనగానే విభ పెద్దనిట్టూర్పు విడిచి మూర్ఛిల్లెను. వసం-తరాయలు కండ్లువిప్పి, "ఏమయినది తాతా?" అని యడిగెను. మూర్ఛిల్లియున్న విభ నెంతో యాదరముతో నెత్తికొని ఉద-యుఁ డంతఃపురములోనికి వెళ్లెను. సురమ యుదయుని చేయి-పట్టుకొని "ఇప్పుడు నీకేమానోకదా!" అని భయపడుచు నడి-గెను. "ఇప్పుడు నామాట నే నసుకొనుచుండలేదు" అనెను యువరాజు.

ఈవల పడవ కొంతదూరము పోయి నిలిచిపోయినది, కాలువలో పెద్దపెద్ద గుగ్గిలపుదూలము లడ్డుగ పడియున్నవి. ఇంతలో పహరావారు పడవపాఱిపోవుట దూరమునుండి చూచి పడవపై రాళ్లురువ్వ నారంభించిరి. కాని ఒక్కరా-యియైనను పడవకుఁ దగులలేదు. వాండ్ర చేతులలో కత్తు-

యున్నవి, తుపాకులు లేవు. వాండ్రలో నొకఁడు తుపాకితెచ్చుటకుఁ బరుగెత్తిపోయెను. వెదుకఁగా వెదుకఁగా తుపాకి యొకటి దొరకినదిగాని కాల్చుటకు చెకుముకి దొరకలేదు. పహారావారు "ఓరే, మంచెక్కడరా? ఓరే గుండ్లెక్కడరా?" అనుచు ఒకరినొకరు అడుగుచుండ రామమోహనుఁడు రామచంద్రుని యితరానుచరులతోఁ గలిసి దూలములపై పడవనీడ్చి దాటించుకొని పోయెను. పహారా వాండ్రు రామచంద్రుని వెంబడింపవలెనని తమలో నొకనిని పడవనొకదానిని తెమ్మని పంపిరి. వీఁడు దారిలో 'హరి' దుకాణమునొద్ద నొకచిలుము గుడాకు పీల్చి పండుకొనియున్న రామశంకరును లేపి తనకు వాఁడీయవలసినబాకీమాట వానికి జ్ఞాపకము తెచ్చి పడవకై బయలుదేఱెను. పడవ వచ్చినను లాభములేదనునంతవేళ యైనతరువాత పెద్దకేకలతోను పాటలతోను, పడవ వచ్చినది. ఆలస్యమగుట చూచి పడవకై వెళ్లినవారినందఱును దూషింప నారంభించిరి. "నన్ను గుఱ్ఱమనుకొనుచున్నారా?" అని వాఁడు జవాబు చెప్పెను. ప్రతివాఁడును వానిని నోటికివచ్చిన తిట్లుతిట్టెను; అందఱివంతును పూర్తియైనప్పటికి ఇఁక వెళ్లినను లాభముండదని వారికిఁ దోఁచినది. పడవతీసికొనివచ్చుటలో కొంతయాలస్యమైనది నిజమే, గాని తిట్లుతిట్టుకొనుచు దానికి మూఁడంతలాలస్యముచేసిరి. రామచంద్రునిపడవ భైరవనది చేరినతోడనే ఫర్నాండిజ్ దొరగారొకతుపాకి వేలించిరి. అప్పటికి తెల్లవాఱవచ్చినది, నిద్రిం-

చుచున్న ప్రతాపాదిత్యుఁడు తుపాకిశబ్దమువలన లేచి 'పహా-రా' 'పహారా' అన్నాఁడు. ఎవ్వరును రాలేదు, పహారా వారందఱు నారాత్రియే పాఱిపోయిరి. మొదటికంటె బిగ్గ-ఱగా "పహారా!" అని కేకవేసెను ప్రతాపుఁడు.



## పండ్రెండవ పరిచ్ఛేదము.

గట్టిగాఁ బిలిచినను పహరావాఁడు రాకుండుట చూచి ప్రతాపుఁడు వెంటనే మంచము దిగి బయటికి వచ్చి "మంత్రీ" అని పిలిచెను. భృత్యుఁడొకఁడు పరుగెత్తిపోయి మంత్రిని దోడ్కొనివచ్చెను.

"పహరావారేరీ మంత్రీ?"

"బయటిద్వారము వదలి రాత్రి అందఱును పాఱిపోయిరి," అన్నాఁడు మంత్రి. విపత్తువచ్చి మీఁదఁబడుచున్నదని మంత్రి కనిపెట్టి ప్రతాపాదిత్యుని ప్రశ్నకు తిన్ననిజబాబు తత్క్షణమే చెప్పెను—జబాబు చెప్పుట కాలస్యముచేసినను, డొంకతిరుగుడుగా జబాబుచెప్పినను ప్రతాపుఁడు అగ్నిహోత్రుఁడై మండిపడును. "అంతఃపురద్వారమునొద్ద నుండువారేమైరి మంత్రీ?" అని ప్రతాపుఁ డడిగెను.

మంత్రి—"వచ్చునప్పుడు దారిలో చూచితిని - వారి కాళ్లు చేతులు కట్టియున్నవి—వారు పడియున్నారు." రాత్రి జరిగినకథ యేమియు మంత్రి యెఱుఁగఁడు, కాని ఘోరమైనసంగతి యేదో జరిగినదని మాత్రము ఊహింపఁగలిగెను—ఆవిషయమై రాజుగారినే అప్పు డడుగుట అసంభవము.

"రామచంద్రరాయ లెక్కడ? వసంతరాయ లెక్కడ? ఉదయాదిత్యుఁ డెక్కడ?" అని తొందరతొందరగా ప్రతాపుఁ డడిగెను.

"వారంతఃపురములోనే యున్నారని తలఁచెదను," అని మంత్రి మెల్లమెల్లఁగ ననెను.

ప్రతాపుఁడు చీకాకుపడుచు, "తలఁచుట నేనును చేయఁగలపనియే, నిన్నేల యడుగవలెను?—కాని తలఁచునదంతయు నెల్లప్పుడును నిజమగునా?" అనెను. మంత్రి మఱి నోరువిప్పక మెల్లఁగా బయటికి పోయెను, రమాపతి చెప్పఁగా రాత్రి జరిగినదంతయు తెలిసికొనెను. రామచంద్రరాయలు పాఱిపోయినాఁడని తెలియఁగానే మంత్రికి భయము వేసినది. బయటికిఁబోవుసరి కక్కడ మఠము వేసికొని కూర్చుండియున్న విదూషకుఁడు, రమాయి, మంత్రి కగపడి, "ఇదిగో జాంబవంతుఁడు!" అని మంత్రిని పలుకరించుచు పండ్లిగిలించెను. వానినవ్వులో కనఁబడునది పండ్లుమాత్రమే, ఆపండ్లముఖమును చూచి రామచంద్రుని సభాసదులు భయపడుచుండలేదు, వారు దానికే రసికత యనుచున్నారు. ఆవిదూషకుని యభినందనము విని మంత్రి యేమియు ననలేదు, వానివైపు చూడనైనను చూడక తననౌకరుతో, "వీనిని తీసికొనిరమ్ము" అనెను. వానిని ప్రతాపాదిత్యుని క్రోధానలమున కాహారముగ నీయవలెనని మంత్రికిఁ దట్టినది—మహారాజుగారి చేతనున్న వజ్రాయుధము నెవరో యొకరిపైఁబడక మానదు, కనుక ఈ అరఁటిచెట్టుపైఁ బడినయెడల గొప్పగొప్పవృక్షముల కేమియు హానికలుగదని మంత్రి యూహ.

రమాయిని జూచి రాజు అగ్నిహోత్రుఁడాయెను— మహారాజుగారి కానందము కలుగఁజేయవలెనని రమాయి

పండ్లిగిలించుచు దేహమును అష్టవక్రములుగ విఱుచుచుండుట-చూచి మహారాజుగారు సహించి యూరకుండలేకపోయిరి. ఆయన వడిగా సింహాసనమునుండి లేచి రెండుచేతులను విస-రుచు, "వీని నవతలకు గెంటుము, ఈక్షణమే వీనిని దీసికొని-పొమ్ము వీని నిచ్చటకు లెమ్మని చెప్పిన దెవరు?" అనెను. కోపము-తోపాటు అసహ్యముకూడ ప్రతాపునిలో పుట్టనియెడల రమాయి మరలఁ దనయింటికి వెళ్ల నవసర ముండకపోను— తగినశాస్త్రి యీయన లెన్న నెంత అసహ్యకరమైనవానినైనను ముట్టుకొనక తీరదు, కాని ప్రతాపుఁడు వానిని ముట్టుకొన-లేకపోయెను—అంత యసహ్యము కలిగినదాయనకు. రమాయి నాక్షణమే బయటికిఁ బంపివేసెను.

మంత్రి—"మహారాజా, అల్లుఁడుగారు—"

రాజు చికాకుపడి తలయూచుచు— "రామచంద్ర-రాయలు—"

మంత్రి—"చిత్తము మహాప్రభూ, వారు రాత్రి మన-కోటనుండి వెళ్లిపోయిరి."

రాజు—"వెళ్లిపోయినాఁడా ? మహారావాం డెక్కడికి పోయిరి?"

"బయటిద్వారముదగ్గఱ నుండువారు పాఱిపోయినారు" అని మంత్రి మఱియొకమాఱు అనెను.

ప్రతాపుఁడు పిడికిళ్లు బిగించుకొని, "ఎక్కడకు పారి-పోయెదరని" అడిగెను. "ఎక్కడనున్నను వెదకి తెప్పించుము.

వారిని. అంతఃపురద్వారములయొద్దనుండు పహారావారిని పిలిపించుము తత్క్షణమే,” మంత్రి బయటికి వెళ్లెను.

రామచంద్రుఁడు పడవలోనికి దిగునప్పటి కింకను చాలరాత్రి యున్నది. వసంతరాయలు, ఉదయాదిత్యుఁడు, సురమ, విభ—వీరిలో నెవ్వరును రామచంద్రుని విడిచివచ్చి పండుకొనుటకుఁ బోలేదు. విభ నోటివెంబడి ఒక్కమాటయైనను రాలేదు. కండ్లవెంబడి ఒక్కనీటిబొట్టైనను లేదు—మిక్కిలి యలసటజెందినదానివలె కదలక మెదలక యొకచోట పడియుండెను. సురమ ఆమెయొద్ద కూర్చుండి ఆమెతలపై చేయివేసి మెల్లగ దువ్వుచుండెను. వసంతరాయలును ఉదయాదిత్యుఁడునుగూడ నేమియు మాటలాడుచుండుటలేదు. చీఁకటిలో నొకరిముఖ మొకరికి అస్పష్టముగ కనఁబడుచుండెను. ఆగదిలో తమకంటెకగపడకుండ నెవరో కూర్చుండియున్నట్లు వారి కనిపించుచుండెను. దాని నంధకార మనవచ్చును, భయ మనవచ్చును, అదృష్ట మనవచ్చును—కాని ఏదో కూర్చుండియుండుట నిజము, దాని యూపిరికూడ వారికి వినఁబడుచుండెను. సదానందహృదయుఁడైన వసంతరాయలు నాలుగువైపులనుండు నిరానందమును జూచి మహాదుఃఖితుఁ డయ్యెను. ఎటువైపుతిరిగినను నేమియు బోధపడకయున్నది—జరిగినదేమో జరుగఁబోవునదేమో తెలియకున్నది. ఇదియంతయు నొకదుస్స్వప్నమా అనిపించుచున్నది, ఏమియుతోఁచక బట్టతలపై చేతిని త్రిప్పుచు ఉండియుండి,

ఉదయాదిత్యుని చేయి పట్టుకొని, "తాతా!" అనుచుండెను, ఉదయాదిత్యుఁడు "ఏమి తాతయ్యా?" అని మరల నడుగుచుండెను. దీనికిజవాబేమియు వసంతరాయలునోటినుండి రాలేదు. దారితప్పితిరుగుచున్న వసంతరాయల వ్యాకులహృదయములో వేయిప్రశ్నలుదయించుచున్నవి—వానికిసరియైన మాటలు లేవు—ఈమాటలులేని సహస్ర ప్రశ్నలును ఆ "తాతా"అను ఒక్కపదము మూలమున వ్యక్తముకావలెనని ప్రయత్నము చేయుచున్నవి "ఏమిటిది?" అనుభావము మాత్రమే, ఆయన యడుగవలసిన ప్రతిప్రశ్నలోను నుండునది—ఆయన విశేషించి యడుగవలసిన దప్పుడంతగా లేదు.

నాలుగువైపుల నుండునంధకార మల్లకల్లోలముగ నుండెను. దానిలోనుండి మాట లేవో వినఁబడుచున్నట్లుండెను వసంతరాయలకు; కాని వానియర్థ మేమియును బోధపడకుండెను. అట్టిసమయమున ఉదయాదిత్యునిమాట మధ్యమధ్యను వినఁబడుచుండుటవలన వసంతరాయలమనస్సు కొంత శాంతించుచుండెను. కొంతసేపైనతరువాత వసంతరాయలుదయాదిత్యునిచేయి గట్టిగా పట్టుకొని "తాతా నేనే దీని కంతటికిని కారణము కాఁబోలు!" అని విచారముతో ననెను. ప్రతాపుఁడు తన్ను జంపలేకపోవుటయే దీనికంతటికిని కారణమని వసంతరాయలకు మాటిమాటికిని తోఁచుచుండెను. ఉదయాదిత్యుఁ డప్పుడు విశేషముగ మాటలాడు నవస్థలో లేఁడు, "నీ వెంతమాత్రము కారణము కావు తాతయ్యా"

అనిమాత్రము మృదుస్వరముతో ననుచుండెను. కొంతసేపు గదిలో నెవ్వరును ఒక్కమాటయైనను అనలేదు, వసంతరాయలు చివరకు, "విభా, ఏమియు మాటలాడక కూర్చుండియున్నావేమి తల్లీ!" అనుచు విభయొద్దకుఁబోయి ఆమెకడఁ గూర్చుండెను. మఱికొంతసే పూరకుండి వసంతరాయలు, "సురమా సురమా!" అని పిలిచెను. సురమ తాతయ్యవైపు ముఖమెత్తినది, నోటవెంబడి మాటమాత్రము లేదు. తనకుఁ దెలియని విపత్తేదో వచ్చి మీఁదపడుచున్న దనుకొనుచు తాతయ్య తలతడవుకొనుచు ఆవిపత్తుకొఱకై ఎదురు చూచుచున్నట్లు కూర్చుండియుండెను. సురమ విభనొసట చేతినుంచి నిశ్చలముగ కూర్చుండియుండెను గాని ఆమెహృదయమునఁ బ్రళయ దేదుండెనో అంత స్పష్టముగఁ దెలియకపోలేదు. ఆ చీఁకటిలో సురమ ఒకమాఱు దయామూర్తియైనతనివైపు చూచినది. ఆ దయామూర్తిశ్రేష్ఠుఁడు గోడను జేరఁబడి ఏదో యాలోచించుచుండెను. సురమ కనులనుండి నీరు గాఱుచుండెను, విభకు తెలియని ననుభయముచే సురమ ఆకన్నీటిని తుడుచుకొనుచుండెను.

తెల్లవాఱుచున్నది, నలుదిక్కులను వెలుతురు కనఁబడుచున్నది—వసంతరాయలు స్వేచ్ఛగా నూపిరివిడుచుచు బ్రతికితి ననుకొనెను. అర్థముకాని యాభయ మతనిని విడిచినది. మనస్సును బలపఱచుకొని వసంతరాయలు రాత్రి జరిగినదానినిగుఱించి యాలోచించుచు కొంతసేపు కూర్చుండి విభగదినుండి బయటికిఁ బోయెను. అంతఃపురద్వారమున సీతారాముఁడు

అబద్ధమాడి మంచివానిప్రాణము కాపాడుట పాపమైనచో నేనేల నిన్నీపని చేయుమనెదను?" అని అనుచు, వానిభుజముపై తట్టుచు అనేకవిధముల బోధపఱచెను కాని హఠాత్తుగా న్యాయబుద్ధి పుట్టినవానియెదుట మనయుక్తి పనికిరాదు. "లేదు మహారాజా, యజమానులయెదుట అబద్ధమాడుట నాకు చేతకాదు." అన్నాఁడు రెండవ పహరావాఁడు.

వసంతరాయలు గడిబిడిపడుచు, "నామాట వినుము-నీకేమియును పాపము కలుగ దీయబద్ధమువలన" అన్నాఁడు. "నామాటయుంచుము నాయనా నిన్ను తరువాత సంతోష, పెట్టెదను, నామాట ఉంచుము, ఇదిగో ఇప్పుడు నాదగ్గఱనున్నది. ఇది పుచ్చుకొనుము"

పహరావాఁడు తత్క్షణము చేయిచాచి వసంతుఁడిచ్చిన రూపాయలు మొలను దోఁపెను. వసంతరాయలు కొంత మనశ్శాంతినిబొంది ఇంటిలోనికిఁ బోయెను.

పహరావారి నిద్దఱిని తీసికొనిరమ్మని ప్రతాపాదిత్యుని యాజ్ఞయైనది. మంత్రి వారిద్దఱిని దోడ్కొనిపోయెను. లోపల నుండి పుట్టుచున్న కోపము నాఁపుకొని నిశ్చలుఁడై ప్రతాపుఁడు కూర్చుండియున్నాఁడు; మాటమాటకు నాగి మాటలతి స్పష్టముగఁ బలుకుచు, "నిన్న రాత్రి అంతఃపురద్వారము తలుపులెట్లు విడినవి? అని యడిగెను.

సీతారామునకు లోనుండి వణఁకు పుట్టినది, చేతులు జోడించి "శరణుమహాప్రభూ! నాతప్పేమియు లేదు," అన్నాఁడు

"అది నిన్నెవ రడిగినారు!" అని కండ్లు చిట్లించుచు రాజుగా రడిగిరి.

సీతారాముఁడు—తొందరతొందరగా ఇట్లనసాగెను. "చిత్తము మహాప్రభూ, లేదు,—మహాప్రభూ యువరాజు— యువరాజావారు నన్ను కట్టి అంతఃపురమునుండి బయటికి వెళ్లిపోయిరి." 'యువరాజు' అని వానినోటినుండి చటాలున వచ్చినది.యువరాజుపేరెంతమాత్రము చెప్పఁగూడదని తనలో తాను నిశ్చయించుకొనుచుండెను,కనుకనే కాబోలు, ఆగందరగోళములో అన్నిటికంటెముందా పేరే వచ్చినది. నోరు జారి-పోయినతరువాత పాపము వాఁడు చేయఁగలదేమున్నది!

ఇంతలో ప్రతాపుఁడు మహారా వారినిపిలిచుచున్నాఁ-డని విని వసంతరాయలు గడిబిడిపడుచు ప్రతాపునిగదిలోనికి వచ్చెను—అప్పటికి సీతారాముఁడు యువరాజావారితో నేనెంతయో వద్దని చెప్పుచున్నను వారు వినలేదు," అని చెప్పుచుండెను.

వసంతరాయ లదివిని తొందర తొందరగా, హాఁ హాఁ, సీతారామ్, ఏమంటివిరా, అబద్ధమాడకున్న దేవుఁడు నీకు మేలుచేయును, ఉదయునిదోష మేమియు నందు లేదు,'' అనెను.

సీతారాముఁడు తడఁబడుచు, "ఔను మహాప్రభూ యువరాజు తప్పేమియులేదు," అనెను.

ప్రతాపుఁ డప్పుడు "నీతప్పా ఆడ్డైన?" అని దృఢస్వర-ముతో నడిగెను.

"కాదు మహాప్రభూ!"

"మఱి యెవరితప్పు?"

"చిత్తము మహాప్రభూ, యువరాజా—"

అప్పుడు భాగవతుని నడుగఁగా వాఁడు జరిగినదంతయు సరిగా చెప్పివేసెను—వాఁడు చూచినది. తాను నిద్రపోవు-చుండెడి సనుసంగతిమాత్రమే! వసంతరాయల కేమియు నుపా-యము తోఁచలేదు, కండ్లుమూసికొని, 'ఈశ్వరా' 'ఈశ్వరా' అనుచుండెను. సహాయకారులు పోయినవి—బలము ప్రయోగించి ఎవరైన వాంఛ్రను గట్టినచో అసహాయులై-యున్నవారు సహాయకుని యెట్లు చేయఁగలరు? వాంఛ్ర-యపరాధమునకై రాజావారు వాంఛ్రకు కొరడా దెబ్బలు విధించిరి.

ప్రతాపుఁ డప్పుడు వసంతరాయల వైపుచూచి "ఉద-యుని యపరాధము క్షమింపఁదగినది కాదు," అని గర్జించెను. ఆయన ధోరణినిఁజూచిన ఆతప్పు వసంతరాయులదే యని చూచువారికి తోఁచుచుండును. ఉదయాదిత్యునే ఎదుట నిలుచుండఁబెట్టి దూషించుచున్నట్లు ప్రతాపాదిత్యుఁడు మాటాడెను. ఉదయుని తనకంటె నధికముగ ప్రేమించుచుం-డుట వసంతుని యపరాధము!

"బాబూ, ప్రతాపా, ఉదయునితప్పేమియు లే దిందులో" అని వసంతరాయలు తత్క్షణమే అనెను.

ప్రతాపుఁడు రౌద్రాకారుఁడై లేచి, "తప్పు లేదా!" అనెను. "నీవు తప్పులేకనుటచే వానిని మఱింత యధికముగ దండించెదను, నీవేల వచ్చి నడుమను దూరుచున్నావు?"

వసంతరాయ లుదయాదిత్యునిపక్షమగుటవలన ప్రతాపుఁడు వానికి మఱింత విపక్షమగుచుండెను. ప్రతాపుఁ డుదయాదిత్యుని శిక్షింపఁబోవుట వసంతరాయలకు శాస్తి నిచ్చుటకే యని వసంతరాయలు కనిపెట్టి, ఏమియు ననక యూరకుండి తనలోఁ దానేదో యాలోచించుకొనుచుండెను.

కొంతసేపటికి ప్రతాపుఁడు శాంతించి యిట్లనెను—"ఉదయునికి తనదని ఒక యభిప్రాయము లేదు, నమ్మకము లేదు; తాను కోరి యేపనియైనను చేయఁగలవాఁడు కాఁడు వాఁడు; ఎవరియిష్టానుసారము వారు వాని నాడింపఁగలరు, కేవల మొకకనుసైఁగవలన వీనిచే నెవఁడైన నేపనినైన చేయింపఁగలఁడు—ఇది యంతయు నేను పూర్తిగా నెఱుఁగుదును—అట్లు కాకున్న ఉదయుని రక్షించువాఁడు నేఁ డెవ్వఁడును ఉండకపోవును. పక్షుతెక్కలోని వెంట్రుకవలె వీఁడెగురుట కనిపెట్టి ఎవరూదుటవలన వాఁడెగురుచుండెనో తెలిసికొనవలెనని క్రిందికి చూచితిని, ఉదయునికి శాస్తి నిచ్చుటకు నిచ్ఛలేకపోవుటకు నిదియే కారణము—శాస్తి పొందుటకుఁగూడ యోగ్యత లేదు వానికి. కాని బాబా నేననునది వినుము, నీవు మఱియొక్క-

తూరిదైనను ఉదయునిచూచుటకు యశోహారపురము వచ్చి-నచో వానిప్రాణమును కాపాడుట ఎవ్వరికిని శక్యము కాదు"

వసంతరాయలు చాలసేపు మతిపోయినవానివలె నచ్చ-ట నూరక కూర్చుండి, తరువాత మెల్లమెల్లగ లేచి "మంచిది ప్రతాప్, ఈసాయంకాలమే నేను పోయెదను," అనెను. మఱి యొక్కమాటదైనను అనక వెలుపలకుఁ బోయెను.

ఉదయాదిత్యునియెడల అనురాగముగలవారిని, ఉద-యుఁ డెవరెవరికి వశీభూతుఁడో వారిని, ఉదయునినుండి వేరుచేసి దూరముగ నుంచవలెనని ప్రతాపుఁడు నిశ్చయించు-కొనెను. "కోడలిని ఇఁక నిచ్చట నుండనీయకూడదు; ఏదో యొకమిషపై ఆమెను పుట్టినింటికి బంపివేయవలెను," అని మంత్రిని బిలచి రాజనెను. విభయెడల ప్రతాపున కెట్టిసం-దేహమును లేదు—ఎంతదైనను విభ తనయింటిపిల్లకదా!



## పదుమూఁడవ పరిచ్ఛేదము.

వసంతుఁ డుదయాదిత్యుని గదిలోనికి వచ్చి, "తాతా ఇఁక నిన్ను చూచుటకు నాకు ప్రాప్తిలేదు," అనుచు ఉదయుని యొద్దకు వచ్చి వానిని గట్టిగా కౌఁగిలించుకొనెను.

ఉదయుఁడు వసంతుని చేతులుపట్టుకొని, "ఏమి తాతయ్యా, అట్లనుచున్నావేమి?" అని యడిగెను.

వసంతరాయలు జరిగినదంతయు చెప్పి, కంట నీరు పెట్టుకొని, "నీయెడల నాకుఁగల అనురాగమే నీకష్టములకు మూలము, కనుక నీ విక్కడ సుఖముగ నుండిన నేను బ్రతికియుండు నాలుగురోజులు నెట్లైన గడపుకొందును,'' అనెను.

ఉదయుఁడు తలయూఁచుచు, ''అట్లెన్నఁటికిని కానేరదు తాతయ్య," అనెను. "మనము తప్పక కలిసికొనెదము, దానికెవ్వరును అడ్డురాలేరు. నీవు నన్ను విడిచి, వెళ్లిపోయినయెడల నేనెంతమాత్రము బ్రతికియుండను తాతయ్యా!"

వసంతరాయలు—"ప్రతాపుఁడు నన్ను చంపింపలేదు, దానికి బదులు నిన్ను నాయొద్దనుండి లేసికొన్నాఁడు. తాతా, నేను నిన్నువదలి వెళ్లిపోవునపుడు నీవు నావైపు చూడకుము; తాతయ్య చనిపోయినాఁడని యనుకొనుము."

ఉదయాదిత్యుఁడు తనపడకగదిలోనున్న పురపుఁకడకుఁ బోయెను. వసంతరాయలు విభ గదిలోనికిఁ బోయి విభగడ్డము పట్టుకొని, "తల్లీ విభా, ఒక్కమాటు లెమ్ము తల్లీ!" అనుచు

నామెను లేపి, "నీచేతిని ఈముసలితలమీఁద నొక్కసారి వేయుము తల్లీ," అనెను. శుభ తత్క్షణమే లేచి తాత తలమీఁద నుండు పండువెండ్రుకలను తీయ నారంభించినది.

ఉదయాదిత్యుఁడు సురమను నంతయుఁ దెలియఁజేసి, "సురమా, ఈజగత్తులో నాకే రవంత మిగిలియున్నదో అది-కూడ తీసికొనుటకు కుట్ర జరుగుచున్నది," అనెను. సురమ చేయిపట్టుకొని, "నా చేతులు నులిపి నిన్నెవ్వరైన నాయొద్ద-నుండి తీసికొని పోఁగలరాయేమి?" అని ఉదయుఁడనెను.

సురమ ఉదయుని రెండుచేతులతో గట్టిగ కౌఁగిలించు-కొని, "ఆ యమునికి సాధ్యము కాఁగలదు, మఱి యెవ్వరికిని సాధ్యము కాదు," అని వృద్ధస్వరముతోఁ బలికెను.

కాని కొంతసేపటినుండి సురమ మనస్సులోఁగూడ నష్టభయమే పుట్టుచుండెను. తనప్రియతముని తనయొద్ద-నుండి లాగుకొనిపోవుటకు క్రూరహస్త మొకటి తనవైపు వచ్చుచున్నట్లనిపించుచున్నదామెకు. నాప్రాణము పోయినను నేనతనిని వదలను, అనుచు తాను భర్తను గట్టిగాఁ బట్టుకొని యున్నట్లు సురమ యూహించుచుండెను

"నేను బాగుగ నాలోచించి చూచితిని నిన్నెవ్వరును నాయొద్దనుండి తీసికొనిపోలేరు" అని సురమ మరల ననెను. సురమ ఉండియుండి ఈమాటలే యనుచుండెను. ఆమె కప్పుడు గొప్పబలము కావలసియున్నది; భూలోకముననుండు ఎట్టి-బలశాలి వచ్చినను దనపట్టును విడిపింపలేనంత గట్టిగాఁ దన

ప్రియతముని దానుఁ బట్టుకొన గలుగవలెను—కనుక మనస్సును బలపఱచుకొనుటకై మాటిమాటికిని ఆమాటల నేకనుచుండెను.

ఉదయాదిత్యుఁడు సురమముఖమును జూచి నిట్టూర్పు విడుచుచు "సురమా, తాతయ్యను మరల మిఁక నెన్నఁడును చూడము," అనెను.

సురమకూడ పెద్దనిట్టూర్పు విడిచినది.

ఉదయాదిత్యుఁడు—"నాకష్టమువిషయమై నేనంతగా నాలోచింపలేదు సురమా, తాతయ్య కెంత దుఃఖముగా నున్నదో కదా! భగవంతుఁ డేమి చేయఁదలఁచియున్నాఁడో కదా!"

ఉదయుఁడు వసంతరాయలనుగూర్చి సురమతోఁ జెప్పుచుఁ గూర్చుండెను

వసంతరాయ లెక్కడెక్క డేమేమి చేసెనో అవియన్నియు ఉదయునికి నేఁడు జ్ఞప్తికి వచ్చినవి. వసంతరాయల కరుణార్ద్రహృదయములోనుండి వచ్చుచుండిన చిన్నచిన్న మాటలను ఆయన దయార్ద్రహృదయముతోఁ జేయుచున్న చిన్నచిన్న పనులను చిత్రరత్నములా యనునట్లు పోగుచేసి ఉదయుఁడు తనహృదయమునందు దాచి యుంచుచుండెను. నేఁడవి ఒక్కొక్కటిఁ పైకితీసి సురమకు చూపించుచుండెను.

సురమ—"ఆహా! తాతయ్యవంటివారింకెవరైన నుండఁ గలరా?"

సురమ ఉదయునితోఁ గలసి విభగదిలోనికిఁ బోయెను

విభ తాతయ్య తలనుండి పండువెండ్రుకలు తీయుచుండెను, తాతయ్య పాట పాడుచుండెను.

ఉదయాదిత్యుఁ డగపడినతోడనే వసంతరాయలు నవ్వుచు నిట్లనెను—

"విభ నన్ను విడువననుచున్నది, చూచితివిరా బాబూ! నేను వెళ్లెదనని విని యేడ్చుచున్నది—ఎవరైన నిట్లు చేయుట చూచితివిరా తాతా? విభ కంట నీరుచూచి భరింపలేను నేను!" ఇట్లని మరల పాట ప్రారంభించెను.

"అదిగో చూడుము, విభ ఏమిచేయుచున్నదో చూడుము!

ఇదిగో విభా ఇటుచూడుము, నీవిట్లేడ్చుచుండిన—" వసంతరాయలు మఱి మాటలాడలేకపోయెను. వసంతరాయలు విభకు బుద్ధిచెప్పఁబోయి తనదుఃఖమునే ఆఁపుకొనలేకపోయెను. చటాలున కండ్లు తుడుచుకొని నవ్వుచు, "సురమ ఏడ్చుచున్నది చూచితివా తాతా?" అన్నాఁడు. "ఇట్లుచేయుట కూడనిపని, జాగ్రత్త ఇట్లైన నేనిక్కడనేఉండిపోయెదను, వచ్చి నీగదిలోఁ గూర్చుండెదను. మీరిద్దఱునుఁ గలిసి నాతలమీఁదనుండు పండువెండ్రుకలు తీయుచుందురు, నేను నీ చెవిలో నోరుపెట్టి తొక్కుపండ్లనడుమనుండి తుస్సుతుస్సుమని మాటలాడుచుందును. దానివలన నేమిప్రమాదము వచ్చినను నాతప్పుండదు."

ఎవరినోటినుండియు మాటరాలేదు, వసంతరాయ లది కనిపెట్టి దుఃఖితుఁడగుచు వీణను చేతికిదీసి అతివేగముతో వా-యింప నారంభించెను. విభ కనులనుండి కారు కన్నీటివఱదలు వీణపాట కడ్డువచ్చునట్లు కనఁబడెను, వసంతరాయలకనులు నీటితో నిండుచుండెను, అతనికనుల మసక కమ్ముచుండెను. అక్కడనుండువారందఱిని చీవాట్లుపెట్టుచున్నట్లు నటించుచు మాటలకుప్పలతో దుఃఖమును నొక్కియుంచవలెనని వసంతరాయలు గొప్పప్రయత్నముచేసెను, గాని నోరు విడినదికాదు, మాటలు తట్టలేదు, ఆశ వదలి వీణను క్రిందఁబెట్టెను. చివరకు సెలవుపుచ్చుకొను సమయముకూడ దగ్గఱపడినది.

వసంతరాయ లుదయాదిత్యుని గట్టిగాఁబట్టుకొని కౌఁగిలించుకొని చాలసేపటివఱకు వదలక నిలిచియుండెను. "ఇదిగో ఈవీణ ఇక్కడనే ఉంచి పోవుచున్నాను. నేఁటినుండి నేను మఱి వీణను ముట్టను," అని చివర కనెను సురమను జూచి "నేను కోరునదంతయు నీవు సుఖముగా నుండవలెననియే," అని యనెను. విభవైపు ముఖము త్రిప్పి, "విభా—" అని ప్రారంభించెను కాని మఱియొక్కమాటయైనను పలుకలేకుండెను. కన్నులు తుడుచుకొనుచు పల్లకి నెక్కెను.



## పదునాలుగవ పరిచ్ఛేదము.

యశోధరునకు సమీపమున మంగళ నివసించుకుటీర ముండెను. ఆమె జపమాల త్రిప్పుచు కూర్చుండియుండు సమయమున నొకనాఁడు రాజాంతఃపురమునుండు దాసి యొకతె కూరగాయలబుట్ట చేతఁబుచ్చుకొని అచ్చటకు వచ్చెను.

"సంతకు వచ్చితిని నేఁడు, 'మంగళ'క్కను చూచి చాల-దినములైనది, ఒకమారు చూచివత్తునని చటాలున తట్టినది. కాని అక్కా, నేఁడుమాత్రము, చాలసేపుండలేను, పని-యున్నది," అని యనుచు దాసి మాతంగ, బుట్టను క్రిందపెట్టి నేల చతికిలఁబడెను. "నే వినిన వాని కెంతో యిష్టము__అని నీ వెఱుఁగనే యెఱుఁగుదువుకదా అక్కా! ఐననేమి, ఎవతెయో మాయలాడి యొకతె వానిమనస్సు త్రిప్పివేయుచున్నదని నాకు తెలిసినది. దానికి మూఁడురోజులలో చావువచ్చు నుపాయ మేదైన చేయలేవక్కా?"

తిరిగి రాని ఆవులను ఇంటికి తెప్పించుమందున్నది మంగళ యొద్ద, మగలను తెప్పించుమందున్నది, ఆమె వశీకరణమంత్ర మెఱుఁగును. మాతంగ బ్రతికియుండవలెనన్న మాయలాడి మూఁడుదినములలో చావవలెనఁట! కాని ఆచావవలసిన మాయలాడి సాక్షాత్తు మంగళయే!

మంగళ తనలోఁ దాను నవ్వుకొనుచు, "ఆమాయలాడి చచ్చుటకు తొందరలేదు. యమధర్మరాజునకు కొంతపని కల్పించినపిమ్మటగాని ఆమె చావదు," అని అనుకొని పైకి ఇట్లనెను- "నీవంటిరూపసిని వదలి మఱియొకరికొఱకై పోవునంత అరసికత యెవరిలోనైన నుండఁగలదా? నీవు భయపడవద్దు మనుమరాలా, నీ ప్రియునిమనస్సు నీదే యగును నీకంట్లనుండు మందుకంటె మంచిమందు ఈజగత్తులో లేదు. కనుక నీకంట్లనే మఱికొంచెము గాఢముగా ప్రయోగించిచూడుము. దానివలన నేమియు ప్రయోజనము లేనప్పుడు నేనిచ్చువేరును వానికి తాంబూలములో పెట్టియిమ్ము," ఇట్లనుచు ఎండిపోయిన వేరొకటి తెచ్చి మాతంగ చేతిలోఁ బెట్టినది.

రాజుగారియింటిలోనివార లేమి మనుమరాలా అని అడిగినది మంగళ.

"వానితో మనకేమి. నిజ మక్కా!" అన్నది మాతంగ చేతులు త్రిప్పుకొనుచు.

"ఔను మంచిమాట యంటివి తల్లి, చాల మంచిమాట," అని మంగళ అన్నది.

తనయభిప్రాయమునకును మంగళయభిప్రాయమునకును సంపూర్ణముగు నైక్యమంత సులభముగఁ గలుగునని మాతంగ ఎన్నఁడును నూహింపలేదు. కావున మాతంగ కొంచెము మనోభంగము పొంది, "ఐనను నీతో చెప్పుటలో దోషములేదు.

కాని యిప్పుడు వ్యవధిలేదక్కా మఱియొకనాఁడు వచ్చి అన్ని-
సంగతులును చెప్పెదను," అనుచు అక్కడనే మఱికొంచెము
స్థిరముగఁ గూర్చుండినది.

మంగళ—"అట్లైన మఱియొకనాఁడు చెప్పుకొంద మా
మాటలు,"

మాతంగ చీకాకుపడుచు ప్రారంభించినది—"అట్లైన
నన్ను పోనిమ్మక్కా, ఇంత యాలస్య మైనందున ఎన్నితిట్లు
తినవలసివచ్చునో!—కాని అక్కా, ఆనాఁడు రాజుగారింటికి
అల్లుఁడు వచ్చి, ఎవ్వరికో చెప్పక వచ్చిననాఁటిరాత్రియే
పాఱిపోయెను."

మంగళ—"నిజమే! అట్లేలచేసెను చెప్పుమా! చూచి-
తివా మనుమరాలా, నేనన్నది నిజము—మాతంగ కనఁబడని-
యెడల నాకు రాజుగారింటిమాట లేవియు తెలియవు"

మాతంగ—"అసలు సంగతి యెఱుఁగుదువా, అక్కా?
మాకోశలమ్మ ఉన్నదే, ఆమె రెండుకండ్లతో ఎవ్వరిని చూడ-
లేదు ఆమేమి మంత్రమెఱుఁగునోగాని మగఁడు మేఁకవలె
ఆమెవెంబడి తిరుగుచుండును—కాని ఆమాటలన్నియు
నాకేల—ఎవ రెక్కడనుండి వినెదరో—చిట్టచివర కింతయు-
నామీఁద పడును—అంతయు మాతంగ చెప్పినదే అనెదురు."

మంగళ మఱి యాపుకొనలేకపోయినది. మఱియొక-
క్షణము ఓర్చియున్నయెడల మాతంగ అంతయును తనంతట-
తానే చెప్పివేయునని మంగళ యెఱుఁగును, కాని ఓర్చి-

యుండలేక, "ఇక్కడ నెవరున్నారు మనుమరాలా, మనలో మనమనుకొనుటలో దోషమేమున్నది?" అనుచు, "అట్టి వదినాకోడలమ్మ ఏమి చేసినది?" అని యడిగెను.

"అల్లునిదగ్గఱకు వెళ్లి అతనిభార్యమీఁద ఏమి కల్పించి చెప్పినదో గాని రాత్రికిరాత్రి అల్లుఁడు భార్యను విడిచి వెళ్లిపోయెను. భార్యఏడ్పునకు మఱి అంతములేదు, రాజుగారికి కోపమువచ్చి, పిచ్చెత్తిపోవుచున్నారు, కోడలిని తక్షణమే పుట్టినింటికి పంపివేయుమనుచున్నారు — అదిగో చూచితివా — నవ్వవలసిన దేమున్నది నేనన్నదానిలో, పట్టలేక పట్టలేక నవ్వుచున్నావే!"

రామచంద్రరాయలు పాటిపోవుటకు నిజమైన కారణము కోటలోనుండు దాసదాసీలందఱును ఘోరముగా నెఱుఁగుదురు, కాని ఒకరు చెప్పుకథలో మఱియొకరు చెప్పునది పొందకున్నది.

మంగళ — "కోడలమ్మను పుట్టినింటికి అంత తొందరపడి పంప నవసరము లేదని మీ రాణీయమ్మగారితో చెప్పుము. నాయొద్ద నొకమందున్నది, దానిని ప్రయోగించినయెడల యువరాజు మనస్సు పూర్తిగా అటునుండి తిరిగిపోవును." ఈలాగున ననుచు పకపక నవ్వసాగినది.

మాతంగ — "మంచిమాట! రాణియమ్మతో చెప్పెదను."

మంగళ — "యువరాజునకు మీకోడలమ్మయెడల మిగుల ప్రేమకదా?"

"దానిమాట అనుకొని యేమిలాభము! ఆమెను చూడకుండఁగ నొక్కక్షణమైన నుండలేఁడు; ఆమె 'ఒరే,' అని పిలిచినను వచ్చును."

"సరే దానికి తగినమందు నేనిచ్చెదను—పగటిపూటకూడ యువరాజు భార్యయొద్దనే కూర్చుండునా?"

"ఆహా!"

మంగళ—"ఓయమ్మ, అదేమే! యువరాజుతో నేమి చెప్పుచుండునో, నీవెన్నఁడైన వింటివా, దగ్గఱ కూర్చుండి ఏమి చేయుచుండునో నీవెన్నఁడైన చూచితివా మనుమరాలా?"

"లేదక్కా- నేనెన్నఁడును చూడలేదు."

"నన్నొకనాఁడు కోటలోనికి తీసికొనివెళ్లఁగలవా నేనది చూచి వచ్చెదను."

"ఆయనవసరమైన బాధయంతయును నీకేల అక్కా?"

"ఔను నిజమే, కాని చూచినయెడల నామంత్రము పాలునో లేదో తెలియును"

"మంచిది, కాని నేటికిక నన్నుపోనిమ్ము" అనుచు మాతంగ బుట్టఁగట్టుకొని లేచి పోయినది.

మాతంగ వెళ్లిపోయినతోడనే మంగళ పటపట పండ్లుకొరుకుచు కండ్లు పెద్దవిచేసి ఏమేమో నేలుచుండెను.

---

## పదునైదవ పరిచ్ఛేదము

వసంతరాయలు బయలుదేరునప్పటికి చీఁకటి కావచ్చుచున్నది. విభ డాబామీఁద కెక్కినది. పల్లకి పోవుచున్నది. తాతయ్య పల్లకిలోనుండి తల పైకిపెట్టి వెనుకకు తిరిగి చూచుచున్నాఁడు. పాషాణహృదయమైనకోటలో నెట్టిమార్పును లేదు, దానిలో నించుకయైనను చలనము పుట్ట లేదు. దాని చుట్టు ఎత్తుగానుండు పెద్దపెద్ద రాతిగోడలు తాతయ్యకంటికి అప్పుడుండుచీఁకటివలనను, అతనికండ్లు నీళ్లతో నిండియుండుటవలనను నల్లమైననీడలవలె కనఁబడుచున్నవి పల్లకి వెళ్లిపోయినను విభమాత్ర మచ్చటనే నిలిచి ఆదారివైపు చూచుచున్నది. నక్షత్రము లుదయించినవి, రోడ్డుప్రక్కను దీపములు వెలుఁగుచున్నవి, కాని మనుష్యులుమాత్రము నడచుట లేదు, విభ దూరమునకుఁ జూచుచు అక్కడనే నిలిచియుండెను. సురమ ఆమెకొఱకు దేశమంతయు వెదకివెదకి ఎచ్చటను గానక చిట్టచివరకు డాబామీఁదికివచ్చెను. విభ కనఁబడినతోడనే ఆమెయొద్దకుఁ బరుగెత్తికొనివచ్చి, ఆమెభుజముపై చేయివేసి, ఆమెను గట్టిగా కౌఁగిలించుకొని, "ఏమి చూచుచున్నావు విభా?" అని యడిగెను. విభ నిట్టూర్పువిడుచుచు, ఏమియు లేదు, అనెను. విభ కంతయు శూన్యముగ కనఁబడుచుండెను.

విభ యింటిలోని కేలపోవుచున్నదో, బయటి కేల వచ్చుచున్నదో, ఏల పండుకొనుచున్నదో, ఏల లేచుచున్నదో

మటమధ్యాహ్నమప్పుడు ఈ గదినుండి ఆగదికి ఆగదినుండి యీగదికి ఏల తిరుగుచున్నదో—ఏమియు నామెకే బోధపడ కున్నది. ఆమె మనస్సున సుఖ మన్నమాట లేదు. ఆ రాజప్రాసాదములో తన యిల్లు మఱి లేదు; తానుండుగది అచ్చటినుండి పాఱిపోయినదని ఆమె కనిపించినది. తనచిన్ననాఁటి యాటపాటలను, తన నవ్వుఏడ్పులను, చిన్నప్పటినుండి తా ననుభవించుచున్న సుఖదుఃఖములను కలిపి విభ తనహృదయధనమంతయును వంపి నిర్మించిన తనముద్దుటింటి నెవరు వచ్చి ఒక్కనాటిలో విరుగఁగొట్టిరోకదా! ఆయిల్లిఁక విభయిల్లు కాదు. తాతయ్య వెళ్లిపోయినాఁడు, తాను గృహవిహీనురాలైనది—తన్ను దీసికొనిపోవుటకు చంద్రద్వీపమునుండి ఎప్పుడు భృత్యుఁడు వచ్చునో! రాసమోహనీపాటకి బయలు దేరియుండును-ఇక్కడనుండి వెళ్లినప్పటినుండి వారందఱును ఎక్కడనున్నారోకదా!

ఆనందము పూర్తిగాపోలేదు, ఏమాత్రమో యింకను మిగిలియున్నదని విభ కనిపించుచున్నది. అన్నయున్నాఁడు. ఆహా ఎట్టిప్రేమ అతనిది! తనప్రాణముతో సమానమైన సురమ యున్నది, కాని నీడవలె ఏదో విపత్తు తనవెనుకనే ఎల్లప్పుడును వచ్చుచున్నట్లు ఏలనోగాని విభకు భయమగుచున్నది. ఇంటిప్రహారీలను ఛేదించుకొని, ఇంటదూరి, కంటి కగపడకుండ, నేమూలనో ఆపదయొకటి నిద్రించుచున్నదని మనకు రాత్రింబగళ్లు నిపించుచుండిన, ఆయిల్లు మనయిల్లని ఎట్లుతోచును?

పని పోయి సీతారాముఁడు చిక్కులలో నున్నాఁ

డని ఉదయాదిత్యునకు తెలిసినది. సీతారామునిచేత ఒక్క-
దమ్మిడియైన లేదు, కాని వాని పీకచుట్టు కావలసినన్ని ఉరులు:
సీతారాముఁడు రాజుగారికోటలో పనిచేయుచు పెద్దజీతము
సంపాదించుచుండువాఁడు. వాని మేనత్త మగఁడు దూరదేశ-
మున నేదో పనిలో నుండెను. వానిలో నకస్మాత్తుగా భరింప-
లేనిప్రేమ పుట్టుటవలన వాఁడు పనివిడిచి భార్య మేనల్లుఁడగు-
సీతారామునియిల్లు చేరుకొని వానిని చూచి "ఆహా! ఇన్నాళ్లకు
నాయాఁకలి తీరినది," అన్నాఁడు. అప్పటినుండి సీతారాము-
నొద్దనే ఉండెను. పినతండ్రి యాకలి తీర్చుకొనుటకు అనేకప్ర-
మాణములు కనఁబడుచుండెనుగాని ఆయాఁకలితీరుట సీతా-
రాముని ముంచుటవలననే యనుటకుమాత్రము తగినప్రమా-
ణము లేదు. సీతారామునికి వరుసకు అక్కయగునట యొవరో
ఒకతె; ఆమెకొకకొడుకుండెను, ఆమె వానినేదైన పనిలో పెట్ట-
వలెనని ప్రయత్నించుచుండెను. అంతలో, కొడుకును చిన్న-
పనిలో పెట్టినయెడల మేనమామ నవమానపఱచినట్లగునని
యామెకు హఠాత్తుగా తట్టుటవలన, ఆమె కొడుకును పని-
లోనికి వెళ్లనిచ్చినది కాదు. మేనల్లుఁడు చేయుచున్న మానరక్ష-
ణము సీతారాముని ఋణమును వృద్ధిచేయుచుండెను, గాని
అక్కగారిసౌఖ్యమునకుఁగాని మేనల్లునిసౌఖ్యమునకుగాని
లోటులేకుండునట్లు ఏర్పాటుజరుగుచుండెను. ఇదికాక ఇంటిలో
సీతారాముని ముసలి విధవతల్లి యున్నది, పెండ్లి కావలసి-
యున్న పెద్దకూతురొకతె యున్నది. ఈవల, సీతారాముఁడు

చాల సుఖవాసి, ఆమోదప్రియుఁడు, ఆటపాటలు సదా కావలెను. రాముని అవస్థ మాఱినదిగాని వాని బంధువులబసమాత్రము మాఱలేదు. మేనల్లునివయస్సు పెరుగుచున్నది. దానితోపాటు వానిపొట్ట పెద్దదగుచున్నది, మానమానావమానములయెడలగల ఉత్సాహముకూడ నధికమగుచున్నది. రూపాయలసంచి ఖాళీయైనను బంధువులపొట్టలుమాత్రము పెద్దవగుచునేయున్నవి, సీతారాముని సరదాలకుఁగూడ నెట్టియాటంకమును కలుగలేదు—అప్పులే వీనికిప్పు డాధారము.

ఉదయాదిత్యుఁడు సీతారాముని దురవస్థనుగూర్చి విని వానికిని, భాగవతునకును మునుపటివలె నెలనెలకు జీతము పంపుచుండెను. యువరాజు పంపుచున్నడబ్బు పుచ్చుకొనుచుండుటకు సీతారామునకు మిక్కిలి సిగ్గుగానుండెను. మహారాజావారియెదుట యువరాజుపేరు వానినోటిలోనుండి వచ్చిననాఁటినుండి తాను తనదృష్టికి, యువరాజు దృష్టికిఁగూడ అపరాధి అని వానికిఁ దోఁచుచుండెను. ఒకనాఁ డెప్పుడో యువరాజు వాని కగపడుట తటస్థించినప్పుడు వాఁ డాయన పాదములమీఁదఁ బడి "నీవే నాకు భగవంతుఁడవు, నీవే నాకు జగదీశ్వరుఁడవు, నీవు దయామయుఁడవు," అని ఏడ్చుచు నాయనను క్షమింప వేఁడుకొనెను.

భాగవతునిది అత్యుదాసీనస్వభావము, గుడుగుడుపీల్చుచు చతురంగమాడుకొనుచుఁ గూర్చుండును, ఇరుగుపొరుగువారిని స్వర్గమునకు కొంతమందిని నరకమునకు కొంత-

మందిని పంపుచుండును. ఉదయాదిత్యుఁడు పంపినరూపాయలతనియొద్దకు వచ్చినప్పుడు కనుబొమ్మలు చిట్లించుచు, మూఁతి విరుచుచు "యువరాజు నాకొంపముంచి ఈనాలుగురూపాయలతో తాను చేసినతప్పు దిద్దుకొనవలెనని చూచుచున్నాఁడు గాఁబోలు" అన్నాఁడు, కాని రూపాయలుమాత్రము తిరుగ-గొట్టలేదు.

పనిపోయిన యిద్దఱునౌకర్లకు మునుపటిజీతము యువ-రాజుమూలమున ముట్టుచున్నదని మహారాజావారికిఁ దెలిసి-నది. పూర్వ మిట్టివిషయము లాయనసముఖమునకు వచ్చునవి కావు. ప్రతాపుఁడు కొడుకును మిగుల తృణీకరించుచుండుటచే కొడుకు చేయుపనులనుగుఱించి ఆయనచెవిని పడుట యంతగా-లేదు. ఉదయాదిత్యుఁడు ప్రజలతో కలసిమెలసి యుండునని ప్రతాపుఁ డెఱుఁగును, ప్రజలపక్షమై తననువిరుద్ధమగుచుండు-నని యెఱుఁగును, గాని అతఁడు జోక్యము కలుగఁజేసికొను-విషయములు చిన్నచిన్నవగుటచేతను మిక్కిలి సామాన్యమైన-వగుట చేతను, తండ్రి వానినిగుఱించి దఖలు పుచ్చుకొను-వాఁడు కాఁడు; ఏదో పెద్దవిషయములో యువరాజెప్పుడో దూరినప్పుడుతప్ప యువరాజొకఁడున్నాఁడనియే ప్రతాపునికి జ్ఞప్తికివచ్చుటలేదు. మహారాజావా రిప్పుడు మునుపటవలె యువరాజువిషయమై నిర్లక్ష్యముగా నుండకపోవుటవలన ఆయన నౌకర్లిద్దఱికిని జీతముపంపుచున్నట్లు రాజావారిచెవిని తత్క్షణమే పడినది. ప్రతాపాదిత్యుఁడు మిగుల కోపగించి

ఉదయుని పిలిపించి, "సీతారాముని, భాగవతుని, పనిలోనుండి తీసివేయుటకు కారణము రాజకోశములో వారిజీతమునకు తగినధనము లేదనుకొని కాఁబోలు వారికి జీతమును నీవు పంపుచుండుట?" అని యడిగెను.

"దోషిని నేను. వారిని నీవు దండించుటవలన శిక్ష-పొందినది నేను, నీవు విధించిన శిక్షప్రకారము ప్రతిమాస-మును నేను జరిమానా వారిచేతి కిచ్చుచున్నాను," అని ఉదయుఁడు నిష్ఠురిగా జబాబుచెప్పెను.

ఇంతకుముం దెన్నఁడును ఉదయాదిత్యునిమాటలు చెవియొగ్గివినుటకు ప్రతాపాదిత్యుని కవసరములేకపోయినది. నిశ్చలభావముతోను వినయముతోను ఉదయాదిత్యుఁ డిప్పు-డిచ్చినజబాబు వినినప్పుడు తండ్రిమనస్సున కొంతయాశ్చర్యము నానందము పుట్టకపోలేదు. కొడుకనినదానికి ప్రత్యుత్తర-మీయక, "వారికి నీవెట్టియర్థసహాయమును చేయఁగూడదని నాయాజ్ఞ, ఉదయా!" అని ప్రతాపుఁ డనెను.

"మఱింత పెద్దశిక్ష విధించుచున్నావు" అని చేతులు-జోడించి ఉదయుఁ డనెను—"ఇంత కఠినశిక్ష వహింపవలసి-నంత యపరాధము నేనేమిచేసితిని? ఏఁడెనమండ్రుమనుష్యులు ఆఁకలిగొని, తిండికిలేక, నిరాశ్రయులై, వడ్చుచు, ఊరివెంబడి తిరుగుచుండఁగా చూచుచు నేనే దానికి కారణమని యెఱిఁగి-కూడ నేమియుచేయక ఊరకుండుట నాకెట్లు శక్యమగును? నాకు భోజనమునకుఁ గొదువలేదు, నాకవసరమున్న దానికంటె

పదిరెట్లు నీవిచ్చుచున్నావు. కాని నావిస్తరిని పలువిధములైన పిండివంటలతో నింపి, ఎదుటను కడుపుమాడుచు ఏడ్చుచున్న ఆపదిమందిని కూర్చుండఁబెట్టి వారి కొకపిడుచయైనను పెట్టనీయక నన్ను భోజనముచేయుమనిన, నేను దినునది నాకు విషమనిపించదా నాన్నా?”

ఉదయుఁ డుత్తేజితుఁడై యాడినమాటలన్నియు నెట్టిఅడ్డును పెట్టక తండ్రి వినెను; ఆమాటలు ముగిసినతోడనే మెల్లగ నిట్లనెను, “నీవు చెప్పవలసినదంతయు విన్నాను, నేను చెప్పఁబోవునది యిప్పుడు నీవు వినుము. సీతారామునికిని భాగవతునకును జీతము నేను నిలిపితిని, దాని నిప్పుడు మరల నెవరైన నిచ్చినచో నాయిచ్చువాఁడు నాకు విరోధియగును” ప్రతాపునికి లోలోపల చాలకోపము పుట్టినది, ఆకోపమునకు నిజమైన కారణము తనకే తెలియదేమో, కాని తనలో తా నిట్లనుకొనసాగెను—“నేనేదో గొప్ప దౌర్జన్యము చేసితినా? దయామూర్తియైన ఉదయుఁడు దాని ప్రతీకారము చేయవచ్చెనా? దయాళువైన వాఁడు ఏమిచేయునో నేనును చూచెద! నేను కఠినముగా నుండుచోట దయచూపునా హాసమూ! ఉదయాదిత్యుఁడు సురమయొద్దకుపోయి సమస్తమును ఆమెకు తెలియఁజేసెను. సురమ ఇట్లనెను.—“మొన్న సాయంకాలము సీతారామునితల్లి వానిచిన్నకొమార్తె నెత్తుకొనివచ్చి నాయెదుట నేడ్చుచు కూర్చుండెను, రోజంతయు ఇంట నెవ్వరికిని తిండిలేదఁట నేనప్పుడే దేమైన నిచ్చినట్లైన వారింట నారాత్రి వంట

యానఁట, లేనియెడల పస్తేయఁట. సీతారామునికూఁతురు పాలుత్రాగుపిల్ల, ఆనాఁడు ఉదయమునుండియు పాలు లేవఁట, ఆచంటిదానిముఖము చూచుచు ఎవరూరకుండఁగలరు? వారు మనలను వదలి ఎక్కడికి పోఁగలరు?"

ఉదయాదిత్యుఁడు—"ముఖ్యముగా, వారిని మనకోట-నుండి తరిమివేసితిమని తెలిసినతరువాత నాన్న భయమువలన వారికెవ్వరు పని యిచ్చుటకుగాని,సహాయము చేయుటకుగాని సాహసింపరు. అట్టియవస్థలో మనముకూడ వారిని దూరముగ నుంచినయెడల వారిగతి ఏమికాను? వారికి నేను సహాయము-చేసితీరెదను. దానివిషయమై నీకెట్టి సందేహమునువద్దు, నే నాలోచించుచున్నది, ఆవిషయమైకాదు. నాన్న కేవలము సబబులేనివాఁడు, ఆయనకు కోపము తెప్పించుట మంచిది కాదు. అతనికి తెలియకుండ మనకోరిక నెరవేర్చుకొనుమార్గము చూడవలెను"

భర్తచేతులు పట్టుకొని "నీవేవియు చేయనక్కరలేదు, చేయవలసినది నేను చేసెదను, ఆపూచీ నామీఁద వదలిపెట్టుము నాథా" అనెను. తాను ముందుండి ఉదయాదిత్యుని తన వెనుకనుంచి పనిచేయవలెనని సురమ సంకల్పము. ఉదయా-దిత్యునికి మంచిరోజులు కావివి. భాగ్యదేవత ఉదయాదిత్యుని-చేతి కొప్పఁజెప్పిన పనులన్నియు అతనితండ్రి మతమునకు విరుద్ధములైనవే, ఐనను, సురమవంటిభార్య నిరుత్సాహపఱచ-వలసినది ఆపనులలో నొక్కటియైనను లేదు. భర్త ధర్మయుద్ధ-

మునకు పోవలసివచ్చినప్పుడు తనచేతులతో తానే భర్తకు కవచముతొడిగి భర్త వెడలినపిమ్మట ఇంటిలోనికిపోయి మూలకూర్చుండి ఏడ్వవలసినస్త్రీ కాదు సురమ. అడుగడుగునకు సురమ వణఁకుచుండెను, గాని అడుగడుగునకు భర్తకు ధైర్యము చెప్పుచుండెను. ఆపదసమయమప్పుడు పెక్కుమారులు ఉదయాదిత్యుఁడు సురమ ముఖమువైపు చూచియుండెను, సురమ నేత్రములనుండి అశ్రుధారలు కారుచుండెను, గాని యామె పాదములయందు గాని చేతులయందు గాని, వేఱెట్టి భయమును, వణకును కనఁబడ లేదు.

ఒక నమ్మకమైన దాసిచేతికిచ్చి సీతారాముని తల్లికిని భాగవతునిభార్యకును ప్రతిమాసము సొమ్మందఁజేయు ఏర్పాటు సురమ చేసినది. దాసి నమ్మఁదగినదే గాని ఈకబురు మంగళకు తెలియకుండ నుంచవలసిన యవసరము దానికి కనఁబడలేదు, కనుక ఈసంగతి మఱియెవ్వరికిని తెలియకపోయినను మంగళకుమాత్రము తెలియకపోలేదు.

---

## పదునాఱవ పరిచ్ఛేదము.

సీతారాముడును, భాగవతుడును జీతము రహస్యము-గా వెళ్లుచున్నదని తెలియఁగానే ప్రతాపాదిత్యుఁడు మాటలు వృథా వ్యయముచేయక సురమ పుట్టినింటికి తత్క్షణమే పో-వలసినదని అంతఃపురములోనికి వర్తమానము పంపెను. ఉద-యాదిత్యుఁడు మనస్సును దృఢపఱచుకొనెను. విభ పద్మాచు సురమవద్దకు పరుగెత్తినది; "నీవు వెళ్లిపోయినయెడల నే నీ శ్మశానపురిలో నెట్లుండఁగలను వదినా?" అనుచు సురమ భుజ-ముపై చేయివేసి గట్టిగా కౌఁగిలించుకొనినది. సురమ విభ గడ్డముపట్టుకొని ఆమెను ముద్దుపెట్టుకొనుచు, "నేనేల వెళ్లె-దను విభా! నే నెక్కడికి వెళ్లెదను; నా కున్నదంతయు నిక్క-డనే యున్నదికదా!" యనెను. కాని త్వరలో ప్రతాపాదిత్యుని-యాజ్ఞ సురమకందినది, అప్పుడామె యిట్లనినది, "అమ్మగారిం-టికి వెళ్లుటకు నాకు కారణమేమియు కనఁబడలేదు. అక్కడ-నుండి రమ్మని వార్తలేదు, నన్ను తీసికొనివెళ్లుటకు మనుష్యులు-రాలేదు. నాభర్తయభిప్రాయముకూడ నేనిప్పుడు పోవలె-నని కాదు ఎట్టికారణమును లేకుండ హఠాత్తుగా పుట్టినింటికిఁ బోవలసినయవసరము నాకు కనబడకున్నది" ఇది విని ప్రతాపుఁడు మండిపడెను, కాని కొంచె మాలోచింపఁగా కోపమువలన లాభములేదని యతనికి తోఁచినది. సురమను

బలప్రయోగమువలన బయటికి పంపుటకు వీలులేదు, ఒంటిబలమంతఃపురములో పనికిరాదు. ఆఁడువారితో సంబంధించిన-విషయములలో ప్రతాపుఁడు కేవల మజ్ఞాని. బలవంతుల-యెడల బలముఁ బ్రయోగించుట ప్రతాపుఁడు బాగుగా నెఱుఁ-గునుగాని అబలలవిషయములలో ఎట్లు చేయవలెనో అతని తలలోనికి దూరునది దుకా. అతఁడు లావుపాటి మోకులను త్రుంచి పారవేయఁగలఁడు. కాని సన్ననిదారమునఁ బడినముడి విప్పుటకు చేతకాదతనికి. స్త్రీ బోధపఱచుకొనుటకు సులభమైన పదార్థము కాదు, బోధపఱచుకోఁదగిన వస్తువు కాదు. స్త్రీలతో సంబంధించిన ఏచిక్కు వచ్చినను అది విప్పుభారము రాజు రాణి-మీఁద వేయును. ఆఁడువారినిగుఱించి ఆలోచించు మనస్సుండవలెనను కోరిక లేదాయనకు; మనస్సుండుటకు సమయము లేదు, దానికి తగిన యోగ్యతయు లేదు—అట్లు చేయుట కేవలము ని-ష్ప్రయోజనమైనపని. ప్రతాపుఁడు రాణిని పిలిపించి "సురమను అమ్మగారింటికి పంపివేయుము," అనెను. "అట్లైన నాబిడ్డఁడు, ఉదయునిపని యేమౌను" అని దుఃఖముతో రాణి యడిగెను. రాజు చీకాకుపడుచు—"ఉదయుఁడింకను చంటివాఁడు కాఁడు; రాజకార్యములు సులభముగా సాధించుకొనుటకై సురమను అమ్మగారింటికి పంపవలెను—ఇది నాయాజ్ఞ," అని ప్రత్యుత్తరమిచ్చెను.

రాణి ఉదయునిఁ బిలిపించి "నాయనా, సురమను పుట్టి-

నింటికి పంపివేయనిమ్ము" అని యనెను. "ఎందుచేతనమ్మా, సురమచేసిన యపరాధమేమి?" అని ఉదయాదిత్యుఁ డడిగెను.

రాణి—"నాకేమి తెలియును నాయనా, మేము ఆఁడు-వారము మాకేమియు బోధపడదు. కోడలిని పుట్టినింటికి పంపుటవలన రాజకార్యమునకు కలుగులాభమేదో మహా-రాజావారికే తెలియవలెను."

ఉదయాదిత్యుఁడు—"నన్ను కష్టపెట్టి దుఃఖతునిఁజేసిన రాజ్యమున కెట్లు ఉన్నతికలుగఁగలదో నాకు తెలియకున్న-దమ్మా. సహింపగలిగినంతదుఃఖము సహించుచునే యున్నాను. నాకు మఱియెట్టిసుఖమును ప్రాప్తిలేదు, అది నేనెఱుఁగుదును. సురమకుమాత్ర మేమిసుఖమున్నది, ప్రతిదినము నామె భరించుచున్న తిట్లే యామె ధరించు ఆభరణములు, ఉదయము-మొదలు రాత్రివఱకు ఆమెను మన మామె నవమానించని-రోజులేదు చివరకామె కిక్కడ స్థానముకూడ లేదను-చున్నారు. ఆమెతో మన కెట్టిబాంధవ్యమును లేదా, అమ్మా? ఆమె మనగడపకువచ్చిన ముష్టిదా, మనచిత్తము వచ్చినంత-కాలము మనయింటనుంచి మనకిష్టములేనప్పుడు పొమ్మనుటకు? అట్లయినచో ఈ రాజప్రాసాదములో నాకుఁగూడ స్థానము లేదు, నాకుఁగూడ సెలవిమ్ము, అమ్మా!"

రాణి ఏడ్చుచు నిట్లనెను, "మహారాజుగారికి ఎప్పటి కేబుద్ధిపుట్టునో నాకేమియు బోధపడదు తండ్రీ. కాని కోడలు-

మాత్రము మంచిదికాదు, అదియు నిజమేనాయనా! అది మనయింటిలో కాలుపెట్టినది—ఇంటిలో మఱిసుఖమన్న-మాటలేదు—ఆమాట తలఁచుకొనినమాత్రాన లోపున మంటపుట్టును. కనుక నామాట విని రెండురోజులపాటు కోడలిని అమ్మగారింటికివెళ్లనిమ్ము నాయనా, చూతము—మన-యింటి లక్ష్మి తిరిగి మనయింటికి వచ్చునో రాదో తెలియును?"

ఉదయాదిత్యుఁడు తల్లిమాటలకు జవాబీయలేదు. ఊరక కొంచెము కూర్చుండి లేచి బయటికి పోయెను.

రాణి ఏడ్చుచువచ్చి ప్రతాపాదిత్యునిమీఁదపడినది—"సురమను పంపివేసినయెడల ఉదయుఁడు మఱిబ్రతుకఁడు మహారాజా! కాని వానితప్పేమియులేదు. ఆరాక్షసి వానిని మంత్రముతో కట్టియుంచినది." ఇట్లని వెక్కి వెక్కి ఏడ్వసాగెను.

"సురమ పోకుండిన ఉదయుని చెరసాలలో పెట్టియుం-చెదను" అని మహారాజు అతికోపముతో పలికెను

రాణి రాజుగారియొద్దనుండివచ్చి సురమను పట్టుకొని-నది—"నాకొడుకు నేమిచేసితివే నీముఖము తగులఁబడ! నా తండ్రిని నాకిచ్చివేయవే! నీవునాయింట నడుగుపెట్టినది మొద-లు వానిని పట్టుకొంటివి పిశాచమువలె, వానిని నాశనము చేసితివి పూర్తిగా, రాజకుమారుఁడు వాఁడు, చివరకు వాని చేతులకు సంకెలలువేయించనిదే నీమనస్సునకు శాంతి కలుగ-దటే?"

"నావలన ఆయన చేతులకు సంకెలలా అత్తయ్యా! అట్లైన నే నిప్పుడే పోవుచున్నాను," అనినది సురమ, భయముతో వణఁకుచు విభకడకుఁబోయి సురమ ఆమెతో నంతయుఁ జెప్పినది, విభ భుజముపై చేయివేసి ఆమెను కౌఁగిలించుకొని "విభా నేనీక్షణమే పోవుచున్నాను బహుశః నన్ను మఱియిక్కడకు రానీరు" అనినది. విభ యేడ్చుచు సురమపైఁబడినది. సురమ ఆక్కడనే చతికిలఁబడిపోయినది.

ఆమెయెదుటనున్నది అంతములేని భవిష్యత్తు ; ఆభవిష్యత్తున అందరాని అద్దరినుండి ఒక్కమాటమాత్రము వచ్చి సురమ చెవిని పడుచున్నది.—"మఱి లేదు!" ఇఁకమఱి, నేను లేను, నాకు మఱి బ్రతుకులేదు, ఏమియుఁ బ్రయోజనము లేదు! ఎదుట వ్యాపించియున్నది. భయంకరమగు భవిష్యత్తామెకన్నుల కగపడుచున్నది. ఆమెకు సదా కనబడుచుండెడిముఖము ఆభవిష్యత్తులో కనఁబడదు, మునుపటియాటపాటలులేవందులో, మునుపటి యాదరణము లేదు. ఆభవిష్యత్తులో హృదయమునకు హృదయమునకు సంయోగములేదు, ప్రాణమునకు ప్రాణమునకు కలయిక లేదు ; ఒకరివైపొకరు చూచుచున్నప్పుడు కన్నులలో అనురాగము లేదు, గుండె బ్రద్దలైనంతదుఃఖము కనఁబడుచున్నను, కన్నులలో తడిలేదు, ప్రేమలేదు—ఎంత భయంకరమైనది ఆభవిష్యత్తు ! సురమగుండె గబగబ కొట్టుకొనుచున్నది, తలతిరుగుచున్నది, కన్నుల నీరెండిపోయినది. ఉదయాదిత్యుఁడు గదిలో కాలుపెట్టియుఁ

బెట్టకమునుపే సురమ యతనికాళ్లు పట్టుకొని, ఆపాదముల గుండెపై నుంచుకొని గట్టిగా నొక్కుకొనుచు, గుండెపగులు-నా యనునట్లు వెక్కివెక్కి యేడ్వసాగినది. సురమ యింతగా నెన్నఁడు నేడ్వలేదు. అంత గట్టిపఱచుకొనిన మనస్సైనను నేఁడు ముక్కలుముక్కలైపోయినది. ఉదయుఁడు తక్షణమే నేల చతికిలఁబడి సురమ తలను ఒడిలో పెట్టుకొని "ఏమి సురమా ఏమైనది?" అని యడిగెను. సురమ ఉదయాదిత్యుని ముఖమువైపు చూచుచు, వెక్కివెక్కి యేడ్చుచున్నది, నోట-నుండి మాట రాలేదు—ఏమి జవాబు చెప్పఁగలదు పాపము! చివరకు అన్నది—"ఆముఖము నాకిఁక కనబడదా ? సాయం-కాలమువచ్చి నీవా కిటికిలో కూర్చుండియున్నప్పుడు నేనా ప్ర-క్కనుండనా? రాత్రి దీపము మలఁగినతరువాత నీవువచ్చి ఆద్వారమున నిలువఁబడియుండఁగా నేను చిఱునవ్వునవ్వుచు నీ రెండుచేతులను పట్టుకొని నిన్ను గదిలోనికి తీసికొని రానా! నీ విక్కడనే యుందువు గాని నేను ఎక్కడనోగదా!" "ఎక్కడనో" అనుదానిలో నెంత నిరాశయుండెను ! అందలేనిదూరము. దాటలేని ఎడఁబాటు అని అనునట్లామాటవలనఁ దట్టుచుం-డెను. "నిన్ను చూచుటకుమాత్రము సెలవిచ్చి, అంత-కంటె దగ్గఱకు పోరాదని ఎవరైన నన్నాజ్ఞాపించిన నీవు నాకెంతో దూరమైపోతివని అనిపించుచుండునుగదా, ఆమా-త్రమును కూడదన్నప్పుడు ఆదూరమంత కెన్నింతలో అధిక-మౌనుగదా, నీకును నాకు తెలియుటకు కొంతకాలము పట్టు-

ననునంతదూరమున మనముందునప్పుడు అదియే భరింపలేని-దూర మనిపించునుకదా. నీవు నాకు కనఁబడనియెడల నేను చచ్చిపోయెద ననునప్పుడుకూడ నీవు నాకు కనఁబడలేనప్పుడు నేను బ్రతికియేల—ఈ రెండుకాళ్లను గుండెపై గట్టిగా నొక్కుకొని యీక్షణమే ప్రాణత్యాగముచేయుట పరమ-సుఖము!"

---

## పదునేడవ పరిచ్ఛేదము.

కథాప్రారంభమున సూచింపఁబడిన రుక్మిణియే ఇప్పుడు రంగమున ప్రవేశించిన మంగళ. ఆమె రాయగడు విడిచివచ్చి మాఱుపేరు పెట్టుకొని యశోహరప్రాంతదేశమున నివాసముచేయుచున్నది. రుక్మిణిలో నసాధారణగుణ మేమియును లేదు. విషయాపేక్షతోను, ఈర్ష్యతోను, నిండియుండి, నలుగురను లోఁబఱచుకొనఁగోరు నీచస్వభావముగల అతిసామాన్యస్త్రీ యామె. నవ్వు, యేడ్పు లామెకు చేతిలోనిపనులు, అవసరమైనప్పు డవి ఒక్కక్షణములో బయటికి వచ్చుచుండును,అవసరమైనచో ఒక్కక్షణములో మాయమైపోవుచుండును. కోపమువచ్చునప్పు డామె యొక ప్రచండస్వరూపము ధరించును; ఆకోపమునకు కారణమగువారిని తనగోళ్లతోను, కోరలతోను చీల్చివేయునా యునితోఁచుచుండును. అట్టిసమయముల నామె అంతగా మాటలాడదు, గజగజ వణఁకుచుండును, ఆమెకంఠములోనుండి అగ్నిజ్వాలలు పైకివచ్చుచుండును, కరఁగి మరుగుచున్న ఇనుమువలె కోప మామెహృదయకటాహమందు కుతకుతమని ఉడుకుచుండును ఈర్ష్య పామువలె నామెమనస్సులో బుస్ బుస్ మనుచు తోక నిటునటు కొట్టుచుండును. ఇది యిట్లుండ మఱియొకమూలనుండి వ్రతములును తాంత్రికానుష్ఠానములును ఆమె సల్పుచుండును. ఆమెతో పరిచయ-

మున్న వా రందఱిమనస్సులను ఆమె అత్యద్భుతముగ పోల్చు-
కొనఁగలదు. యువరాజు సింహాసన మెక్కినప్పుడు అతని-
హృదయాసనమునఁ దనసింహాసనమును వేసికొని అతని హృదయ-
రాజ్యముతోపాటు యశోహరరాజ్యమునుగూడ పాలించు-
చుండవలె నను కోరిక యామెను స్వప్నములోనైన విడువకు-
న్నది. ఆకార్యము సాధించుట కామె చేయలేనిదని యేము-
న్నది? రాజప్రాసాదమునందు దాసదాసీజనమందఱితో ననేక-
దినములనుండి యెంతయో ప్రయత్నముపై స్నేహముకలిపి
యుంచినది. అక్కడ జరుగుచుండు చిన్నచిన్న సంగతులుగూడ
నామె తెలిసికొనుచుండును. సురమముఖ మేమాత్రమైన
వాడినదనఁగానే ఆవార్తవచ్చి యామెచెవినిపడును. ప్రతా-
పాదిత్యునిశరీరమున నెట్టి యస్వస్థతగలిగినను ఆమె కామాట
నిమిషములమీఁద దెలియును—విని ఇంతకాలమున కాశీ-
శ్వరునకు చావువచ్చునని యామె యనుకొనుచుండును.
ప్రతాపాదిత్యుని మృత్యువునుగాంక్షించియును, సురమ మరణ-
మునుగోరియును, నామె ఎన్నియో యనుష్ఠానములు
చేయుచుండెను. గాని నేటివఱకు నొక్కటైనను సఫలము కా-
లేదు. "నేఁడు సురమయో లేక ప్రతాపాదిత్యుఁడో తెల్ల-
వాఱుసరికి మంచముపై చచ్చిపడియుండు" నను యాశ ప్రతి-
దినమును ప్రాతఃకాలమున నామెలో పుట్టుచుండును చివర-
కంతకంతకు నోర్పుతగ్గి "నామంత్ర తంత్రములన్నియు తగులఁ
బడనీ, కాని వారు నాచేతి కొక్కమాఱు దొఱకినచో నా

కోరికను మనసార నెరవేర్చుకొందును," అని తనలో నామె యనుకొనుచుండెను. ఇట్లనుకొనుచు పండ్లు బిగింపఁబోయి పెదవులు కఱచుకొనుటవలన నోట రక్తముగూడ అప్పు-డప్పుడు కారుచుండెను.

రాజునకును రాణికిని సురసయెడ లోలోపల సుముఖత దిన-దినము పెరుగుచుండుట పక్కిణికిఁ దెలిసెను. చివరకు సురసను నగరమునుండి పంపివేయవలె నన్న ప్రయత్నము గూడ జరిగినదని విని యామె అమితముగ సంతోషించినది. ఐనను సురస అచ్చటనుండి పోకుండుట కని పెద్ద ఉపాయము నొకటి యెన్నినది.

అనేకవిధములైన మంత్రములు, తంత్రములు, మం-దులు ఎఱిఁగియుండిన అనుభవముగల ఫకీరు యొక్క [illegible]-మున నున్నదని రాణితోఁ జెప్పి, పలుకుచున్న సురస నచ్చటనుండి పంపివేయుటకు మనుష్య యత్నము [illegible] రాజు మనస్సు నామెపైనుండి త్రిప్పివేయుట మంచిదని రాణికి బోధించి, రాణి దానికి తగిన-యౌషధము మంగళయొద్దనుండి రహస్యముగ తీసికొనిరమ్మని మాతంగను బంపెను.

మంగళ బహువిధములైన వేళ్ళులను దెచ్చి, వానిని ముక్కలుచేసి, దంచి, నూరి, మంత్రములు చదువుచు రాత్రి-యంతయుఁ గూర్చుండి, వానినన్నిటిని కలిపి యొకవిషతుల్య-మైన యౌషధమును తయారుచేయుచున్నది. ఊరిబయట ఎటువైపునను నెట్టిశబ్దమును వినఁబడని అర్ధరాత్రి వేళ ఆ చెట్ల నడుమ దాఁగియున్న కుటీరములో అమాన్ దస్తాశబ్దము పుట్టు-

చున్నది. అనిర్వచనీయమగు నడురేయి నిశ్శబ్ద మొక్కటియే నామెకు తోడు. ఇది యొకతెఱఁగైన పరిమళము లేక వినిపించుచుం-డుటచే నామెమనస్సు ఎంతయుత్సాహముతో నాట్యము-చేయుచున్నది.

ఔషధము తయారగుటకై దినములు పట్టినవి. అవి-మనసు స్థిరపరచుటకై దినములు పట్టకపోవునుగాని సురమ మృతినొందునపుడు ఉదయాదిత్యుని మనస్సున నెట్టి దుఃఖమును కల్గకుండునట్టుల చేయుటకై మంగళ యనేకమంత్రములు చదువవలసివచ్చెను, నానావిధములైన యనుష్ఠానములు చేయ-వలసివచ్చెను.

మహారాజాగారితోఁ జెప్పినట్లే సురమ నిచ్చుటనే మఱి కొన్నిదినములు ఉంచనిచ్చిరి. సురమను చంపివేయుదురని తెలిసినప్పటినుండి విభను ఎటుచూచినను మహాసముద్రమువలె నుండి ఆమె ఎల్లప్పుడును సురమతోడనే యుండును, ఏమియు మాటలాడక ఛాయవలె దినమంతయు సురమవెనుకనే తిరుగు-చుండును. ఒక్కొక్కరోజు గడచుచున్నది, సాయంకాల మగునప్పటికి విభను తొలినాఁటికంటె దగ్గఱకు లాగుకొని గట్టిగా కౌఁగిలించి పట్టుకొని యుంచుకొనవలెనని సురమకు కోరిక పుట్టుచున్నది. దినములను చీల్చి యామెప్రాణమునుండి వేరుచేసి యెవరో లాగుకొనిపోవుచున్నట్లనిపించుచున్నది సురమకు. ఎటుచూచిన నంధకారమనిపించుచున్నది విభకు సురమకుగూడ నెటుచూచినను శూన్యమే! ఆమె ఉదయా-

దిత్యుని పాదములకడఁ బడియుండు నొకప్పుడు; ఒకప్పు డతని యొడిలో తలపెట్టి పండుకొనియుండును. మాటాడక యతని- ముఖమువైపు చూచుచుండుటతప్ప మఱియేమియు చేయ- లేదు. ఉండియుండి "విభా, నాసర్వమును నీచేతి కొప్పఁజెప్ప- పోవుచున్నానే," అనుచు చేతులతో రెండుకన్నులును నొక్కుకొని వెక్కి వెక్కి ఏడ్చుచుండెను.

సాయంకాలము కావచ్చుచున్నది, మరునాఁటిప్రాతః- కాలమున సురమను అమ్మగారియింటికి పంపివేయుదును. ఒకొక్కటిగా, తనకున్న సర్వమును సురమ విభ చేత కప్పఁ- జెప్పవలె. సురమను తనతోడ నుంచుకొనఁగలిగినపరే, లేనిచో కాసుకుప్రాసాదమునుండి వెడలిపోవుదనని దృఢప్రతిజ్ఞ చేసి- కొని ఉదయాదిత్యుఁడు ప్రశాంతుఁడై హాప్పుండియుండెను. చీకటి పడఁగానే సురమ కాళ్లలో వణకు పుట్టినది, తల తిరుగుట మొదలుపెట్టినది ఆమె మఱి నిలిచియుండలేక, తనగదిలోనికిఁ బోయి మంచముపై పడిపోయి, "విభా, విభా, అన్నయ్య నొకసారి పిలుచుకొనిరమ్ము, ఒక్కనిమిషమైనను ఆలస్యము- చేయకుము," అనెను.

ఉదయాదిత్యుఁడు గదిలో నడుగుపెట్టినతోడనే సురమ "నాథా, రమ్ము రమ్ము నాకేమైనదో చూడుము," అని రెండు- చేతులను భర్తవైపు చాచెను. ఉదయాదిత్యుఁడు మంచము- దగ్గఱకు రాఁగానే అతని రెండుకాళ్లను పట్టుకొనెను. ఉద- యాదిత్యుఁడా మంచముపై కూర్చుండెను, సురమ చేతులును,

కాళ్లును, చల్లఁబడిపోవుచున్నది. ఉదయాదిత్యుఁడు "ఏమైనది సురమా, ఏమైనది," అని భయముతో తడఁబడుచు నడిగెను. సురమ ఉదయాదిత్యునివైపు మెల్లఁగ ముఖము నెత్తి "నా-రోజులు పూర్తియైనవి," అనుచు, చేతులు ఉదయాదిత్యుని భుజముపై వేయఁ బ్రయత్నించినది, కాని చేతులు లేవలేదు. ఉదయుఁడు సురమతలను తనరెండుచేతులతో నెత్తఁబోయి, "నన్ను విడిచి నీవెక్కడికి పోవుచున్నావు సురమా ? నీవు లేనిచో నాకు మఱి యెవరున్నారు సురమా!" అనుచు నేడ్వ-సాగెను.

విభ మతిపోయినదానివలె శూన్యనేత్రములతో సురమవైపు చూచుచుండెను, సురమయు నావంక చూచు-చుండెను.

ఆసమయమున, సురమయు నుదయాదిత్యుఁడును ప్రతి-సాయంకాలమును కూర్చుండు కిటికీతలుపు తీసియున్నది. ఆకాశమున నక్షత్రములు కనఁబడుచున్నవి, మెల్ల మెల్లఁగ గాలి వీఁచుచున్నది, అన్నివైపులను నిశ్శబ్దము. గదిలో చిన్న-దీపము వెలుఁగుచున్నది, దేవాలయమునుండి వచ్చుచుండిన జయఘంటానాదమును, శంఖనాదమును, క్రమక్రమముగా నిలిచిపోయినవి. సురమ మృదుస్వరముతో, "నాకనుల కేమియు నగపడకుండనున్నది, నీనోటితో నేదైన ననుము నాథా," అనెను.

## పదునేడవ పరిచ్ఛేదము

సురమ విషము తిని చచ్చిపోయినదని అంతఃపురములో అనుకొనుచున్న మాట విని, రాణి సురమగదిలోనికి పరుగెత్తుకొనివచ్చెను

అంతఃపురములోని వారందఱును నామెవెంటఁబడిరి. రాణి సురమనుజూచి, "సురమా, నాతల్లి, నీవెక్కడకును పోనక్కరలేదే, నీవు మాయింటి లక్ష్మివమ్మా, నిన్నెవరు వెళ్లుమన్నారు తల్లి!" అని మొరపెట్టుచు నేడ్వ నారంభించెను. సురమ అత్తగారిపాదధూళి తలపై నుంచుకొనెను, రాణి యేడ్పు రెండింతలైనది. "అమ్మా, నీవు శోకమువచ్చి వెళ్లిపోవుచున్నావే, తల్లి?" అనుచు రాణి ఏడ్చెను. అప్పటికి సురమ నోట మఱి మాటలేదు, ఏమో చెప్పఁబోయినదిగాని చెప్పలేకపోయెను అప్పటికి తెల్లవాఱుచున్నది, "అంతయు నైపోయినది," అనిచెప్పి వైద్యుఁడు పోయెను.

"అన్నయ్యా అన్నయ్యా!" అని ఏడ్చుచు విభ సురమ గుండెపైఁబడి, యామెను కౌఁగిలించుకొనెను. ఇట్లు కొంతసేపైనది తెల్లవాఱినది. ఉదయాదిత్యుఁడు సురమతల నింకను తనయొడిలోనే యుంచుకొని కూర్చుండెను.



# పదునెనిమిదవ పరిచ్ఛేదము

సురమ లేనేలేదా ! లేనట్లు విభ కనిపించలేదేలనో? 'సురమ కనఁబడును, ఇక్కడెక్కడనో యున్నది!' అనుకొనుచు తనలోనున్న ప్రాణము సురమను వెదకుచు తిరుగుచున్నదా యనునట్లు విభ ఈగదినుండి యాగదికి, ఆగదినుండి ఈయాగదికి తిరుగుచున్నది. సాయంకాలము తలదువ్వుకొనువేళ యగుచున్నది, సురమవచ్చి మామూలుప్రకారము జడవేయుననుకొని ఆమెకొఱకై కనిపెట్టుకొనియున్నట్లు విభ యూరక కూర్చుండియున్నది. వేళ దాటిపోయినది. చీకటిపడినది, ఐనను సురమ రాలేదే! నేఁడు జడవేయుట మఱి జరగదు. నేఁడు విభముఖ మెంతయో వాడియున్నది,ఐనను సురమ రాలేదేల? సురమ యెన్నఁడును నిట్లు చేయదే! విభముఖమున కొంచెము విచారము కనఁబడుసరికి సురమ ఆమెయొద్దకు వచ్చి భుజముపై చేయివేసి యామెను గట్టిగా కౌఁగిలించుకొని ఏమైనను నామెను వదలక ఆమెముఖము చూచుచు కూర్చుండునదే? నేఁడు?—గుండె బ్రద్దలైపోయినను నేఁడు సురమ రాదు! రాదు! రాదు!

ఉదయాదిత్యుని బలములో సగము తగ్గినది. ప్రాణములో సగము పోయినది. సురమ అతఁడుచేయు ప్రతికార్యములోను దాఁగియుండు నాశ, ఆమెయే అతని యుత్సాహదాత, ఆమెయిచ్చుసలహాయే అతనికి అన్నిసహాయములకంటె నెక్కువ

సహాయమును, ఆమె చిఱునవ్వే అతఁడు పొందఁగోరు బహుమానము—అక్కసురమ మఱిరాదు. అతఁడు తనపడకగదిలోనికిఁ బోయి, ఏమి బుద్ధిపుట్టినదో గాని, నాలుగువైపులను పరీక్షించి చూచును—కాని ఎవ్వరును లేరే! మెల్లఁగఁబోయి కిటికిలోఁ గూర్చుండును కాని సురమ కూర్చుండుస్థలముమాత్రము వెలితిగా నున్నది! నాలుగువైపులను వెన్నెల, ఎదుట నరణ్యము, మునుపటివలెనే గాలి వీచుచున్నది—ఈ రాత్రి సురమ నాకడకు రాకుండ నాపఁగలదా? అని ఉదయాదిత్యునికి అనిపించుచుండును కాఁబోలు.

హఠాత్తుగా సురమకంఠము వినఁబడినట్లనిపించి ఉదయుఁడు ఉలికిపడుచుండును—అసంభవమని తెలిసినను ఎక్కడైన నుండునేమో యని నలుదిక్కులను చూచును, ఒకసారి మంచముక్రిందఁ దొంగి యప్పుడు చూచును. మునుపు, రోజంతయు ననేకవిధములైన చిన్నచిన్న పనులలో తగులచుండువాఁడు, ప్రతిదినము సాయంకాలము కాఁగానే ఎందరో అనేకవిషయములనుగూర్చి యతనిసలహా కోరుచు వచ్చువారు, ఫలమూలములాదుల నతనికి ఉపహారముగ నిచ్చువారు, యువరాజా వారికుశలమునుగూర్చి ప్రశ్నించుచుండువారు. ఇప్పుడట్టిదేదియు చేయలేకున్నాఁడు, పగను సాయంకాలమగునప్పటికి నలసి పడకగదివైపు మరలుచున్నాఁడు. "గదితలుపు తెఱచుసరికి నేఁడు సురమ తనకిటికీలో కూర్చుండియుండునా!" అని ప్రతిదినమును హఠాత్తుగ నతనికి తోచ-

చుండును. విభ వాడినముఖముతో ఇటునటు పిచ్చిదానివలె తిరుగుచుండుట చూచినప్పుడెల్లను ఉదయునిగుండె బ్రద్దలగుచుండును. ఉదయుఁడు చెల్లెలిని పిలిచి దగ్గఱకూర్చుండఁబెట్టుకొని ముద్దుతో మాటలాడుచుండును. చిట్టచివరకు మఱియాఁపుకొనలేక విభ యేడ్చుచుండును, ఉదయుఁడుకూడ కన్నుల నీళ్లు పెట్టుకొనును. ఒకనాఁడు అన్నయ్య విభతో, "చెల్లి, నీకీయింటమిగిలియున్న దేమున్నది, నిన్ను మీఅత్తవారియింటికి దిగఁబెట్టునేర్పాటు చేయనిమ్మమ్మా," అనెను విభ యూరకుండుటచూచి, "నాదగ్గఱ సిగ్గెందుకమ్మా, నాతో చెప్పనియెడల మఱియెవరితో నీమనస్సునందుమాట చెప్పఁగలవు చెల్లి!" అని ఉదయుఁడనెను. విభ యేమియు నుత్తర మీయలేదు; కాని ఆత్మప్రశ్న యడుగ నవసరము. పుట్టినింట నుండుట కెన్నఁడైన బుద్ధిపుట్టునా యామెకు! ఆమె యుండఁగోరు—ఆచంద్రద్వీపమునకు పోవుటకై యామెప్రాణము కొట్టుకొనుచుండవలెను. కాని యామెను తీసికొనిపోవుట కింకను ఎవ్వరును రాలేదేమియోకదా?

విభ నత్తవారియింటికి పంపుటనుగూర్చి ఉదయుఁడు తండ్రితో నొకనాఁడు ప్రసంగించెను. తనకేమియు నభ్యంతరము లేదని తండ్రి యనెను "కాని విభయెడల వారి కెట్టియాదరణమున్నను వారే ముందు కబురు పంపియుందురే అది లేనప్పుడు మనమేల తొందరపడవలయును," అని తండ్రి చెప్పెను.

విభ కనఁబడునప్పుడెల్లను తల్లి యేడ్చుచుండును. భర్త-యుండికూడ విధవవలె నుండవలసిన విభనుచూచిన నెవరికి **దుఃఖముకలుగదు?** ఇదియునుగాక రాణికి అల్లునిపై మిగుల-దయ. అతఁడు కేవలము కుఱ్ఱతనముకొలఁది చేసినదాని ఫల మిట్టిది యగుట రాణి కెంతమాత్రము నిష్టములేదు. "విభ నత్తవారియింటికి పంపుము మహారాజా," అని రాణి ప్రతా-పుని వేఁడుకొనినది. "అనేకసారులు లామాట నీనోట వింటిని నాకు విసుగుపుట్టించకుము, విభను పంపుమని వారు నన్నె-ప్పుడు వేఁడుకొనెదరో అప్పుడే విభ వారికి లభించును," అని ప్రతాపుఁడు కోపగించుచు ననెను.

రాణి—"అత్తవారియింటికి వెళ్లక పిల్ల యిక్కడనే చాలకాల ముండిపోయినయెడల నలుగురు నేమందురు?"

రాజు—"కానుకోరు ప్రతాపాదిత్యుఁడు తనకొమా-ర్తెను పంపినప్పుడు రామచంద్రరాయ లామెను తనయింట ప్రవేశింపనీయక గడపదగ్గఱనుండి త్రోలివేసినయెడల నలు-గురును ననునదేమి?"

మహారాజావారు చేయుపనులకు ఒకొక్కప్పుడు దారియు తెన్నును నుండదనుకొనుచు రాణి యేడ్వసాగెను.



## పందొమ్మిదవ పరిచ్ఛేదము

మానావమానములనుగుఱించి రామచంద్రరాయలకుఁ గల జ్ఞానము మహోన్నతమైనది. ఒకనాఁటిసాయంకాలము రాజావారు విహారార్థులై బయలువెడలిరి. మూఢులగు సాలెవాండ్రిద్దరు, దారిప్రక్కను తమగుడిసెయెదుట బట్టలు నేయుచుండిరి. రాజావారు ఆదారిని పోవునప్పుడు సాలెవాండ్రు లేచి నిలుచుండలేదని, రాజావారు గొప్ప గందరగోళము చేసిరి. ఈయన యౌవనములో మామగారియింట నున్నప్పు-డొకనాఁడు నౌకరుతో నేదో పనిచేయుమని చెప్పెనఁట—ఆ మహామూఢుఁడు పొరపాటున ఒకపనికి మఱియొకపని చేసికొని వచ్చెనఁట. పౌరుషశాలియగు రామచంద్రరాయలు మిగుల కోపగించి అత్తవారియింట తనకుఁ దగినమర్యాద జరగకున్న-దనియు, తన్నవమానపఱచుట నౌకర్లుకూడ యజమానుల-యొద్ద నేర్చుకొనుచున్నారనియు, సిద్ధాంతపఱచెను సాక్ష్య-ముగా, అది జరిగిననాఁటియుదయమే గురునారాజు, ఉదయా-దిత్యుఁడు, ఆనౌకరుకే యేదియో చెవిలో చెప్పుచుండెను. ఆచెప్పినది రామచంద్రుని యవమానపఱవలెననికాక మఱి-యేమి కాఁగలదు? ఒకనాఁ డెవరోనలుగురు పిల్లవాండ్రు కలసి మంటిసింహాసన మొకటిచేసి, మంటితోనే రాజును మంత్రిని, కొంతమంది సభ్యులను చేసి రాజదర్బారు—ఆట ఆడుకొను-

చుండిరి. ఈవృత్తాంతము రాజావారు విని ఆబాలకులతండ్రులను పిలిపించి భయపెట్టిరి.

నేఁడు రాజుగారు సింహాసనమున బాలీసుపైఁ జేరఁబడి గుడుగుడు పీల్చుచుఁ గూర్చుండియున్నారు. ఎదుట నిలిచియుండు దరిద్రుఁడు అపరాధి, విచారణ జరుగుచున్నది. రామచంద్రరాయలు మామగారియింట నున్న రోజున జరిగినకథనుగురించి వీఁడేదో సందర్భమున కొంత విని, తనస్నేహితులతో కలసి ఆఘటననుగూర్చి వాదన చేయుచుండెనఁట— ఈసంగతి వానివిరోధి యెవఁడో విని రాజుగారిచెవిని వేసెను. రాజుగారికి కోపమువచ్చి వానిని పిలిపించి వానికి కొన్నాళ్ళు కారాగారవాస మిచ్చుట యుచితమా లేక వానిని యురితీయించుట మంచిదా యని ఆలోచించుచున్నారు.

"మహాయోగ్యుఁడవు రా నీవు!" అని యనుచున్నారు రాజుగారు.

"శరణు శరణు మహాప్రభూ, నేనట్టి పని చేయఁగలవాఁడను కాను," అని ఏడ్చుచు వాఁడు ప్రార్థన మొనరిచ్చుచున్నాఁడు.

ప్రతాపునితో మన మహారాజావారిని సరిపోల్చుట యెంతసాహసము రా నీకి మూర్ఖుఁడా!" అని మంత్రి యనుచున్నాఁడు

దివాను— "ప్రతాపాదిత్యుని తండ్రికి రాజపదవి మొదట లభించినప్పుడు రాజతిలకముపెట్టి రాజ్యాభిషేకము

చేయింపమని వచ్చి అతఁడు మనమహారాజావారి తాతగారిని ప్రార్థించెను. అతఁ డెంతయో యేడ్చి వేఁడుకొనఁగా తాత-గారు తమ ఎడమకాలి చిటికెనవ్రేలితో అతని నొసట తిలక-ము పెట్టిరి, ఆమాట నీవు వినలేదేమో, మూర్ఖుఁడా?"

రమాయి—"ప్రతాపాదిత్యుఁడు, ప్రతాపాదిత్యుని-తండ్రి విక్రమాదిత్యుఁడు—వారివంశములో రాచఱికము ఈ రెండుతరాలనుండియే. ప్రతాపునితాత వానపాము, వాన-పాము బిడ్డడు జలగ—ఆజలగ ప్రజలరక్తము పీల్చిపీల్చి ఉబ్బి-నది. జలగ బిడ్డఁడు తల నేల కొట్టికొట్టి చేటవలె చేసికొని ఆచేటతలను పడగవలె నెత్తనేర్చుకొన్నాఁడు. వంశపారంప-ర్యముగా మేము రాజసభలలో నుండువారము—పాము మంత్రగాండ్రము మేము, జాతిపా మేదో పోల్చుకొనలే-మా?" రాజావారికి మహాసంతోషము కలిగినది. నవ్వుచు గుడుగుడు పీల్చుచున్నారు. రాజసభయందు ప్రతాపుని నేదో కారణముపై తిట్టనిదిన మెప్పుడు లేదు. రామచంద్రుని రాజ-సభ నలంకరించియున్న సైనికులు ప్రతాపునిపైఁపుపై వాగ్బాణ-ములు గురిపించి తమయమ్ములపొదులను ఖాలీ చేయక సభ యేనాఁడును ముగియకున్నది. అది ఎట్లున్నను నేఁటి యప-రాధిమాత్రము మిక్కిలి యేడ్వసాగెను ; అప్పు డాప్రచండ-ప్రతాపముగల రామచంద్రరాయలు వారు "ఈమాయిమా-త్రము నిన్ను ప్రాణములతో విడుచుచున్నాను, ఇటుపైని జాగ్రత్తగా నడచుకొనుము" అనిరి.

సభ్యులందరును పోయిరి, మంత్రియు విదూషకుఁడును మాత్రమే సభాస్థలమందున్నారు. ఇంకను ప్రతాపునివిషయమైయే మాటలు జరుగుచున్నవి.

"తమరు యశోస్నేరు విడిచిన తరువాత నక్కడ యశోస్నేరులో పెద్దగొడవ జరిగినది. కౌమారి విధవరాయైనయెడల గాజులును మురుగులును అమ్మి ఖజానా వృద్ధిచేయవలెనని యాశించును ప్రతాపాదిత్యుఁడు. దాని కడ్డువచ్చుచుండు నుదయాదిత్యుఁడు—దీనిని గుఱించి గొప్పగందరగోళమైనది."

రాజుగారు నవ్వుచు, "వహావ్వా" అన్నారు.

మంత్రి—"ప్రతాపుఁ డిప్పుడు మిక్కిలి దుఃఖించుచున్నాఁడని వినుచున్నాను మహారాజా; ఎట్లైన కౌమారైనిచ్చటికి పంపుటకు వీలౌనాయని నిద్రాహారములు విడిచి రాత్రింబగ ల్లాలోచించుచున్నాఁడు.

రాజుగారికి మహాఆనందముకలిగినది, "నిజముగా!" అని నవ్వుచు, గుడాకు వడిగా పీల్వనారంభించిరి.

మంత్రి—"పిల్ల నత్తవారింటికి పంప నవసరములేదు, మామహారాజుగారు మీయింటిపిల్లను పెండ్లాడుటవలన మీపెద్దలు వెనుక నేడుతరములనుండికూడ తరించిరి. మీపిల్లను తమయింటికి తీసికొనిపోయి తమవంశము నింకను నీచముగ చేసికొనునంతపుణ్యము మీరేదియు చేయలేదని నేను చెప్పితిని—నేనన్నది ఎట్లున్నది రమాయ్?"

రమాయి—"ఎట్లున్నదని యడిగెదవేల! బురదలో కాలుపెట్టినతరువాత ఇంటికి వచ్చి లోనికి ప్రవేశించునప్పుడు కాలు కడుగుకొనక మఱియేమి చేయఁగలరు, మహారాజా!"

ఈవిధమున హాస్యపరిహాసములు జరుగుచుండెను ప్రతాపాదిత్యుఁడును ఉదయాదిత్యుఁడును ఎదుట నిలువఁబడి-యున్నట్లూహించి వారినవమానపఱచుచుండిరి. ఉదయాది-త్యుఁడు చేసినయపరాధమేమో తెలిసికొనుట కష్టము—అతఁడు తనపై వచ్చిపడునపాయమును లక్ష్యపెట్టక రామచం-ద్రుని ప్రాణములను కాపాడెను,—ఇది మఱచి అతఁడు ప్రతా-పాదిత్యుని కుమారుఁడనిమాత్రము జ్ఞప్తియుంచుకొని ఆయ-పరాధమునకై రామచంద్రుఁడతనిని దూషించుచుండెను, ఎగతాళిచేయుచుండెను. దీనినిబట్టి రామచంద్రునిది క్రూర-స్వభావమని మన మూహింపఁగూడదు, అతనిస్వభావమున నొకవిధమైన లఘుత్వముండెను—లఘుహృదయుఁడనవచ్చు-నతనిని; విశాలతలేని మనస్సతనిది. ఉదయాదిత్యుఁడు తన-ప్రాణమును గాపాడెనని రామచంద్రుని కెట్టికృతజ్ఞతయు లే-దు—అట్లు కాక మఱియెట్లు కాఁగలదు, అట్లు కాకుండిన మిగుల యన్యాయమగునని రామచంద్రునివాదము. రామ-చంద్రుఁడాపదలోపడియున్నప్పు డందఱును కలసి యతనిని కాపాడుటకాక మఱియేమిచేయఁగలరు? రామచంద్రరాయల-కాలిలో ముల్లుగ్రుచ్చుకొనిన జగత్తులోనుండు నందఱకును బాధ కలుగక మానదని రామచంద్రుని నమ్మకము ప్రపంచము-

లోనుండు సామాన్యులలో నతిసామాన్యునికైనను తనయాపదముండదట మహారాజాధిరాజైన రామచంద్రరాయల యాపదయైనను లెక్కలోనిది కాదని రామచంద్రునికి తట్టలేదు. స్తుతిపాఠకులు తమచేతులలోఁ బట్టుకొనియున్న తక్కెళ్లలో తన్నొకప్రక్కను, సమస్తప్రపంచమును మఱియొకప్రక్కను, వేసి ఎల్లప్పుడు చూచుకొనుచుండు రామచంద్రునిమనస్సులో, తానే ప్రపంచమంతటికంటెను బరువైన పదార్థమను నమ్మకము బలపడ్డది, అట్టిమనస్సున నెవరియెడలను కృతజ్ఞత సులభముగ నుదయింపదు. ఉదయాదిత్యునియెడల కృతజ్ఞత లేకపోవుటకు మఱియొక కారణముకూడ నున్నది— ఉదయాదిత్యుఁడు రామచంద్రుని ప్రాణములను విభకొఱకై నిలఁబెట్టెననియు, రామచంద్రుని కాపాడవలెనను నుద్దేశము ఉదయునిలో నెంతమాత్రము లేదని రామచంద్రుని నమ్మకము. అతని మనస్సున నుదయునియెడల కృతజ్ఞత యుండినను ఉదయునిగూర్చి జరుగుచుండు హాస్యపరిహాసముల కడ్డువచ్చుసాహస మతనిలో లేదు. నలుగురును గలసి నవ్వులాటలు జరుపుచున్నప్పుడు—అందులో ముఖ్యముగా రమాయిఎవరినైన నెగతాళి చేయుచున్నప్పుడు—దానికి అడ్డువచ్చుటకుఁగాని వారితోఁ గలసి తానును పరిహాసమాడకుండుటకుఁగాని తగినమనోబలము రామచంద్రునిలో లేదు. ఏదిచేయఁబోయినను "ఇట్లుచేసిన నందఱు నేమనుకొందురో?" అని ముందుగా అనుకొనవలసినవాఁడు రామచంద్రుఁడు.

విభ యనిన నిప్పటికిని రామచంద్రునిలో నాకర్షము-న్నది. ఆమె రూపవతి, యౌవనములో నిప్పుడే యడుగుపెట్టి-నది, రామచంద్రునితో కలసి కొద్దిరోజులుమాత్రమే యుం-డెను. ఆనాటిరాత్రి అకస్మాత్తుగా రామచంద్రుఁడు నిద్రనుండి లేచి చూచునప్పుడు, విభ, ప్రక్కను కూర్చుండి ఏడ్చుచుం-డెను; ఆమెముఖముపై వెన్నెల పడుచుండెను; పైటచెంగు-ప్రక్కకు సగము జారియుండెను,గుండెపైకిలేచి క్రిందికి పడు-చుండెను; జాలిపుట్టించుకన్నులనుండి నీరు వఱదలయి కారు-చుండెను; లేతచిగుళ్లవలెనుండు నామె పెదవులు వణఁకుచుం-డెను. రామచంద్రునిమనస్సున నెట్టిభావము హఠాత్తుగా ఉదయించినదో గాని విభతలను తనయొడిలో పెట్టుకొని యామె-కనులను తుడిచెను. విభలో నప్పుడే వికాసము పొందుచున్న యౌవన మంతకుముం దతనికంటఁబడలేదు, అతనిలో పులక-రింపు పుట్టినది, సగము తెఱచియున్నకనులు తడియైనవి, గుండె వడిగా కొట్టుకొనసాగినది. విభను ముద్దుపెట్టుకొనవలె ననుకోరిక పుట్టె ముఖము దించుచున్నసమయమున తలుపుపై శబ్దము వినఁబడినది, తలుపు తెఱవఁగానే రాఁబోవు విపత్తు-సంగతి తెలిసినది. అతనిలో నప్పుడే వాంఛ వ్యక్తమగుచు-న్నది, అతని హృదయమునకు మెలఁకువవచ్చినది—ఎట్టితృప్తి-యు పొందక మునుపే వేరగుటవలన అతనిలో పుట్టినకర్షణము మఱింతప్రబలమైనది. కాని ఇది శాశ్వతముగా నుండవల-సినప్రేమ కాదు, రామచంద్రుని లఘుహృదయమున కట్టిది

సాధ్యముకాదు. కులాసాపురుషునకు విలాసపదార్థముపై మన-
స్సు హఠాత్తుగా పోవురీతి, రామచంద్రునిలో నట్టియాకర్షణ
మకస్మాత్తుగాఁ బుట్టినది. ఎట్లైననేమి, అతని యౌవనస్వప్న-
మున విభ ఉదయించినది, విభనుగూర్చి అభిలాష ఉతనిలో
జన్మించినది. కాని విభను తీసికొనివచ్చిన పలుగురు నేమను-
కొనెదరో? భార్యచేతిలో నుండవలసినవాఁడని సభాసదులు
తనవిషయమై యనుకొనెదరేమో! మంత్రి యిష్టపడఁడు,
రమాయి లోలోపల నవ్వుకొనును. ఇంతియకాక,
విభను తీసికొనివచ్చినచో ప్రతాపాదిత్యునికి శాస్తినిచ్చుట
యెట్లగును, మామగారిపై నతఁడు పగఁదీర్చుకొనవలసియు-
న్నదే! ఇట్లు పలువిధముల నాలోచించుటవలన విభను తెప్పిం-
చుటకు తగినబల మతనిలో పుట్టకుండెను. విభనుగూర్చి జరు-
గుచున్న హాస్యముల కడ్డువచ్చుటకైన నతనికి సాహసము లే-
కుండెను, ప్రతాపాదిత్యునిమాట జ్ఞప్తికివచ్చుటవలన అడ్డు-
వచ్చుట కిష్టముకూడ లేకుండెను.

మంత్రియు విదూషకుఁడును బయటికి పోయినతరు-
వాత రామమోహనుఁడు వచ్చి "మహారాజా!" అనుచు
చేతులు జోడించి నిలుచుండెను,

"ఏమి రామమోహన్?"

"సెలవిమ్ము మహారాజా, నే నిప్పుడే పోయి రాణియ-
మ్మను తీసికొనివచ్చెదను."

"అదియేమి అర్ధ్దరాత్రిముల నడుగుచున్నావు?"

"చిత్తము మహాప్రభూ, నిజమే! అంతఃపురము శూన్యమైయుండుట నేను చూడలేను. లోనికి పోయి చూచునప్పుడెల్ల మహారాజావారిగదిలో నెవ్వరును కానరాక నాకు మిక్కిలి దుఃఖము కలుగుచున్నది. రాణి, నాతల్లి, ఈయింటికి మహాలక్ష్మి, ఆమె నిచ్చటికి తీసికొనివచ్చి నాకనులను సార్థకపఱచుకొననిమ్ము, మహారాజా"

"మోహనా, నీకు పిచ్చియెత్తినది, ఆమెను నాయింటికి-రానిచ్చెద ననుకొనుచున్నావా?"

మోహానుఁడు కన్నులు పెద్దవిచేసి, "రాణియమ్మ చేసిన యపరాధమేమి మహారాజా?" అని యడిగెను.

"ఏమి నీవనునది మోహనా! ప్రతాపాదిత్యుని కొమార్తెను నాయింటికి తీసికొనివచ్చుచున్నావా?"

"తీసికొనిరావేల ? ప్రతాపాదిత్యునితో నామె కేమి-సంబంధము? పిల్ల పెండ్లి కానంతసేపే తండ్రిది, పెండ్లియైన పర-క్షణమే తండ్రి యధికారముపోవును ఆమెయిప్పుడు మీరాణి. ఆమె నిచ్చటకి తీసికొనివచ్చి తగినమర్యాద మీరు చేయని-యెడల మఱియెవరు చేయుదురు?"

"ప్రతాపాదిత్యునికొమార్తెను నేను పెండ్లాడుటయే చాలు చాలు. పైగా ఆమెను నాయింటికి తీసికొనివచ్చిన యెడల నామర్యాద కాపాడుకొనుట యెట్లు?"

"మీభార్యను మీ రితరులయింట విడిచిపెట్టివచ్చితిరి. ఆమెపై మీకెట్టియధికారము లేక, ఎవరియిష్టానుసారము వా-రధికారము చలాయించుచుండ మర్యాద కాపాడుకొనుట యెట్లయ్యెను ?

రాజు—"ప్రతాపాదిత్యుఁడు పిల్లను పంపనియెడల?"

మోహనుఁడు—"ఏమంటిరి మహారాజా? పంపనియెడలనా? పంపకపోవునంతటిసాహస మెవరికి? ఆమె నాతల్లి, మాయింటి మహాలక్ష్మి, ఆమె నిచ్చటికి రాకుండ కట్టిపెట్టఁగలవారెవరు? ప్రతాపాదిత్యుఁ డెంతగొప్పవాఁడైనను నతనియొద్దనుండి మాతల్లిని తీసికొనివచ్చెదను. ఇదియే మీతోఁ జెప్పుట మహారాజా, నాతల్లిని నేను తీసికొనివచ్చెదను, నాకడ్డుపడుటకు నీ కెట్టియధికారమును లేదు," ఇట్లని రామమోహనుఁడు బయటికిఁ బోయెను.

రాజు తొందరతొందరగా నిట్లనెను—"ఇదిగో ఇది వినుము మోహన్, వినని దే వెళ్ళకుము. సరే నీవు రాణిని తీసికొనివచ్చుటకు పొమ్ము, నేను దాని కభ్యంతరపెట్టను— కాని యీమాట ఎవ్వరికిని తెలియఁగూడదు, మంత్రి చెవిని గాని రమాయి చెవిని గాని ఈమాట పడఁగూడదు."

రామమోహనుఁడు, "చిత్తము మహారాజా!" అనుచు బయటికిఁబోయెను.

రాణి ఇచ్చటికి వచ్చినతరువాత ఈసంగతి అందఱికిని తెలిసిపోవును, కాని దాని కింకను కావలసినంతవ్యవధి యున్నది, ఇప్పుడప్పుడే దానికొఱకు సిద్ధపడ నక్కఱలేదు. ప్రస్తుతము సిగ్గుపడ నవసరము లేకుండఁ జేసికొనిన చాలునని రామచంద్రుని తలంపు.



## ఇరువదవ పరిచ్ఛేదము.

దేనివలన ఉదయాదిత్యునికి కొంచెము సుఖము కలుగు-నో అట్టిపనులు చేయుచుండుటకుమాత్రమే విభ రాత్రింబగళ్లు చేయు ప్రయత్నము. అన్న పనులన్నియు విభ తనచేతులతోఁ తానే చేయుచుండును—అన్నకొఱకు తానే వండును, అన్న భోజనము చేయుచున్నప్పుడు, అతని కెదురుగ కూర్చుండును. ఏవిషయములోనైన ఎట్టిలోటును ఉండనిచ్చునది కాదు. సం-ధ్యవేళ ఉదయాదిత్యుఁడు చేతులు ముఖమున కడ్డుగ పెట్టు-కొని తనగదిలో కూర్చుండును—బహుశః కండ్లవెంబడి నీళ్లు-కారుచుండునేమో—అప్పుడు విభ మెల్ల మెల్లఁగవచ్చి అన్న-కాళ్లదగ్గఱ కూర్చుండును, దేనినిగుఱించియైనను మాటలాడ-వలెనని ప్రయత్నించునుగాని మాటలు తోఁచవు. ఇద్దఱిలో నొకరినోటకూడ మాటలుండవు, మిణుకుమిణుకు మనుచుండు-దీపము ఉండియుండి ఘుప్పుఘుప్పున లేచుచుండను. గోడలపై నీడ యాడుచుండును. విభ ఆనీడను చూచుచు చాలసేపు కూర్చుండి కూర్చుండి, గుండెలు బ్రద్దలగునంత పెద్దనిట్టూర్పు విడిచి, మఱి యాపుకొనలేక "ఏది అన్నయ్యా?" అనుచు వెక్కి వెక్కి ఏడ్చును. ఉదయాదిత్యుఁడు ఉలికిపడి కనులు తుడుచుకొనుచు విన్నదాని యర్థము తెలియనట్లును బోధపఱ-చుకొనుటకు ప్రయత్నించుచున్నట్లును విభవైపు చూచును.

అంతలో పూర్తిగా తెలివివచ్చి, కన్నులు తుడుచుకొనుచు, "చెల్లీ, నీకొక కథ చెప్పెదను వినుము తల్లీ," అని విభతో ననును.

వర్షపుదినము—ఆకాశము మేఘములతో నిండియున్నది, రోజంతయు హోరున వర్షము పడుచున్నది, తోటలోని చెట్లపై నాకాశము నీటిని దిమ్మరించుచున్నది, పగలే చిట్టచీఁకటియై యున్నది. ఉండియుండి పెద్దగాలితో ఇంటిలోనికి జల్లు వచ్చుచున్నది. ఆకాశమున ఉఱుములు ఉఱుముచున్నవి, దూరమున మెఱపు మెఱయుచున్నది. ఉదయుఁడు ఊరక కూర్చుండియున్నాఁడు. ఆచీఁకటిలో విరామములేకుండ కురియుచున్న వర్షపుహోరు "లేదు, సురమ లేదు," అనుచున్నట్లున్నది. చినుకులతో తడిసియున్న గాలి మాటిమాటికిని దీర్ఘాంకారముతో "ఏదీ, సురమ ఏదీ," అనుచు లోనికి తోసికొనివచ్చుచున్నట్లున్నది. విభ నెమ్మదిగా దగ్గఱకువచ్చి, "అన్నయ్యా!" అనును. అన్నయ్య దానికేమియు జబాబీయలేక ముఖము చేతులలోఁ బెట్టుకొని తెరచియున్న కిటికీపై వ్రాలును—తలమీఁద చినుకులు పడుచుండును. రోజంతయు నిట్లు గడచినతరువాత సాయంకాలమగును, చీఁకటిపడును. రాత్రి కాగానే విభ అన్న భోజనమున కేర్పాటుచేసి వచ్చి "అన్నయ్యా వడ్డించుట యైనది భోజనమునకు కూర్చుండుము," అనును. ఉదయాదిత్యుఁ డేమియు ఉత్తరమీయక కదలక మెదలక కూర్చుండును. చాలరాత్రి యగును. విభ గద్గదస్వరముతో, "ప్రొద్దు-

"పోయినది లెమ్ము అన్నయ్యా!" అనును. ఉదయాదిత్యుఁడు తలయెత్తి చూచుసరికి యేడ్చుచుండు విభముఖ మతనికంట బడును-అతఁ డప్పుడు త్వరత్వరగా లేచి విభకనులను తుడిచి భోజనమునకు కూర్చుండును. కాని బాగుగ భోజనము చేయ-లేదు, అది చూచి విభ పెద్దనిట్టూర్పువిడిచి పండుకొనుటకు వెళ్లిపోవును—ఆమె విస్తరిదగ్గఱకు పోనైనపోదు.

విభ యేదో యొకటి మాట్లాడుచుండి అన్నమనస్సున నుండుభారమును కొంచెము తగ్గింపవలెనని మహాప్రయత్నము చేయుచుండును గాని మాటలాడ లేకుండును, ఉదయాదిత్యుని మనస్సునకు సుఖమునిచ్చుట నెట్లో తెలియక మాటిమాటికి "ఆహా, ఇట్టిసమయమున తాతయ్య లేఁడే!" అనుకొనుచుండును.

ఉదయాదిత్యునిలో నిప్పు డొకవిధమైన భయము పుట్టినది. అతఁడు ప్రతాపునికి జడియుచున్నాఁడు, మునుపటిసాహస మిప్పుడు లేదు. విపత్తును గడ్డిపరకతో సమానముగ నెంచి ప్రాణముల నిచ్చుటకైనను సిద్ధుఁడై దౌర్జన్యము నెదిరించుచు నిలువఁబడుశక్తి అతనిలో పూర్వముండెను. ఇప్పు డది పోయి-నది. ఏపనిచేయఁబోయినను సంకోచించుచుండును, తడబడు-చుండును.

ఆసమీపమునను్న 'ఛాప్రా' జమీందారుగారి కచే-రీలకు రాత్రివేళ బాణాకఱ్ఱలతో మనుష్యులను పంపి కచేరీలు లూటీచేసి ఇండ్లకు నిప్పు ముట్టించి రమ్మని ప్రతాపాదిత్యుఁడు తనమనుష్యులను పిలిపించి చెప్పుచుండగా ఉదయాదిత్యుఁ

డొకనాఁడు వినెను. యువరాజు తనగుఱ్ఱమును తయారుగా నుంచుమని యాజ్ఞాపించి, బట్టలువేసికొనుట కంతఃపురము లోనికి వెళ్లెను. పడకగదిలోనికిపోయి ఏదో యాలోచించుచు నాలుగువైపులను చూచుచు నిలుచుండెను. పరధ్యానముతో నిటునటుపోవుచు దుస్తులు మార్చుకొని బయటికివచ్చెను. భృత్యుఁడు వచ్చి, "గుఱ్ఱము తయారుగానున్నది మహాప్రభూ, ఎక్కడికి పోవలసియున్నది?" అని యడిగెను. యువరాజు పరధ్యానముగా వానివైపు కొంతసేపుచూచి చివరకు, "ఎక్కడకును పోనవసరములేదు, నీవు గుఱ్ఱము తీసికొనిపొమ్ము," అనెను.

ఒకనాఁ డెవఁడో యేడ్చుచున్నట్టు వినఁబడి యువరాజు బయటికి వచ్చి చూచెను, రాజుగారి భటుఁ డొకఁ డెవనినో చెట్టున కట్టి కొట్టుచుండెను. పాప మామనుష్యుఁడు యువరాజు వైపుచూచి "రక్షింపుము మహాప్రభూ!" అని యేడ్చుచు ప్రార్థించెను. యువరాజు వానిబాధ చూడలేక ఇంటిలోనికి పాఱిపోయెను. పూర్వ మెన్నడును ఇట్లు చేయగలవాఁడు కాఁడు! నౌకరుపై తిరగఁబడి ఆమనుష్యుని విడిపించియుండును.

భాగవతుసీతారాములజీతములు నిలచిపోయినవి. రహస్యముగగాని బహిరంగముగగాని యువరాజు వాండ్రకు సహాయముచేయ సాహసింపలేదు. వాండ్రు చిక్కులలో నున్నారని వినఁగానే తక్షణము వాండ్రకేమైన పంపవలెనని యను-

కొనునుగాని పరక్షణమే భయము పుట్టును, పంపుట మఱి జరుగదు.

తనప్రాణమున కెట్టియాపదవచ్చునో యనుభయము ఉదయాదిత్యుని ప్రవర్తనమునకు కారణమని ఎవ్వరును అనుకొనఁగూడదు. మునుపటికంటె ప్రాణముపై నతనికి అధికాసక్తిగలిగినదనుట నిజము కాదు ఉదయునిలో నంధ భయ మొకటి పుట్టినది. ఏమియు బోధపడనిభయము మనస్సున దూరిన మన కెట్లుండునో అట్లుండెను యువరాజునకు. ప్రతాపాదిత్యుఁడే ఆబోధపడనిభయము. తనయదృష్టము, తనభవిష్య జ్జీవనములోని ప్రతిదినము, ప్రతిక్షణముగూడ ప్రతాపాదిత్యుని పిడికిలిలో నున్నదని ఉదయునకు తోఁచుచుండెను. ఉదయాదిత్యునిజీవితములో చివరక్షణము సమీపించి అతఁడు మృత్యువు నాలింగనముచేయుటకు సిద్ధపడుచున్నను, ప్రతాపుఁడు కండ్లు చిట్లించి యాజ్ఞాపించినయెడల ఉదయుఁడు వెనుకకు తిరుగవలసివచ్చును.



## ఇరువది యొకటవ పరిచ్ఛేదము

రుక్మిణి, అనఁగా మంగళయొద్ద కొంత నగదుండెను ఆరూపాయలు వడ్డీకిచ్చి దానితో నామె కాలక్షేపము చేయు-చుండెను. రూపు, రూపాయలు — ఈ రెండిటిబలమువలన ననేకులను వశపఱచుకొనియుండెను సీతారాముఁడు కులాసా-పురుషుఁడు, కాని ఇంటిలో నొక్కదమ్మిడియైనను లేదు కనుక రుక్మిణిరూపును రూపాయలును వీని నాకర్షింప మొదలుపెట్టి-నవి. ప్రాయ్యిలో నిప్పుండదు, గాని సీతారాముఁడు పలుచని కండువా వేసికొని, కఱ్ఱ చేతిలో పట్టుకొని ఛాతీవిఱుచుకొని రోడ్డుమీద కనబడువాఁడు, — రుక్మిణి యింటికి పోవుటకు బయలుదేఱియుండవచ్చును. ఎటువంటిచింతయు, ముఖమున కానరాదు, "క్షేమమా సీతారామ్, రోజులేలాగు గడచు-చున్నవి?" అని ఎవరైన నడిగినచో అత్యుల్లాసముతో, "హాయిగా నున్నాను, రేపు మాయింటవిందు నీవు రావలెను?" అనును. సీతారామునిమాటలు మునుపటికంటె దీనములైనవి కాలేదు, పైగా అతనిస్థితి తగ్గుచున్నకొలఁది మాటలపరి-మాణము అధికమగుచుండెను. సీతారామునకు చాల పాడు-రోజులు వచ్చినవి. అతనిమామ, అనగా మేనత్తమగఁడు, తన ఆనరరీ మామ పదవిని విడిచిపెట్టి తనఊరునకు పోవలెనని నిశ్చయించుకొనెను.

అవస్థ మఱింత పాడై సీతారాముఁడు రుక్మిణియింటికి వచ్చెను. వచ్చి యామె చెవిదగ్గర ముఖము పెట్టి పద్య మొకటి చదివెను. ఆపద్యమువలన, తనకు కావలసినది బంగారు వెండి కాదు ప్రేమ యని తాత్పర్యమగును. కనుక ప్రస్తుతసందర్భమున కది కుదురలేదని కనిపెట్టి, "లేదమ్మా, పద్యము కుదిరినదికాదు, ప్రేమకాదు నా కిప్పుడంతగా కావలసినది, అది కావలసినప్పుడు తెలియఁజేసెదను గాని, తత్క్షణము కొన్నిరూపాయలుండినగాని కథనడవదు," అని యన్నాఁడు.

"నీకు రూపాయ లవసరమున్నప్పుడు నీకీయక మఱియెవరి కిత్తును?" అని అతిప్రేమతో అన్నది రుక్మిణి

సీతారాముఁడు—"అబ్బే అంత యవసరమని కాదు నేననునది. కాని జరిగినదేమన,—నారూపాయలన్నియు మాఅమ్మయొద్ద నుంచుచుందును, నాయొద్ద నేమియు నుంచుకొనను; నేఁడుదయమే లేచి మాయమ్మ జోడాఘాటునకు, తన అల్లునియింటికి వెల్లిపోయినది; ఖర్చునకు రూపాయలు ఉంచుట మఱచినది, తేపే అప్పు తీర్చివేసెదను."

మంగళ తనలో తాను నవ్వుకొనుచు నిట్లన్నది, "అంత త్వరగా నిచ్చుటేల, నీకు వీలైనప్పు డీయవచ్చును. రూపాయలు నీచేతి కిచ్చుచున్నానుగాని ఏ యేటిలోనో చెఱువులోనో పారవేయలేదే?" కాని అట్లు పారవేసినయెడల ఒకప్పుడు మళ్లీ దొఱకవచ్చును, ఇతని కిచ్చినయెడల ఆరూపాయ లెన్నటికి తిరిగిరావు—ఇది రెండిటికిని భేదము.

ప్రేమసూచకమగు నీభావము మంగళమాటలలో వ్యక్తమైనతోడనే సీతారామునిలో ప్రేమ పొంగి పొరల నారంభించినది. ఆతఁడు కొంతరసికత కనఁబఱచవలెనని ప్రయత్నించెను. చేతిలో దమ్మిడి లేకుండ నబాబ్‌గిరీ చేయుటయు, హాస్యరసము రవంతయైనను లేకుండ రసికత కనపరచుటయు సీతారామునికి స్వభావసిద్ధములే. నోటికివచ్చినదెల్ల పలుకుచుండును సీతారాముఁడు, పై వారు నవ్వినను నవ్వకపోయినను తానుమాత్రము నవ్వుచుండును—అతని నవ్వును చూచి నలుగురును నవ్వుదురు. వీఁడు రాజుగారియింట నౌకరుగా నున్నప్పుడు ఇతనికి తక్కిన నౌకర్లకు తఱచుగా పోట్లాట జరుగుచుండెను— సీతారాముఁడు హాస్యములనుకొనునవి యితరులకు హాస్యములు కావు—ఆపోట్లాటలకు ముఖ్యకారణ మిదియే! ఒకనాఁటిరాత్రి హనుమాన్‌ప్రసాద్ తేవారి యను నొక రౌకఁడు పహారా ఇచ్చుచు నిద్రవలన జోగుచుండెను. సీతారాముఁడు మెల్లఁగ వెనుకనుండివచ్చి అతనివీఁపుమీఁద గట్టిగా నొకగ్రుద్దుగ్రుద్ది బిగ్గరగ నవ్వ నారంభించెను. తేవారిమాత్రము నవ్వలేదు. అతనికి వీఁపునవేకాక లోపునకూడ మంటపుట్టి గ్రుద్దునకు హాస్యరసమునకుఁగల సంబంధమునకంటె గ్రుద్దుకు దుఃఖరసముతో దగ్గఱసంబంధమున్నదని ఉదాహరణపూర్వకముగ చూపించెను. సీతారామునిరసికత తెలియఁజేయుపనులు ఇట్టివి లెక్కలేనన్ని యున్నవి.

సీతారాముఁ డిప్పుడు ప్రేమపరవశుఁడై రుక్మిణి కతి

సమీపముగ వచ్చి "నీవు నాసుభద్రవు, నేను నీజగన్నాథుఁడను," అనెను.

"పశువా అటుపొమ్ము, సుభద్ర జగన్నాథునిచెల్లెలు." అన్నది.

సీతారాముఁడు "అది ఎట్లు కాఁగలదు? అట్లైన సుభద్రాహారణమున కర్థమేమి?"

రుక్మిణి పకపక నవ్వనారంభించెను. సీతారాముఁడు ఛాతీ విరుచుకొని "అట్లనవ్వినంతమాత్రమున నేనొప్పుకొనను, సుభద్ర చెల్లెలైనయెడల 'సుభద్రాహారణ' మెట్లు కాఁగలదో అది నాకు బోధపఱచుము" అనెను.

తానిట్టియుక్తి ప్రయోగించినతరువాత ఎవ్వరును మఱి మాటాడలేరని సీతారాముని నమకము.

"ఛీ మూర్ఖుఁడా!" అన్నది రుక్మిణి అతిమధురస్వరముతో.

సీతారాముఁడు—"ఔను నేను మూర్ఖుఁడనే సందేహమేమి? నీవు నన్నెల్లప్పుడును వీఁగఁగొట్టుచునే యున్నావు, నేను నీకడ నతిమూర్ఖుఁడను." అట్లని ఆమెకు తగినజబాబిచ్చితినని సీతారాముఁడు తనలోఁదాను మహాసంతోషించెను, ఈనాఁడు సంభాషణ మంచితమాషాగా జరుగుచున్న దనుకొనుచుండెను.

సీతారాముఁడు మరలప్రారంభించుచున్నాఁడు—"సరే, నేనన్నది నీకు బాగుగలేదు గనుక ఆప్రసంగము విడుచుచు-

న్నాను నిన్నేమని పిలువుమనెదవో చెప్పుము, ఏమని పిలిచిన నీకు సంతోషము కలుగును?"

రుక్మిణి నవ్వుచు "రాణీ యనుము."

సీతారాముఁడు "రాణీ!"

రుక్మిణి—"ప్రేయసీ యనుము,"

సీతారాముఁడు—"ప్రేయసీ!"

రుక్మిణి—"ప్రాణేశ్వరీ యనుము."

సీతారాముఁడు—"ప్రాణేశ్వరీ!"

"అట్లైన ప్రాణేశ్వరీ నీవు నాకు బదులిచ్చినరూపాయల కెంతవడ్డీ పుచ్చుకొనెదవు?"

రుక్మిణిముఖము చిట్లించుకొనుచు "పొమ్ము,అటుపొమ్ము! ఇదియే కాఁబోలును నీప్రేమ! ఏముఖముతో వడ్డీమాట యడుగుచున్నావు?" అనెను.

సీతారాముఁ డానందముతో పొంగిపోవుచు "ఛీ ఛీ నేనెప్పుడైన నట్టిదనఁగలను! నేను హాస్యమాడితిని. ఆమాత్రము పోల్చుకొనలేకపోతివే! ఛీ ప్రాణేశ్వరీ ఇటురమ్ము!" అనెను.

సీతారామునితల్లి కేరోగమువచ్చినదో తెలియదుగాని ఇటీవల మాటిమాటికి అల్లునియింటికి పోవుచున్నది, పోవునప్పుడు ఇంటిఖర్చులకు డబ్బిచ్చి పోవలెనన్నమాట ఆమెకు జ్ఞప్తికిరాకున్నది. కనుక సీతారాముఁడు తఱచుగా రుక్మిణి-

యొద్దకు రావలసివచ్చుచున్నది. ఈనడుమ సీతారాముఁడును రుక్మిణియు కలసి రహస్యముగ నేదో యాలోచనచేయుచుండిరి. ఇట్లనేకదినములు గడచినవి, చివరకొకనాఁడు సీతారామునినోటివెంబడి యీమాటలు బయటకు వచ్చినవి—"అంతపని నాచేత కాదమ్మా, భాగవతునిసహాయము లేనిదే నే నాపని చేయలేను."

ఆనాటిసాయంకాలము తుపాను ప్రారంభమైనది. రాజుగారికోటలో నాలుగువైపులను తలుపులు ధూబ్ ధాబ్ మని కొట్టుకొనుచున్నవి. గాలి అతి భయంకరముగ వీచుచుండెను, తోటలోని పెద్దపెద్దచెట్టు కొమ్మలుకూడ ఊగి భూమికి తగులుచున్నవి. ఏటివఱదలకు కొట్టుకొనిపోవుచున్న గ్రామములవలె మేఘములు తుపానుగాలిలో కొట్టుకొనిపోవుచున్నవి. ఆకాశము మేఘగర్జనములతోను మెఱపులతోను నిండియున్నది. నాలుగుతలుపులును బిడాయించుకొని గదిలో కూర్చుండియున్నాఁడు ఉదయాదిత్యుఁడు. అతనియొడిలో ఒకచిన్నబాలికయున్నది. దీపమారి గది చిట్టచీఁకటిగా ఉదయునియొడిలోనిపిల్ల నిద్రపోవుచున్నది. సురమకీపిల్లయెడల చాలముద్దు. సురమ మృతినొందినప్పటినుండి తల్లి యీపిల్ల నీయింటికి పంపుటలేదు. బాలిక ఇన్నిదినములకు నేఁడు కోటలోనికివచ్చినది. ఉదయుఁడు హఠాత్తుగా నామె కంటఁబడగానే 'బాబా, బాబా' అని కేకలువేయుచువచ్చి ఆతనికాళ్లను కౌఁగిలించుకొనినది. ఉదయుఁ డామెనెత్తుకొని గట్టిగా కౌఁగిలించు-

కొని తనపడకగదిలోనికి తీసికొనివచ్చెను, ఉదయునిమనస్సున నొకవిధమగు భ్రమ పుట్టుచున్నట్లుండెను. "సురమ కీబిడ్డయెడల మహాప్రేమ, ఈమెను చూచుట కొకసారి వచ్చునేమో! అంతముద్దు చేయుచుండెనుగదా, ఆమెను చూచుట కొకసారి రాకుండ నెట్లు నుండఁగలదో సురమ?" "బాబా కక్కీ యేదీ?" అని పిల్ల ఒకమా అడిగినది.

"కక్కీనొకమాఱు పిలువుమమ్మా!" అని యుదయుఁడనెను. అతనికంఠములోనుండి మాట సరిగ రాలేదు. పిల్ల "కక్కీ, కక్కీ" అని పిలిచినది. 'అదిగో ఎవరో జేబాబు ఇచ్చుచున్నా' రనిపించినది ఉదయునకు; 'వచ్చుచున్నానమ్మా ఇదిగో నే!' అనుచున్న ట్లతనికి తోఁచినది. 'ఆముద్దుబిడ్డ పిలుపువిని ఎట్లు రాకుండ నుండగల దాప్రేమపూరితమైన హృదయము? వచ్చి యాబిడ్డను కౌఁగిలించుకొననిదే యుండలేదుపాపము' అని ఉదయాదిత్యుఁ డనుకొనుచుండెను. ఇంతలో పిల్ల అతనిఒడిలో నిద్రపోయినది. ఉదయుఁడు గదిలోనిదీపమూర్పి ఆచీఁకటిలో నిద్రించుచున్న ఆపిల్లను ఒడిలోపెట్టుకొని ఒంటరిగా కూర్చుండెను. అవతల హోరుమని తుపానుశబ్దము; అక్కడక్కడ టకటకమని శబ్దమగుచున్నది—"అది యడుగులచప్పుడు కాదా? అడుగులచప్పుడే సందేహము లేదు." కాని లోపుననుండి గుండె దబ్బుదబ్బుమని కొట్టుకొనుచున్నది, ఆయడుగులచప్పుడు విననీయకుండ నున్నదే! "అంతలో తలుపులు చటాలున విడి లోపున దీపము వెలుతురు వడినది"— నిజమే!

అట్టిది, నిజముగా జరుగఁగలదా" దీపము చేతఁబుచ్చుకొని స్త్రీవిగ్రహ మొకటి లోనికి వచ్చుచున్నది—ఉదయునికండ్లుమూసికొనిపోయనవి—"ఎవరది సురమయేనా?" అనుమాటలతనినోటనుండి వచ్చినవి. "కండ్లు విప్పిచూచిన సురమ వెళ్లిపోవునా! సురమ కాదేమో!"

ఆరమణి దీపము క్రిందనుంచి, "ఏమయ్యా, నేను మఱి మీకు జ్ఞప్తికిరానేమో?" అన్నది.

ఆమాటలు పిడుగువలె వినఁబడి ఉదయాదిత్యుఁ డులికిపడి కండ్లు విప్పిచూచెను ఒడిలోనిపిల్ల లేచి భయపడుచు 'బాబా' 'బాబా' అని యేడ్వసాగెను. ఆబిడ్డను పఱుపుపై పరుండబెట్టి ఉదయాదిత్యుఁడు లేచి నిలుచుండెను. ఏమిచేయవలెనో ఎచ్చటికి పోవలెనో ఎంత ఆలోచించినను తట్టుపట్లు చూచుచుండెను. రుక్మిణి మఱికొంచెము దగ్గరకు వచ్చి తలయాడించుచు "ఔనౌను, నేనెఱుఁగుదును! ఇప్పుడు జ్ఞప్తికే రాను! అట్లైన ఆశపెట్టి ఒకప్పుడు నన్నాకాశముపై కేలనెత్తవలెను?" అనెను. నోటమాటలేక ఉదయాదిత్యుఁ డూరక నిలిచియుండెను.

అప్పుడు రుక్మిణి తనయొద్దనుండు బ్రహ్మాస్త్రము బయటికితీసి ఏడ్చుచు, "నేనేమి యపరాధము చేసితిని నాముఖము నీవు చూడలేకుండుటకు? నాకొంపముంచినది నీవే! యువరాజునకు తనదేహమును ప్రాణమును ఈయఁగలదానిగతి నేఁడేమైనది? ముష్టిదానివలె ఇచ్చట నచ్చట తిరుగుచున్నది. భగవంతుఁడు దాని నొసట వ్రాసినదింతేనా?" అని యన్నది.

ఈ దెబ్బ ఉదయాదిత్యునకు తగిలినది, ఆమె దురవస్థకు తానే కారణ మైయుండవచ్చునా యని అప్పు డతఁడనుకొనుట మొదలుపెట్టెను. పూర్వమెన్నఁడో జరిగిన వృత్తాంత మతఁడు పూర్తిగ మఱచిపోయెను. యౌవనమున నతఁడు ప్రమత్తావస్థలో నున్నపు డతనిచుట్టు నామె మాయాజాలమునన్ని, మాటిమాటికి నతనియెదుటకు వచ్చి అతనిమనస్సు నాకర్షింప ప్రయత్నించినది, సుడిలో చిక్కుకొనినవానివలెఁ నత డామె చేతులలోఁ దగుల్కొనెను; సుడివలె నామె యతనిని ఒక్క-నిమిషములో పాతాళములోని కీడ్చుకొనిపోయి అచ్చట నుండు నంధకారమునఁ గూర్చుండఁబెట్టినది—యువరా జిది యంతయు పూర్తిగా మఱచిపోయెను. కళ్లువిప్పి చూచుసరికి రుక్మిణి చింకి ముఱికిగుడ్డయొకటి కట్టుకొని ఏడ్చుచు నెదుట నిలుచుండియున్నది. మనస్సు కరిగి యువరాజు "ఏమి నీవు కోరునది?" అని యామె నడిగెను.

రుక్మిణి—"నేను కోరునది నీయనురాగము—నాకు మఱియేమియు నవసరములేదు. నీ వా కిటికీలో గూర్చుండి యున్నప్పుడు నేను నీకౌఁగిటిలో నుండవలెనని నాకోరిక, నీగుండెపై ముఖముపెట్టుకొని నిన్ను నా రెండుచేతులతో పట్టుకొని కూర్చుండియుండవలెనని నేనుకోరునది—సురమ ముఖముకంటె ఈముఖము నలుపని యూహించుచున్నావా? నలుపే యైనచో, నీవే దానికి కారణము-రాంత్రింబగళ్లు నేను తిరుగుచుండుట నీకొఱకేకదా, నాముఖమున మును పీనలుపు లేదే!"

ఇట్లనుచు రుక్మిణి ఉదయాదిత్యుని పఱుపుపై గూర్చుండఁ బోయెను. ఉదయుఁడు మఱి యూరకుండలేక, "ఆపఱుపుపై కూర్చుండకుము, కూర్చుండకుము" అని గద్గదస్వరముతో ననెను.

దెబ్బతగిలినపామువలె భుస్సుమని తలయెత్తి "ఏల కూర్చుండఁగూడదు?" అని రుక్మిణి యడిగెను.

ఉదయాదిత్యుఁడామె కడ్డువచ్చి, "వద్దు నీవీ ప్రక్కమీఁద కూర్చుండవద్దు నీకేమి కావలెనో చెప్పుము, అది నీ కీ-క్షణమే యిచ్చెదను," అనెను.

"అట్లైన నీవ్రేలునకున్నయుంగరము నా కిమ్ము,"

ఉదయాదిత్యుఁడు తత్క్షణమే వ్రేలినుండి ఉంగరముతీసి ఆమెమీఁద పాఱవైచెను. రుక్మిణి దానిని పట్టుకొని యక్షణమే బయటికి పోయెను. "నామంత్ర మిప్పటికిని పాలుచున్నది, మఱి-కొంతకాల మిట్లు గడవనిచ్చిన మంత్రము ఫలించును," అని-యనుకొనుచు రుక్మిణి యింటికి పోయినది. ఉదయాదిత్యుఁడు పఱుపుపైపడి, "సురమ యేదీ నాసురమ? నాహృదయము దగ్ధ-మయిపోవుచున్నది. ఎవరిప్పుడు దానికి శాంతినీయఁగలరు?" అనుచు చేతులపై ముఖమునుంచి యేడ్వసాగెను.

---

## ఇరువది రెండవ పరిచ్ఛేదము.

భాగవతునిరోజులుకూడ బాగుగలేవు. కొద్దిదినముల నుండి ఏమియు మాటలాడక యొకచోట నూరక కూర్చుండి గుడుగుడు పీల్చుచున్నాఁడు. భాగవతుఁడు తదేకధ్యాన-ముగా గుడుగుడుపీల్చుట మొదలుపెట్టఁగానే ఇరుగుపొరు-గులవారికి భయము పుట్టుచుండును. అతని నోటినుండి నల్లని-పొగ ఎప్పుడు చుట్టలుచుట్టలుగ లేచుచుండునో అప్పుడే అతని మనస్సులోనుండు కార్ఖానాలోకూడ పని ప్రారంభ మగుచున్నదని అందఱు నెఱుఁగుదురు. కాని భాగవతుఁడు మహాధర్మనిష్ఠగలవాఁడు. అతఁ డెవరితోను అంతగా కలియు-వాఁడు కాఁడు—ఇదియే అతని కుండుదుర్గుణము—ఎవరితోను అంతగా మాటలాడఁడు, ఎల్లప్పుడును జపతావళము త్రిప్పు-కొనుచు కూర్చుండును, ఒకరిసంగతులలో దూరఁడు. కాని గొప్పచిక్కులో తగులుకొనినవారికిమాత్రము భాగవతుని-వలె సలహాయీయఁగలవాఁ డింకొకఁ డుండఁడు. కోరి ఎవ్వ-రికిని యపకారము చేయువాఁడు కాఁడు భాగవతుఁడు, తన కపకారముచేయువానిని ఈజన్మములలో మఱవఁడు—వాని-పై పగతీర్చుకొననిదే హుక్కాగొట్టమును నోటినుండి క్రిందికి దిగనీయఁడు. భాగవతుఁ డెట్టివాఁడో ఒక్కమాటలో చెప్ప-మనిన మంచివాఁడనియే చెప్పవలసియుండును— ఇట్టివారినే

లోకములో మంచివారందుము. గ్రామస్థులందఱును భాగవతుని మన్నించువారు. రోజులు మంచివికాక భాగవతుఁడొక మూ అప్పుచేసెను, కాని బిందె చెంబు అమ్మి అప్పుతీర్చివేసెను.

ఒకనాఁ డుదయము సీతారాముఁడు భాగవతునిదగ్గఱకు వచ్చి "అంతా క్షేమమా అన్నా?" అని అడిగెను.

"ఏమి క్షేమము!" అన్నాఁడు భాగవతుఁడు.

"ఆలా గనుచున్నా వేమన్నా?"

భాగవతుఁడు కొంతసేపు హుక్కా జోరుగా పీల్చి, చివరకు గొట్టము సీతారామునికిచ్చుచు "గడచుట బహుకష్టముగా నున్నది, రోజులు బాగుగ లేవు" అన్నాఁడు.

సీతారాముఁడు—"నిజముగా! అది యెట్లు సంభవించినది?"

భాగవతునకు లోలోపున కొంచెము కోపమువచ్చి "ఎట్లనుచున్నావా? అది నీకుకూడ బోధపఱచవలెనా? నీవుకూడ నాయవస్థలోనే నున్నావని నే ననుకొనుచుంటినే" అన్నాఁడు.

సీతారాముఁడు కొంచెము తెల్లఁబోయి, "అది కాదన్నా నేనన్నది," అని దిద్దుకొనుచు, "అప్పుచేసితివి కావేలనని నే నడుగుచుంటిని," అనెను.

భాగవతుఁడు—"అప్పుచేసినయెడల తీర్చవలెనుకదా! అమ్మివేయుటకుగాని తాకట్టుపెట్టుటకుగాని వస్తువులుకూడ నంతగా లేనప్పుడు అప్పుతీర్చుట ఎట్లు?"

"నీకెంత అప్పు కావలెనో చెప్పుము నేనిచ్చెదను," అని సీతారాముఁడు దర్జాగా ననెను.

"నిజమే ? ఒకపిడికెడురూపాయలలో వచ్చునదేమి పోవునదేమి యనునవస్థలో నున్నట్లున్నావే ! నామీఁద నొకపదిరూపాయలు పాఱవేయుమట్లైన—కాని మొదటనే చెప్పుచున్నాను, అప్పుతీర్పుశక్తిమాత్రము నాకు లేదు!"

సీతారాముఁడు—"తీర్పుటవిషయమై నీ వాలోచింపనక్కఱలేదు."

సీతారాముని ప్రేమచూచి భాగవతునిమనస్సున సంతోషముపుట్టినదనుకొనలేము. హుక్కాలో మఱికొంచెము గుడాకువేసి భాగవతుఁడు, గుడుగుడు పీల్ప నారంభించెను.

సీతారాముఁడు మెల్లమెల్లగ ప్రసంగము మొదలుపెట్టెను—"రాజుగారు మన కన్యాయముచేసి మనయన్నము పడఁగొట్టిరి," అన్నాఁడు.

"ఏదీ నీధోరణిబట్టి అట్లు కనఁబడదే!" అన్నాఁడు భాగవతుఁడు; సీతారాముని దర్జాసహించుట యతనికి కష్టముగా నున్నది, లోలోపున కోపము పుట్టుచున్నది.

సీతారాముఁడు—"నేనేదో మాటవరుస కనినంతమాత్రాన నీవట్లచున్నావేమి అన్నా? ఇప్పటి కేలాగునవో గడచుచున్నను మఱి పదిరోజులైన తరువాత కష్టము రాకమానదు కదా!"

భాగవతుఁడు—"రాజుగా రన్యాయము చేసినప్పుడు మనమేమి చేయఁగలము!"

సీతారాముఁడు—"యువరాజునకు రాజ్యము వచ్చినప్పుడు యశ్శోర్వరులో రామరాజ్యము ప్రారంభమగును—ఆహా అంతవఱకు మనము బ్రతికియుండఁగలిగిన మనకేమియు లోటుండదుకదా!"

భాగవతునకు కోపమువచ్చి అన్నాఁడు—"అట్టిమాటలతో మాకేమి పని బాబూ? నీవు పెద్దవాఁడవు ఇంటిలో కూర్చుండి రాజులను వజీరులను చంపుచుందువు పుట్టించుచుందువు—అపని నీవంటివానికి శోభించును, నేను నిరుపేదను నా కంతసాహసము లేదు!"

"కోపమేల యన్నా, నే ననునది మనస్సిచ్చి విననైనను వినవే!" ఇట్లనుచు సీతారాముఁడు భాగవతునికి దగ్గఱగ వచ్చి, చెవిలో నేదో చెప్పనారంభించెను.

భాగవతునకు మహాకోపమువచ్చి "నాదగ్గఱ నటువంటిమాటలు నోటివెంబడి రానీయకుము, నీతో స్పష్టముగా చెప్పుచున్నాను, ఎన్నటికిని మఱవకుము" అనెను.

సీతారాముఁ డానాఁడు మఱి భాగవతునికడ నుండలేదు. ఆనాఁడంతయు భాగవతుఁడు తదేకధ్యానముగ దేనినిగుఱించియో ఆలోచించుచు కూర్చుండెను. అనుఱునాటియుదయము తానే సీతారాముని యింటికి వచ్చి అతనితో, "నీవు నిన్నను చెప్పితివే—అది చాలబాగుగ నాలోచించి చెప్పినమాటవలె నున్నది," అనెను.

"నేను చెప్పలేదా!" అని మిగుల గర్వముతో సీతా-రాముఁ డనెను.

భాగవతుఁడు__"ఆవిషయమునుగుఱించి మాటలా-డుటకే ఇప్పు డిక్కడికి వచ్చినాను"

సీతా రామునిగర్వము కొంచె మధికమైనది. ఆనాటి-నుండి కొన్నిదినములవఱకు ప్రతిరోజు వారిద్దఱును కలసి రహస్యముగా మాటలాడుకొనుచుండిరి.

ఇన్ని రోజులును వారిద్దఱును కలసి యాలోచించి నిశ్చయించినది దొంగదరఖాస్తొకటి తయారుచేయవలెనని. ప్రతాపాదిత్యుఁడు చక్రవర్తిగారికి ద్రోహముచేయ ప్రయ-త్నించుచుండ ఉదయుఁ డది కనిపెట్టి చక్రవర్తికి తెలుపుచు-న్నట్లుండవలెనఁట యాదరఖాస్తు. అది నిజముగా యువరాజు-నొద్దనుండియే పోవుచున్నదరఖాస్తని నమ్మకము పుట్టించునటుల దానిపైని యువరాజు సీలుండవలెను; యువరాజుంగరము రుక్మిణి యొద్దనుండుటచేత సీలువేయుటకు తగినయుపాయ మామెచేతిలో నుండెను.

దొంగదరఖాస్తు యువరాజుగారిసీలుతో తయారైనది. తెలిసినమాలినసీతా రాముని కిట్టిపని ఒప్పఁజెప్పిన నపాయము కలుగవచ్చును. గాన భాగవతుఁడే దానిని తీసికొనిపోయి ఢిల్లీశ్వరునిచేతఁ బెట్టవలెనని నిశ్చయమైనది.

భాగవతుఁడు దానిని చేతఁబుచ్చుకొని ఢిల్లీవైపునకు పోవుటకు మాఱుగా ప్రతాపాదిత్యునియొద్దకు పోయెను.

పోయి "మహాప్రభూ యీదరఖాస్తు యువరాజుగారి నౌకరొ-కఁడు కొనిపోవుచుండ నేనెట్లో పోల్చుకొని వానియొద్దనుండి దానిని తీసికొంటిని, ఆనౌకరు దేశమువిడిచి పాఱిపోయెను, నే నాదరఖాస్తుపట్టుకొని మహారాజావారి సముఖమునకు వ-చ్చితిని." అనెను. భాగవతుఁడు సీతారాముని పేరెత్తలేదు, దరఖాస్తు చదివినపైని మహారాజావారి కెట్లుండెనో చెప్ప-నక్కఱలేదు. భాగవతునికి మరల రాజప్రాసాదమున పని దొరకినది.



# ఇరువది మూఁడవ పరిచ్ఛేదము

విభజీవితమున నంధకార మాక్రమించుకొని వచ్చు-చున్నది. గుండెలు బ్రద్దలు చేయునంత దుఃఖమును, నిరాశయు తనకొఱకె కనిపెట్టుకొనియుండి ప్రతిక్షణమును దగ్గఱకు వచ్చుచున్న ట్లనిపించుచున్నది విభకు, తనకిక నెట్టిసుఖము నుండదనుభయము పుట్టుచున్నది. కనఁబడుదానినెల్లను మ్రింగుచు జీవమును శూన్యముచేయుచుండు అపారదురదృష్ట మొకటివచ్చి తనమీఁద పడఁబోవుచున్నట్లున్నది,—దానిఛాయయే వచ్చి విభప్రాణములో పడినట్లుండి, ఆమెను చెప్పనలవికాని దుఃఖమువచ్చుచున్నది. ఒంటరిగా మంచముపైపరుండి-యున్నది విభ, దగ్గఱ నెవ్వరును లేరు, నిట్టూర్పులు విడిచి విడిచి చివరకు యేడ్చుచు, "అక్కైన నన్ను విడిచిపెట్టితివా, నేనేమి యపరాధముచేసితిని?" అనుచుండెను; వెక్కి-వెక్కి యేడ్చుచు ఉండియుండి "నేనేమి యపరాధముచేసితిని?" అనుచుండెను. తలగడ గుండెపై వేసికొని, రెండుచేతులను ముఖముపైనుంచి ఏడ్చుచు మాటిమాటికి, "నేనేమి యపరాధముచేసితిని?" అనుచుండెను. "ఒక్కఉత్తరమైనను లేదు, మనుష్యునినైనను పంపలేదు, సమాచారము చెప్పువా రెవ్వరును లేరు ! నేనేమి చేయఁగలను ! గుండె బ్రద్దలైపోవుచున్నది, ఇక్కడినుండి యక్కడికి అక్కడినుండి యిక్కడికి రోజంతయు నేడ్చుచు

తిరుగుచున్నాను, ఎవ్వరును నీసంగతి నాతో చెప్పరు, నీపేరు ఎవరినోటను వినరాదు. ఎంతకాల మిట్లుండఁగలనే అమ్మా నేనేమి చేయఁగలను?" అని యేడ్చుచుండును. ఇట్లెన్నో రోజులు గడచినవి,—ఎన్నో ఉదయములు, ఎన్నో సాయంకాలములు, ఎన్నో రాత్రులు ఆ రాజప్రాసాదమున సంగహీనురాలై, శూన్యమైయున్న ఆగదులలో ప్రొద్దుటమొదలు నిర్జీవియైన ఛాయవలె దినదినమును విభ తిరుగుచుండెను.

ఇట్లుండ నొకనాటిప్రాతఃకాలమున రామమోహనుఁడు వచ్చి, "అమ్మా జయము జయము!" అని ప్రణామముచేసి ఎదుట నిలుచుండెను సుఖమే ఒకపిడుగై తనపైపడఁబోవుచున్నదనునట్లు, విభ ఉలికిపడి "నీవేనా, మోహనా!" అన్నది—విభ కనులనుండి బొటబొట నీళ్లు కారుట మొదలుపెట్టినది.

"ఔనమ్మా నేనే చూచితిని—తల్లి మమ్ములను మఱచి పోయినది—ఆమె కొకసారి జ్ఞాపకము తేవలెననుకొని వచ్చితిని."

ఏమేమోసంగతు లెన్నియో యడుగవలె ననుకొన్నది విభ. కాని సిగ్గువలన నడుగలేకపోయినది; అడిగెద నడిగెద ననుకొనుచుండెను కాని అడుగలేదు; అక్కడిసంగతులు వినుటకు ప్రాణము కొట్టుకొనుచుండెను.

రామమోహనుఁడు విభముఖము చూచుచు, "నీముఖము వాడియున్న దేమమ్మా! నీముఖము మాడిపోయి నల్లనై-

పోయినదే! ముఖాన ఆనందములేదు, జుట్టు చింపిరిచింపిరి, రమ్మమ్మా మనయింటికి రమ్ము—ఇక్కడ నీకు సంరక్షణచేయువా రెవ్వరును లేరు," అని యనెను.

విభ తెచ్చుకొని కొంచెము నవ్వినది. ఏమియు మాటలాడ లేదు. ఎండిపోయిన చెక్కిళ్లపై కన్నీరు వఱదలై పారుట మొదలు పెట్టినది, విభ మఱి దాని నాపలేకపోయినది. అనేకదినము లాదరములేక పడియుండి హఠాత్తుగ నొకనాఁ డెవరైన మనలను ముద్దుచేయ వచ్చినచోఁ బట్టశక్యముకాని దుఃఖము ఆనందము మనలో పుట్టునుగదా? భక్తితోను ప్రీతితోను నిండియున్న రామమోహనునిమాటలు వినగానే విభ దుఃఖ మాపుకొనలేకపోయినది. "ఇన్నాళ్లైనతరువాత నేను జ్ఞప్తికి వచ్చితినా!" అని విభ తనలో తా ననుకొనినది.

రామమోహనుకూడ కండ్లనీరు పెట్టుకొని, "ఛా, ఛా, అదియేమమ్మా; నీవు మామహాలక్ష్మివి, నవ్వుముఖముతో నుమా-యింటికి రావలెనమ్మా. నేఁడు శుభదినము కనులు తుడుచుకొనుమమ్మా!" అనెను.

అల్లుఁడు కొమార్తెను తీసికొని వెళ్లఁడేమో యని రాణికి లోలోపల అతిభయముగ నుండెను. విభను తీసికొనివెళ్లుటకు రామమోహనుఁడు వచ్చెనని విని యామె మిక్కిలి సంతోషించినది. రాణి రామమోహనుని పిలిపించి దగ్గఱ కూర్చుండఁబెట్టుకొని అల్లునియింటి క్షేమసమాచారము లడిగినది, తానే దగ్గఱనుండి ఆనందముతో నతనికి విందుచేయించినది,

భోజనమైనతరువాత మోహానుచెప్పినవార్తలు వినుచు దిన మత్యుల్లాసముతో గడపినది. విభ వెళ్లుటకు మరునాఁడు మంచి రోజు, మరునాటియుదయమే బయలుదేఱుటకు నిశ్చయించిరి. ప్రయాణమునుగుఱించి ప్రతాపాదిత్యుఁడుకూడ నేవిధమగు నాటంకమును కలుగఁజేయలేదు.

ప్రయాణము స్థిరమైనతరువాత విభ యొకమాఱు అన్నయొద్దకు వెళ్లినది. ఉదయాదిత్యుఁ డొంటరిగా కూర్చుండి యేమో యాలోచించుచుండెను.

విభను చూచి ఉదయుఁ డులికిపడెను. తరువాత "విభా, అట్లైన నీవు వెళ్లెదవమ్మా? మంచిమాటే చెల్లీ! అక్కడికి వెళ్లిన నీవు సుఖముగ నుండఁగలవు" అనెను. "నన్నాశీర్వదింపనిమ్ము చెల్లీ!—నీ వొక మహాలక్ష్మివై భర్తయింటికి కాంతి నిచ్చుచుండుము!"

విభ ఉదయాదిత్యుని కాళ్లదగ్గఱ పడి యేడ్వ నారంభించినది. ఉదయుని కనులనుండికూడ బొటబొట నీళ్లు కారుచున్నవి. చెల్లెలితలమీఁద చేయివేసి "ఏడ్పేలనమ్మా" అని ఉదయుఁడు "చెల్లీ!" అనెను. "నీ కిక్కడ నేమున్నది విభా! ఎటుచూచినను దుఃఖము, కష్టము, శోకము ఈ[illegible]దునుండి బయటకు వెళ్లఁగలిగిన బ్రతుకుదువు చెల్లీ!"

విభ లేవఁగానే ఉదయాదిత్యుఁడు మరల నిట్లనెను. "వెళ్లుచున్నావు చెల్లీ! మంచిది వెళ్లుమమ్మా! అత్తవారియింటికి వెళ్లి మమ్ములను కేవలము మఱచిపోకుము, జ్ఞాపకముంచుకొని

అప్పుడప్పుడు క్షేమసమాచారములు తెలుపుచుండుము చెల్లీ."

విభ రామమోహనునొద్దకు వచ్చి తా నిప్పుడు రాలేనని చెప్పినది.

"అదేమమ్మా?" అని యాశ్చర్యపడుచు రామమోహనుఁ డడిగెను.

"నే నిప్పుడు రాలేను, అన్నయ్య నొంటరిగ నిచ్చట వదలిపెట్టి నేను రాలేను. నాదుఃఖముకంటె అధిక మన్నయ్య దుఃఖము నాకష్టముకంటె అతనిదధికము. అన్నయ్య నొక్కనినే ఇక్కడ నుంచివేసి సుఖమనుభవించుటకు నేను పోఁగలనా? రవంతయైనను దుఃఖ మన్నయ్యమనస్సులో నున్నంతకాలము నే నతనిని విడిచిపెట్టను, నావలె నతనికి సంరక్షణచేయువా రెవరు మోహనా?" ఇట్లనుచు విభ ఏడ్చుచు లోనికి పోయినది.

అంతఃపురమున గోలపుట్టినది. రాణివచ్చి కోపగించినది, చీవాట్లుపెట్టినది, భయపెట్టినది, సలహాయిచ్చినది. విభ యొంతమాత్రము వినలేదు—"లేదమ్మా నేను వెళ్లలేను," అని మాటిమాటికి ననుచుండెను.

రాణికి విసుగుపుట్టినది, కోపము వచ్చినది. ఏడ్చుచు రాజుగారితో వెళ్లి జరిగినదంతయు చెప్పినది. రాజుగా రంతయు విని, "దాను బాగుగనే యున్నది, ఇష్టము లేనప్పుడామె యేల పోవలెను?" అని అతిశాంతముగ ననిరి.

రాణి నిశ్చేష్టురాలాయెను చుక్కాను వదలి చేతులు త్రిప్పుకొనుచు, "మీయిష్టమువచ్చినట్లు చేసికొనుడు నాయనా, నాప్రాపు దీనిలో నేమియు లేదు," అనుచు బయటికి పోయినది.

ఉదయాదిత్యుం డివియంతయు విని ఆశ్చర్యముపొంది, విభకడకు వచ్చి ఎంతో బోధపఱచెను. విభ బోధపఱచుకొన-లేదు, మాటాడక కూర్చుండి యేడ్చుచుండెను

రామమోహనునిముఖము వాడిపోయినది, "అట్లైన నేను పోయెదనమ్మా, రాజుగారితో నేమని చెప్పుమనెదవు? అని నిరాశతో నడిగెను.

విభ యేమియు నుత్తరమీయక చాలసే పూరక కూర్చుండెను.

మోహనుఁడు "నాకు సెలవీయుము తల్లీ," అనుచు ప్రణామము చేసి లేచి వెళ్లుచుండెను. విభ కట్టలేనియేడ్పు నేడ్చుచు "మోహనా" అని పిలిచినది.

మోహనుఁడు "ఏమమ్మా" అనుచు తిరిగి వచ్చెను.

విభ—"క్షమింపుమని మహారాజుగారితో చెప్పుము. వారు కబురుపంపినప్పుడుకూడ నేను రాలేకపోవుట కేవలము నాదురదృష్టము తప్ప ఇంకొకటి కాదు."

రామమోహనుని ముఖమున నెత్తురులేదు, "చిత్తము" అనుచు మరల సెలవుపుచ్చుకొని పోయెను. రామమోహ-నుఁడు విభమాటలను బోధపఱచుకొనలేదు, అది చూచి విభ

మిక్కిలి దుఃఖించినది. ఎచ్చోటికి పోవలెనని యామె ప్రాణము-కొట్టుకొనుచుండెనో అచ్చోటికి నామె వెళ్ళలేకపోయినది. పైగా రామమోహనుఁడు నేఁడు కోపముతో తిరిగి పోవుటకూడ జరిగినది——రామమోహనుని యెడల నిజమైన యనురాగ ముండెను విభకు! విభ యవస్థ ఎవ్వరును తెలిసికొనలేరు కాదా!

విభ యిచ్చటనే యుండిపోయినది——కనులు తుడుచు-కొనుచు గుండెలపై కూర్చుండియున్న భారమును వహించుచు అన్న దగ్గరనే యుండిపోయినది. శుష్కించి మాడి, ప్రాణము-లేని నీడవలె నోటివెంట మాటలేక ఇంటిపనులన్నియుఁ జేయుచుండెను. ఉదయాదిత్యుఁడు ముద్దుచేయుచు నేదైన మాట యనునప్పుడు విభ కనులు వాల్చి కొంచెము నవ్వు-చుండును సాయంకాలము అన్నపాదములకడ కూర్చుండి మాటలాడ ప్రయత్నించుచుండును. తల్లి యేదో వంకను తిట్టుచున్న ద్వారక నిలువఁబడి విని, చివరకొక నీడవలె మఱి-యొకచోటికి మెల్లఁగ పోవుచుండును. ఎవరైన నామెగడ్డము పట్టుకొని, "ఏమి తల్లీ, ఇంతనీరసమైపోతివేమి?" అని అడిగిన, ఏమియు జవాబు చెప్పక కొంచెము నవ్వును,

ఈరీతి యవస్థలో నున్నప్పుడా దొంగదరఖాస్తు ప్రతాపుని చేతఁబడినది. ప్రతాపుఁ డగ్నిహోత్రుఁ డయ్యెను, చాల-యోచనచేసి చివరకు ఉదయుని ఖైదులో నుంచవలసినదని యాజ్ఞాపించెను. మంత్రి నివారించెను;——"యువరాజిట్టిపని చేయఁడు; విన్నవారందరును నాలుక కఱచుకొని 'అట్టిమాటలు

నాతోఁ జెప్పకుము' అనుచున్నారు. యువరాజిట్టిపని చేయునని ఎంతమాత్రము నమ్మదగిన మాట కాదు." అని మంత్రి యనెను. "నేనుకూడ నంతగా నమ్మను," అని ప్రతాపాదిత్యుఁడు జబాబిచ్చెను. "కాని ఖైదులో పెట్టుటవలన తప్పేమి? అక్కడ నతని కేవిధమైనకష్టమును లేకుండఁ జేసిన చాలును కదా? రహస్యముగ నేమియు చేయకుండునటుల పహరా మాత్ర ముండును."



## ఇరువదినాల్గవ పరిచ్ఛేదము.

రామమోహనుఁడు వచ్చి రామచంద్రుని సమ్ముఖమున చేతులు జోడించుకొని నిలువఁబడెను. మోహనుఁ డొక్కఁడే తిరిగివచ్చెను, అతనితోఁగూడ నెవ్వరును లేరు. అతనిఁజూచి రామచంద్రుని సర్వాంగముల వెంట పుట్టుచుండెను, అతఁడు కోపముచే నగ్నిహోత్రుఁ డగుచుండెను. సభ వచ్చినతోడనే ప్రధానామాత్యునిమీఁదను, అతని వంశముమీఁదను అతిఘోరమైనవి నాలుగు మాటలాడి కసితీర్చుకొనవలెనని కనిపెట్టుకొనియుండెను. ఏమేమి యనవలెనో, ఏవిధముగ ననవలెనో నిశ్చయించుకొని సిద్ధపడెను. మూర్ఖుఁడు కాఁడు రామచంద్రుఁడు, మొండిపట్టుపట్టి సభను బాధపెట్టవలెనని కాదు అతని యభిప్రాయము. వారినుగూర్చి మాట అప్పటికప్పుడెత్తి సభకు సిగ్గుతెప్పించవలయునని యాతఁడు సంతసము పొందుచుండెను. ఆయాలోచనములలో నుండుటచేతనే సభవచ్చుట కష్టమైన రావచ్చునను మాట అతనికి తట్టనైనతట్టలేదు. అట్టి యవస్థలో నతఁడున్నప్పుడు రామమోహనుఁ డొక్కఁడే తిరిగివచ్చుట చూచి మిగుల నాశ్చర్యపడుచు, "ఏమి, రామమోహన్, ఏమి జరిగినది?" అని యడిగెను.

"అంతయు నిష్ఫలమైనది."

"తీసికొని రాలేకపోయితివా?" అని రాజు జాలికపడుచు నడిగెను.

"లేదు మహారాజా, నేను బయలుదేరినది మంచిముహూర్తము కాదు."

రాజు కోపముతో గర్జించుచు ఇట్లనెను—"ఔనౌను! నిన్ను వెళ్లుమనినదెవరు? వెళ్లవద్దని నీతో పెక్కుమారు లనలేదు? ఛాతీ పెరుచుకొని గర్వముతో వెళ్లుచుంటివానాడు—నేడు—"

మోహనుడు నొసలు కొట్టుకొనుచు, "నా అదృష్టము వంకర మహారాజా!" అనెను.

రాజు మ[illegible]ముతో, "రామచంద్రరాయలునకు కాదా అవమానము! మూర్ఖుడా, నీవు నా పేరును బిచ్చమెత్తుటకు పోయితివి, ప్రతాపాదిత్యుడు ముష్టి వేయక పొమ్మనెను ఎన్నడును నింత ఘోరావమానము మావంశమున నెవ్వరికిని కలుగలేదు!" అనుచు గర్జించెను.

వాల్చియున్న శిరస్సెత్తి రామమోహనుడు గర్వముతో ఇట్లనెను—"అట్లనబోకుము మహారాజా! ప్రతాపాదిత్యుడీయని యెడల బలవంతముగ నేను తీసికొనివచ్చియుందును. అట్లని నీతో చెప్పియేయుంటిని. నీ యాజ్ఞ పాలించుటకై పోవునప్పుడు ప్రతాపాదిత్యునికి జడియవలసినవాడను కాను నేను. ప్రతాపాదిత్యుడు రాజు, నిజమే, కాని నా రాజు కాడతడు!"

"అట్టైన సాధింపలేకపోయితివేల?" అని రాజడిగెను.

రామమోహానుఁడు కొంతసేపటివఱకు జబాబు చెప్ప-లేదు, వాని కండ్లనుండి బొటబొట నీరు కారుచుండెను.

"త్వరగాఁ జెప్పుము!" అని ఆతురతతో రాజనెను.

రామమోహానుఁడు చేతులు జోడించుకొని, "మహా-రాజా—" అని ప్రారంభించుచుండెను.

మహారాజు—"ఏమైనదో చెప్పుము."

"రాణియమ్మ రానన్నది." రామమోహానుని కనులనుండి నీటిబొట్లు పడుచున్నవి—ప్రేమవలన గలిగినగర్వము బిడ్డఁడ-గు మోహానుని హృదయమును నింపియుండుటవలన పుట్టిన-కన్నీరది. 'మాయమ్మయందు నాకుఁగల నమ్మకము కొలఁది నేను ఛాతీ విరుచుకొని అమ్మను తీసికొనివచ్చెదనని అహంకారము-తో బయలుదేఱితిని, గాని యమ్మవచ్చినది కాదు, అమ్మ నాప-రువు నిలిపినది కాదు!' అని కాబోలు నతని దుఃఖము అన్నద్ధుఁ-డైన రామమోహానుని మనస్సున నిస్పృహభావము మునుముంచుచుం-డెనోగాని కన్నీరుమాత్ర మతఁడాపుకొనలేకపోయెను.

రాజుగారు లేచి నిలుచుండి కోపముతో గ్రుడ్లు నిటునటు త్రిప్పుచు "కాదా మఱి!" అన్నారు, చాలసేపటివఱకు నోట-నుండి మఱియేమాటయు రాలేదు.

"ఔను, ఏలవచ్చును? పొమ్ము, మూర్ఖుఁడా, పశువా, నాయెదుట నిలిచియుండకుము పొమ్ము, తక్షణమే పొమ్ము."

రామమోహనుఁ డేమియు నుత్తరమీయక బయటికి-పోయెను. దోషమంతయు తనదే యని రామమోహనుని నమ్మకము, కనుక దానికితగినశిక్షయంతయుఁ తనపైఁబడుట అ-న్యాయమని వానికి తోఁచలేదు.

పగతీర్చుకొనుటకు మార్గమేమియు రాజుగారికి కనఁబ-డలేదు. ప్రాణాపాయకృత్య మేమియుఁ జేయలేదు, పత్రమైనను తనచేతికి చిక్కలేదు, కోపముతో నిటునటు పచారుచేయ-సాగెను.

ఈవార్త రెండుమూఁడురోజులలో అనేకరూపములు ధరించి పలుదిక్కులను వ్యాపించినది, దానికి ప్రతీకారముగ నేదైనచేసినఁగాని రామచంద్రుఁడు మానము నిలఁబెట్టుకొనుట కష్టమగు ననునట్టియవస్థ వచ్చినది. ప్రజలకుఁగూడ కోపము వచ్చినది; 'మామహారాజగారికా యవమాన' మనుచు, జరి-గినయవమానము తమకే యనునట్లు పగతీర్చుకొనవలెనని కొం-దఱనుచుండిరి. పగ స్వభావసిద్ధముగ కావలసినంత యుండె-ను రామచంద్రునిలో, ఇదికాక 'పగతీర్చుకొననియెడల ప్రజ లేమనుకొనెదరు? భృత్యు లేమనుకొనెదరు? రమాయి యేమ-నుకొనును?' అనుభయ ముండెను. ఈవిషయమునుగూర్చి రమాయి ఇతరులతో వేళాకోళము చేయుచున్నట్లూహించి నప్పుడెల్ల రాజుగారికి మిగుల కోపము వచ్చుచుండెను.

రాజసభలో నొకనాఁడు రాజుగారు రెండవపెండ్లి-చేసికొనిన బాగుగనుండునని మంత్రి యనెను.

రమాయి—"ఔను, ప్రతాపాదిత్యునికొమార్తె వన్న గారితో, నుండిపోనిండు."

రాజుగారు రమాయివైపు చూచి నవ్వుచు, "మంచి-మాట యంటివి" అనిరి. రాజుగారు నవ్వుట చూచి సభయం-దుండువారందఱును నవ్వసాగిరి. ఘనశ్యాముడు మాత్రము న-వ్వలేదు, చికాకుపడుచుండెను. రామచంద్రరాయలువంటి-వారు మర్యాద నిలువఁబెట్టుకొనుటకై మహాప్రయత్నము చేయుచుందురు, కాని దేనిని మర్యాద యనవలెనో, అది యెట్లు నిలువఁబెట్టుకోవలెనో వారికిఁ దెలియదు.

దివాను—"మంత్రి చెప్పినది మంచిసలహా. ఇట్టి ప్రతాపాదిత్యునికిని ఆయనకొమార్తెకును తగినబుద్ధి చెప్పిన వారమగుదుము"

రమాయి—"తమ యిప్పటి మామగారికికూడ నొక శుభలేఖ పంపుట మఱవఁగూడదు, లేనియెడల ఆయన దుఃఖంప-వచ్చును" ఇట్లనుచు రమాయి కన్ను చికిలించెను. సభాసదు-లందఱు నవ్వసాగిరి. వెనుకను దూరమునున్నవారికి మా-టలు వినఁబడలేదు, కాని వారైనను నవ్వు నాపుకొనలే-కుండిరి.

రమాయి—"వరుఁడు పెండ్లియింట ప్రవేశించునప్పు-డాదరించుటకువచ్చు ఇల్లాండ్రలో మీయత్తగారినికూడ ఉండుమనికోరుచు యశోహరపురమునకు కబురు పంపుఁడు మహారాజా 'మృష్టాన్న మితరే జనాః' గనుక ప్రతాపాదిత్యుని

కొామారైకు మృష్టాన్నము పంపునప్పుడు దానితోపాటు రెండుకొబ్బెరకురిడీలుకూడ పంపుడు.

రాజుగారు పకపక నవ్వుచుండిరి, సభ్యులు నవ్వలేక నవ్వలేక నోట గుడ్డలు కుక్కుకొని ముఖములు ప్రక్కకు త్రిప్పుకొనిరి. ఫర్నాండిజ్ సందుచూచుకొని బయటికి వెళ్లి-పోయెను.

దివాన్‌జీ కొంచెము రసికత కనపఱుపఁబోయి "మృష్టా-న్నమితరే జనాః' అనచో మృష్టాన్నమంతయు యనోహరపుర-మునకే ఖర్చైపోవును, మృష్టాన్నము తినెడు అదృష్టముగల-వారు చంద్రద్వీపమున నెవ్వరును నుండరు!" అనెను.

ఈమాటలు విని యెవ్వరును నవ్వలేదు, రాజుగారు గుడుగుడు పీల్చుచు ఏమియు ననక కూర్చుండిరి, సభ్యులలోఁ గూడ నెవరును నేమియు ననలేదు. రమాయి ఆశ్చర్యపడుచు దివాన్‌జీ వైపు పాకమాటు చూచెను. అమాత్యులలో నొకఁడు "అట్లంటిరేమి దివాన్‌జీ, మహారాజావారి వివాహమప్పుడు మృష్టాన్నమంత కొంచెము చేయుదు మనుకొంటిరా?" అనెను. దివాన్‌జీ తలగోకుకొనుచు ముఖము వాల్చుకొనెను

రెండవపెండ్లి నిశ్చయమైనది.

———

## ఇరువది యైదవ పరిచ్ఛేదము.

ఉదయాదిత్యుని నుంచినస్థలము మామూలు ఖైదు కాదు, అది కోటకు తగిలియున్న ఒకచిన్న మేడ. మేడకు కుడివైపున రాజమార్గ మొకటియుండెను, దానికి తూర్పు-వైపున పెద్దప్రహరీ యుండెను, ఆప్రహరీపైని పహారావాండ్రు ఇటునటు పచారిచేయుచు పహారా యిచ్చుచుండిరి ఉదయా-దిత్యునిగది కొకచిన్న కిటికీమాత్ర ముండెను ఆకిటికీలోనుండి ఆకాశమున రవంతమేరయును, వెదురుపొద యొకటియు, ఒకశివాలయమును కనఁబడుచుండెను. ఉదయుఁడు మొట్ట-మొదట నాఖైదుగదిలో ప్రవేశించునప్పుడు సంధ్యదాటినది; లోనికివెళ్లి యతఁడు కిటికీదగ్గఱ తలనుంచుకొని నేల కూర్చుం-డెను. అప్పుడు వర్షకాలము, ఆకాశము మేఘావృత మై-యున్నది. దారులు నీటితో నిండియున్నవి. రాత్రివేళ నాదా-రిని నడుచుట తటస్థించిన బాటసారుల యడుగులచప్పుడు కస్సుకస్సుమని వినఁబడుచున్నది. కారాగారహ్యాదయకంపనము-వలె తూర్పుదిక్కున నుండి పహారావాండ్ర యడుగులచప్పుడు విరామములేకుండ వచ్చుచున్నది. పహారావాండ్రు వేయుకేకలు జాముజామునకు వినఁబడుచున్నవి. ఆకాశమున నొక్కనక్షత్ర-మైనను లేదు, ఉదయునికి కనఁబడుచుండు వెదురుపొద మెరుగుడుపురుగులతో పూర్తిగా కప్పఁబడియున్నది. ఉదయుఁ

డారాత్రి పరుండలేదు, విశ్రామములేకుండ వచ్చుచుండు ఆయడుగులచప్పుడు వినుచు నాకిటికీయొద్దనే కూర్చుండెను.

విభ యాసాయంకాల మంతఃపురమునుండు ఉద్యా- నములోని కొలకనూలు పోయెను. ఇల్లు దాసదాసీజనముతో నిండియున్నది. ఎటుచూచినను పినతల్లులు పెత్తల్లులు, "ఏమి సమాచారమమ్మా! ఏమిజరిగినదమ్మా?" అని యడుగుచుందురు, కంటనుండి కారు నీటిబొట్టు నీటిబొట్టునకు కారణము చెప్ప- చుండవలెను. విడచిన నిట్టూర్పు నిట్టూర్పునకు మఱచినదంతయు జ్ఞాపకము తెచ్చుకొని సమజాయిషి చెప్పుచుండవలెను. ఇది- యంతయు భరించుశక్తి లేక విభ ఉద్యానమునకు వెళ్ళి- పోయెను. సూర్యుడానాడు మేఘములలోనే ఉదయించి మేఘములలోనే అస్తమించెను. ఎప్పుడు దిన మంతమయి సంధ్య ప్రారంభమయినదో తెలియలేదు. పశ్చిమాకాశమున కనబడిన సువర్ణరేఖ గూడను ముగిసియు ముగియకమునుపే మాయమైపోయినది. చీకటి అంతకంతకు నధికమగుచున్నది. దిగంతమునుండి దిగంతమువఱకు నంధకార మావరించినది. దట్టముగానున్న సంగీతపుచెట్ల నంధకార మతిగాఢముగ జమ- కూడి చెట్టుచెట్టునకు నడుమనుండు నెడములేకుండ చేసినది. నిస్తబ్ధాంధకారము సర్వమును వ్యాపించి వేయికాళ్లపై నిలిచి- యున్నదా అనిపించుచున్నది. రాత్రి యగుచున్నకొలఁది రాజభవనమున దీపములు ఒక్కొక్కటిగ నారిపోవుచున్నవి. విభ సంగీతపుచెట్లక్రిందను కూర్చుండియున్నది. ఆమె స్వాభా-

ధికముగా భయముగలది కాని నేఁడామెకేమియు భయము-
వేయలేదు. కాని యంధకార మధికమగుచున్నకొలఁది పృథ్వి
నెవరో తనచేతులనుండి లాగి తీసికొనిపోవుచున్నారని ఆమెకు
తోఁచినది, జగత్సంసార జాలమునుండి యెవరో తన్ను త్రోసి
వేయుచున్నారని తోఁచినది. సుఖమునుండియు శాంతినుండియు
తన్ను దూరముచేయుచున్నారని తోఁచినది. ఆమె అడుగందని
యంధకారసముద్రమునఁబడినది, క్రమక్రమముగ మునిఁగిపోవు
చున్నది, పైనున్నయంధకారము గాఢమగుచున్నది, అడుగున
భూమిలేదు కాళ్లు నిరాధారముగ నిలిచియున్నవి, ఎటుచూచి
నను దరికానరాదు, ఆశ్రయమును లేదు, జగత్సంసారజాలము
నుండి ఆమె అంతకంతకు దూరమగుచున్నది. తనయెదుట పెద్ద
అడ్డుగోడొకటి లేచుచున్నదని ఆమెకనిపించుచున్నది, దాని కవతల-
వైపున నెన్నియో యున్నవి, ఆమెమనస్సులో గొప్పయశాంతి
పుట్టుచున్నది. అవతలనుండునదంతయు నామెకగపడుచున్న
ట్లనిపించుచున్నది, అక్కడి సూర్యకాంతి, యాటపాటలు,
ఉత్సవములు,—అన్నియుఁ గనఁబడుచున్నవి, కాని యెవఁడో
తనక్రూరహస్తములతో నామెను బట్టుకొని వదలకున్నాఁడు,
ఆమె తనగుండెలోనిశిరములను పీకి వానిపై పాఱవైచినను
నతఁడు తన్ను వదలఁడని ఆమెకు తోఁచుచున్నది. విభకు
నేఁడు దివ్యచక్షువు కలిగినది. సమస్తమును నిండియున్న-
గాఢాంధకారముపై విధాత తనభవిష్యత్తును వ్రాయుచు-
న్నాఁడు, ఆయనంత జగత్సంసారమున విభ యొంటరిగఁ

కూర్చుండి ఆవ్రాతను చదువుచున్నది; కనుకనే ఆమెనేత్రములు నిర్నిమేషములై యున్నవి, దేహము నిష్పందమైయున్నది.

అర్ధరాత్రియైనతరువాత గాలి ప్రారంభించినది, చీకటిలో చెట్లఝుంకారము వినవచ్చుచున్నది, అతిదూరమున గాలి పసిబిడ్డయేడ్పువలె శబ్దముచేయుచున్నది. దూరమున ఎంతో-దూరమున—సముద్రతీరమునఁ గూర్చుండి తనముద్దుబిడ్డలు ఏడ్చుచున్నా రనిపించుచున్నది విభకు. ఆందోళనపడుచు వారామెను పిలుచుచున్నారు, తల్లి యొడిలోనికి రావలెనని వారు చేతులు చాచుచున్నారు, కాని తల్లియొద్దకు వచ్చుదారి కాన-కున్నారు. ఆవేయియోజనములో లక్షయోజనములో దాఁటి-వచ్చి ఆయేడుపు విభ చెవిని పడుచున్నది.

"ఎవరమ్మా మీరు?" అని విభ దుఃఖించుచు నడుగు-చున్నది.

"ఎవరమ్మా మీరు? ఏడ్చుచున్నారేల? ఎక్కడ-నున్నారు?" అని యడుగుచున్నది. ఆయేడ్పు వినీవినునంతట తనలో తానిట్లడుగుచు విభ ఆలక్షయోజనముల యంధ-కారమార్గమున బయలుదేరినది వేయిసంవత్సరములనుండి ఎడ-తెఱిపిలేక నడుచుచున్నానని అనిపించిన దామెకు, కాని ప్రయాణము తుదముట్టలేదు, దారిలో నెవ్వరును కాన-రాలేదు. వినఁబడుచున్నదంతయు ఆశబ్దహీనమును, వాయు-హీనమును, దినరాత్రిహీనమును, జనశూన్యమును, తారా-శూన్యమును దిక్దిగంతశూన్యమును నైన ఆక్రందనము-

మాత్రమే ! దూరమున అగాలిచేయుచున్న శిశురోదన మొక్కటే యామె చెవిని పడుచున్నది.

రాత్రియంతయు నిద్ర లేదు విభను కారాగారమున-నున్న యన్నదగ్గఱకుపోవలెనని మరునాఁ డెంతయో ప్రయ-త్నముచేసినది, కాని సాధింపలేకపోయినది, లోనికి పోఁగూడ-దని రాజుగారు నిషేధించిరి. రోజంతయు నేడ్చుచుండి; విభ చివరకు ప్రతాపాదిత్యునికడకుపోయి ఆయన పాదములు మీఁదఁ బడినది. ఎంతయో కష్టముపైని తండ్రి సెలవు సంపా-దించినది. మరునాఁడు తెలతెల్లవాఱుచుండ ప్రక్కమీఁద నుండి లేచినతోడనే కారాగారమున ప్రవేశించెను. అన్న-పఱుపుపై లేఁడు; నేలమీఁద కూర్చుండి కిటికీపై తలనుంచుకొని నిద్ర-పోవుచుండెను. విభ గుండె బ్రద్దలైపోయినది, లోనుండి యేడ్పు వచ్చుచుండెను. ఎంతో కష్టముపై ఏడ్పు నాపుకొని మెల్లఁగ వచ్చి యన్నకు దగ్గఱగ చప్పుడుచేయక కూర్చుండెను. మెల్ల-మెల్లగ తెల్లవాఱుచున్నది, దగ్గఱనుండువనమునుండి పక్షుల పాటలు వినఁబడుచున్నవి. బాటసారులు ప్రక్కనుండు రాజ-మార్గమున పాటలుపాడుచు పోవుచుండిరి, రెండు రాత్రులు నిద్రలేక యలసియున్న సహాగావాండ్రు వెలుగురు కనఁబడిన తోడనే కూనురాగములుతీయుట మొదలుపెట్టిరి అనతిదూర-మునసుండు నాలయమున ఘంటవాగుచున్నది, శంఖము వినఁ-బడుచున్నది. ఉదయాదిత్యుఁడులికిపడిలేచి విభనుజూచి "ఇదే-యేమి చెల్లీ, ఇంత ప్రొద్దుట వచ్చితివే" అనెను; పూర్తిగ

కనులువిప్పి నాలుగువైపులను చూచుచు, "ఇదియేమిది, నేనెక్కడనున్నాను విభా?" అని యాశ్చర్యపడుచు నడిగెను. కాని ఒక్కనిమిషములో తానెక్కడనున్నదియును పోల్చుకొనెను. విభవైపుచూచి నిట్టూర్పువిడుచుచు, "ఆహా విభా, నీవు వచ్చితివమ్మా! నిన్న నొక్కమాఱైనను నిన్ను చూడ-లేదు, మీ రెవ్వరును మఱినాకు కనఁబడరని జడియుచుంటిని." అనెను.

విభ అన్నదగ్గఱకు జరిగి కనులు తుడుచుకొని, "నేల కూర్చుండియున్నావేమి అన్నయ్యా? మంచముమీఁద పఱుపు-పఱచియున్నను నీవొక్కమాఱైనను మంచముదగ్గఱకు పోన-ట్లున్నదే! ఈ రెండురాత్రులు నేలనే కూర్చుండియున్నావా అన్నయ్యా!" అనుచు ఏడ్వనారంభించినది.

ఉదయాదిత్యుఁడు నెమ్మదిగ ప్రారంభించెను, "మంచ-ముపై కూర్చుండినయెడల నాకాకాశము కనఁబడదు విభా. కిటికీ-యొద్ద కూర్చుండి చూచుచుండినయెడల ఆకాశమున నెగురు-చుండు పక్షులు కనఁబడి, ఎప్పుడో యొకనాఁడు పంజరమునుండి విముక్తుఁడనై నేనుకూడ బయటికివత్తునని యూహపుట్టు-చుండును. నేనుకూడ ఆ పక్షులవలె ఆయనంతాకాశమున మనసార విహారముచేసెదనని యాశపుట్టుచుండును. ఈకిటికీ విడిచి అటుపోయినయెడల అన్నివైపుల నంధకార మగపడు-చుండును, ముందొకనాఁడు ముక్తిపొందఁగలననుమాట తట్టనే-తట్టదు, నాచుట్టునుండు నావరణ ఎన్నఁడైన విరుగఁగలదని

తట్టదు, ఈ ఖైదునుండి విడుదల పొందఁగలవని నాకు తట్టదు. ఈ ఖైదులో, కిటికీయొద్దనుండు నీ రెండుమూరల స్థలములో కూర్చుండియున్నప్పుడుమాత్రమే నాకు స్వాభావసిద్ధముగ స్వేచ్ఛయున్నదనియు, ఏ రాజైనను, ఏ రాజాధిరాజైనను నన్ను బంధించియుంచలేఁడనియు తోఁచుచుండును అక్కడనున్న [illegible] అప్పు, అదియే నాఖైదు."

నేఁడు హఠాత్తుగ విభ కనఁబడఁగానే ఉదయాదిత్యునకు మిగుల నానందము కలిగినది, ఖైదువాకిళ్ళన్నియు ఒక్కమారుగ విడివడినని అనిపించినది. విభను దగ్గఱగ కూర్చుండఁబెట్టుకొని అత్యుల్లాసముగ ప్రసంగించుచుండెను, ఖైదులో నరకమును సహించెన్నఁడును చెల్లెలితో నింతగా మాటలాడియుండలేదు. ఉదయాదిత్యుని ఆనందమునకు కారణము విభ పోల్చుకొన్నది. ఒక జీవుఁడు లోనుండి మఱియొక జీవునకు లోనికి వార్త లెట్లుపోవునో మనమెఱుఁగనుకదా! ఒక హృదయమున పుట్టుతరంగములు మఱియొక హృదయమునెట్లు తరంగితముగ చేయునో మనకు తెలియదుకదా! విభ హృదయమున పులకరింపు పుట్టినది, అనేకదినములనుండి చేయుచున్న ప్రయత్నము నేఁడు సఫలమైనది. విభ సామాన్యబాలిక, ఉదయాదిత్యునికి కానానందము కలుగఁజేయఁగలనని నేఁడాకె ఆకస్మాత్తుగ కనిపెట్టినది. ఆమె హృదయమునకు బలముకలిగినది. నేఁటివఱకు నామెకు నలుదిక్కుల నంధకారమే కానవచ్చుచుండెను. ఎటువైపునను దరి కానరాలేదు, నిరాశా-

భారమువలన క్రుంగిపోవుచుండెను. తనపై తనకే నమ్మకము లేకయుండెను. అనవరతము ఉదయాదిత్యునికొఱకే ఏదో యొక పనిచేయుచుండెను. కాని అన్నను సుఖపెట్టఁగలనని-మాత్రము ఎన్నఁడు నాశింపలేదు. నేఁడకస్మాత్తుగ నొక-మార్గ మామెకు కనఁబడినది, ఇంతకాలమునుండి పడుచుండు-శ్రమ ఆమె మఱచినది. ప్రాతఃకాలమున కనఁబడుశిశిరమువలె అశ్రుజల మామెకంట కనఁబడినది, లేటయైన చిరునవ్వామె పెదవులపై వికసించినది. ఇప్పు డొకవిధముగ విభకూడ సైదీ-యైపోయినది. కిటికిలోనుండి వెలుతురు వచ్చియుండకమునుపే, దుతలుపులు విడి విభయొక్క విమలవిగ్రహము అన్నగారి-యెదుట కనఁబడుచుండును. జీతము పుచ్చుకొనునౌకర్ల నేమియుఁ జేయనిచ్చునది కాదు విభ, అన్నకు కావలసినదం-తయు తన చేతులతో తానే చేయుచుండెను—తానే అన్న-కొఱకు వంటచేసి తానే ఆహారము నన్నయొద్దకు తీసికొని-వచ్చును, తానే అన్నకుఱుపు సవరించి సిద్ధముచేసియుంచును. విభ చిలుక నొకదానిని తీసికొనివచ్చి అన్నగదిలో నుంచినది, ప్రతిదినమును పూలతోటనుండి పూలు కోసితెచ్చి అన్నగది-లోను ఉదయమున నుంచుచుండెను. గదిలో మహాభారత మొకటియుండెను, అన్న చెల్లెలను తనదగ్గఱ కూర్చుండఁబెట్టు-కొని అది చదివి వినిపించుచుండును.

ఉదయాదిత్యునిమనస్సునకు బాధకలిగించుచున్న దొ-క్కటి మాత్రముండెను. తానుమునిఁగిపోవుచున్నాఁడు—అది

నిశ్చయము. తనయసంపూర్ణసుఖము, సఫలమగుచుండునాశ ఆసుకుమారివిభ నాశ్రయముచేసికొనినది. తపతోపాటు విభనుకూడ ముంచివేయుచున్నాఁడేమో యనుభయ మతనిని మిగుల బాధించుచుండెను. ఈమాఱు విభ వచ్చినప్పుడు ఇఁక నీవిక్కడ నుండకుమమ్మా, పొమ్ము, అని చెప్పవలెనని ప్రతిదినమును ఉదయాదిత్యుఁడనుకొనువాఁడు. ఉషను చేయిపట్టుకొని ప్రభాతవాయువుతోఁ విభ ప్రతిదినము నాకారాగారమున ప్రవేశించి అతిమధురస్వరముతో ప్రేమనొలికించు మాట-లాడుచు వచ్చి తపదగ్గఱ కూర్చుండఁగానే ఉదయునిమనస్సు కరగిపోవుచుండును. "విభా నీవు పొమ్ము నాకొఱకు నుండకుము, నాయొద్దకు వచ్చుచుండకుము నేను నిన్నిఁక చూడ-ను," అనఁజాలనినోటనుండి యెట్లు రాఁగలదు! రేపు చెప్పెద-నని ప్రతిదినమును అనుకొనుచుండును, కాని ఆరేపెన్నటికిని రాకున్నది. తుదకొకనాఁడు దృఢప్రతిజ్ఞ చేసికొని విభ గది-లోనికి వచ్చినతోడనే ప్రారంభించెను—"విభా నీవిఁక నిక్కడ నుండకుమమ్మా, నీవు వెళ్ళినఁగాని నాకెట్టిశాంతియు కలుగదు. ప్రతిదినమును సాయంకాలము కాఁగానే ఎవరో వచ్చి చీఁక-టిలో నిలిచి, 'విభవిపత్తు దగ్గరపడుచున్నదని చెప్పుచున్నాఁడు. అందఱును నాయొద్దనుండి పొండు విభా, నేను శనిగ్రహమును, నే నగపడినతోడనే దేశమునందు విపత్తులన్నియు నలుదిక్కులనుండి పరుగెత్తుకొనివచ్చును. నీవు మీయత్తవారి-యింటికి పొమ్ము తల్లీ! అప్పుడప్పుడు నీక్షేమము తెలియఁ-

జేయుచుందుము. అదియే నాకు చాలును విభా!" విభ మాటాడక ఊరక కూర్చుండెను.

ఉదయాదిత్యుఁడు తలవాల్చి విభముఖమువైపు చాల-సేపు చూచుచుండెను. అతనికనులనుండి నీళ్లు బొటబొట కార నారంభించినవి. తాను విడుదలపొందనిదే విభ తన్నెంత-మాత్రమును విడిచిపోదని ఉదయునికి బోధపడినది. కాని తానెట్లు విముక్తుఁడు కాఁగలఁడు?



## ఇరువది యారవ పరిచ్ఛేదము.

తండ్రియాజ్ఞయు, అన్నప్రేరేపణయు విభ తనయొద్దకు రాకుండుటకు కారణములని రామచంద్రరాయల యభిప్రాయము. విభ తానే కోరి ఉండిపోయినదని రామచంద్రుఁ డొప్పుకొనఁడు, అట్లైన స్వాభిమానమునకు భంగము కలుగును. ప్రతాపాదిత్యుఁడు తన్నవమానింపఁగోరి విభను తనయొద్దకు పంపకున్నాఁడని రామచంద్రుఁడు నిశ్చయపఱచెను. కాని 'నేను దానికి ప్రతీకారము చేయలేకున్నానేమి! మీరుమాత్రైను నేను విడిచిపెట్టితిని, ఆమెను చంద్రద్వీపమునకు మరల పంపవద్దు' అని మామగారికి నొకలేఖ వ్రాయలేకున్నాఁడేమి? అనేకవిధముల నాలోచించి నలుగునెలలపాటు తీసికొని తుద కాధోకపటి-లో జాబువ్రాసి ప్రతాపాదిత్యునికి పంపెను. ప్రతాపాదిత్యుని కిరితిని వ్రాయుట సామాన్యసాహసమైన కార్యము కాదు. కనుక రామచంద్రునకు లోలోపల కావలసినంతవణఁకు పుట్టుచుండెను. కాని యేటవాలుగనుండు కొండ దిగుచుండువాఁడెంతభయపడుచున్నను నడుమ నాగలేఁడు, అట్టియవస్థలో నున్నాఁ డిప్పుడు రామచంద్రుఁడు. హఠాత్తుగ నొకసాహసకార్యమున దిగియున్నాఁడు, అది తుదముట్టినగాని ఊరకుండలేఁడు. రామమోహనుని పిలిచి ఆపత్రము యశ్శోరునకు తీసుకొనివెళ్లుమని చెప్పెను. "క్షమించుము మహారాజా, నేనాపని చేయలేను,"

అని మోహనుఁడు ప్రత్యుత్తరమిచ్చెను; "మఱియెన్నఁడును యశోధరునకు పోకూడదని నిశ్చయించుకొంటిని. పోయి మా రాణియమ్మను తీసికొనిరమ్మని నీవుకోరినయెడల మఱియొకమారకుఁడనుపోవుట కభ్యంతరములేదు, కాని యీజాబు తీసికొని వెళ్లుటమాత్రము నేను చేయఁగలవాని కాదు," రాజుగారు మోహనునితో మఱియేమియు ననక, వృద్ధుఁడగు నయన్‌చంద్ చేతి కాజాబు నిచ్చిరి. జాబుపట్టుకొని యశోధరునకు బయలుదేఱెను.

నయన్‌చంద్ జాబుతీసికొనివెళ్లెను, నిజమే; కాని వానికి ప్రాణములుమాత్రము లేవు, ఆజాబు రాజగారిచేతఁబడిన నెట్టి ప్రమాదమైన జరుగవచ్చును. అనేకవిధముల నాలోచించి చివరకు దానిని రాణిచేతి కీయవలెనని వాఁడు నిశ్చయించుకొనెను. అప్పుడు రాణి యవస్థ మిగుల శోచనీయముగనుండెను. ఒకమూలనుండి విభను జూచి కష్టము నొందుచుండెను, మఱియొకమూలనుండి హృదయునిమాట యనుకొని బాధపడుచుండెను. ఆదుఃఖము ఆబాధ ఆమెమనస్సును చీల్చివేయుచున్నట్లుండెను. ఉండియుండి ఆమెకన్నులనుండి అశ్రుధారలు పడుచుండును సంసారముపై నామెకు ధ్యానము లేకుండెను ఆమె యిట్టియవస్థలో నుండునప్పుడు ఆజాబామెచేతఁబడెను. రాణికేమి చేయును తోఁచలేదు. విభ కాసంగతి చెప్పుటకు వీలులేదు, అది తెలిసినచో విభ మరి బ్రతుకదు. మహారాజుగారికి దాని మాట తెలిసినయెడల నెట్టియుపద్రవమైనను జరుగవచ్చును. కాని యిట్టిదురవస్థలో నున్నను ఎవ్వరితోనైన నేమియు ననక,

ఎవరి సలహాను గోరక బాధపడుచు రోజులు గడపుటకంటె చావు మేలనిపించినది. రాణికి ఎటుచూచినను మహాసముద్రమే—భరింపలేక చివరకు ప్రతాపాదిత్యునియొద్దకుఁ బోయి విభ కేమియో దారిచూడవలసినదని చెప్పినది.

ప్రతాపాదిత్యుఁడు—"ఏడ్చుచున్నావేమి?"

రాణి—"ఏదో జరిగినదని కాదు నేనుదానియర్థము. కాకపోయినను విభ నెప్పుడో అత్తవారియింటికి పంపవలెను గదా!"

రాజు—"అది నాకు తెలియును; కాని ఆసంగతి ఇంతకాల మైన పిమ్మట హఠాత్తుగ ప్రసక్తి వచ్చుటకు కారణమేమి?"

రాణి భయపడుచు నిట్లనెను—"అన్నమాట మీరు వదలరు, అదే మీతో నున్నచిక్కు. ఏమైన జరిగినదని నేనన లేదే! కాని జరిగిన యెడల—"

"జరిగినయెడల జరుగును. అంతకంటె నధికమేమి కాఁగలదు," అని చక్రాంకుఁడును రాజుగారనిరి.

"అల్లుఁడు, విభ నాకు మఱియక్కరలేదు, ఆమెను వదలిపెట్టివేసితిని అనునేమో!" అనియనుచు రాణి యేడ్వసాగెను.

కోపమువలన ప్రతాపాదిత్యునికన్నులనుండి నిప్పులు రాలుచుండెను.

రాజుగారి రౌద్రస్వరూపమును జూచి రాణి తొందర తొందరగ కనులు తుడుచుకొని, "అల్లుఁడు నిజముగా విభను

మఱి పంపవద్దని వ్రాసెనని నేననలేదు, కాని ఎప్పుడైన అతఁడట్లువ్రాయ నిశ్చయించుకొనవచ్చునని నేననునది," అని యనెను.

రాజు—"అప్పుడు జరుపవలసినది జరిపెదను, దాని విషయమై యాలోచించుట కిప్పుడు వ్యవధి లేదు."

రాణి మరల నేడ్వనారంభించినది— "నీపాదములపై పడుచున్నాను మహారాజా! నామాట ఈఒక్కటిమాత్రము నిలుపుము. విభగతి యేమికాఁగలదో ఒక్కమా రాలోచించి చూడుము. నేను గుండె రాయి చేసికొని కూర్చుండియుండఁబట్టిగాని ఎంతదుఃఖ పెట్టఁగలవో అంతదుఃఖపెట్టితివి నన్ను. రాజపుత్రుఁడు నాబిడ్డఁడు గనుకని తీసికొనిపోయి సామాన్యాపరాధివలె ఖయిదులోనుంచితివి. నాబుద్ధిబిడ్డ డు వట్టియమాయికుఁడు, ఎవ్వరికిని ఎట్టి యపకారమును చేయఁడు ఎట్టి విషయములోనైనను దూరఁడు. వాని కేమియు బోధపడదు, రాజకార్యములు నేర్చుకొనఁడు, ప్రజలను లోఁగుబాటులో నుంచలేఁడు, వానికి బుద్ధిలేదు—ఇదియే వానిదోషము. కాని భగవంతుఁడు వాని నట్లు చేసిన వానితప్పేమున్న దందులో?" ఇట్లనుచు రాణి మఱి యేడ్వసాగెను.

"ఈమాటలు చాలమాఱు లయినవి. నీవు మఱి యేదియో అనుచుంటివి, దానినిగుఱించి కానిమ్ము," అని చీకాకుపడుచు రాజనెను.

రాణి తల చేతులతో మొత్తుకొనుచు నిట్లనెను— "చెప్పవలసినదేమున్నది, నావ్రాత బాగుగ లేనప్పుడు? చెప్పి-

నను నీవు వినెదవు గనుకనా? విభవై పొక్కుమాలు చూడుము రాజా! అది యెవ్వరితోను ఏమియును అనదు, రోజుకు రోజు కృశించిపోవుచున్నది. కేవల మొకఛాయవలె నయిపోయినది, దాని కేదియో దారిచూడుము మహారాజా!"

ప్రతాపాదిత్యుఁడు చీకాకుపడుచుండెను. రాణి తా ననవలసినమాట లని లోనికి వెళ్లిపోయినది.



# ఇరువది యేడవ పరిచ్ఛేదము.

ఇంతలో నొకచిన్నసంగతి జరిగినది. ఉదయాదిత్యుని ఖయిదులోఁ బెట్టిరని తెలియఁగానే సీతారాముని కాళ్లుచేతులు మఱియాండలేదు. వినఁగానే వాఁడు తిన్నగ రుక్మిణియింటికిఁ-బోయి నోటికివచ్చిన మాటలన్నియు ననుచు దానిని గొట్టఁ బోయెను. "నీయింటికి నిప్పంటించి యువరాజును విడిపించక పోయిన నాపేరు సీతారాముఁడు కాదే పిశాచి," అనెను. "ఇప్పుడే బయలుదేరి రాయగడు వెళ్లుచున్నాను; అక్కడి-నుండి రాఁగానే నీపాడుముఖమును ఆరాళ్లపై రాచి, ముఖ-మునకు మసిపూసి, సున్నపుబొట్లుపెట్టి యూరినుండి నిన్ను వెళ్లఁ-గొట్టెదను. అప్పటివఱకు ఒకగ్రుక్కెఁడు నీరైనను త్రాగను."

రుక్మిణి కొంతసేపు ఉత్తరమైనను వేయక సీతారాముని-వైపు చూచుచుండెను. కండ్లు, పెదవులు బిగించి పిడికిళ్లుకట్టి నిలుచుండెను, కనుబొమ్మలపై నల్లనిమేఘములు కూడుచుం-డెను. ఊపిరి నిలిచిపోయెను. మఱికొంతసేపటికి ఆమెపెదవులు వణఁక నారంభించినవి. కాళ్లలోను చేతులలోను వణఁకుపుట్టినవి, కనులలో మెఱుపుపుట్టినవి, కనుబొమలాడుట మొదలుపెట్టినవి, జుట్టు పైకి తన్నుకొనివచ్చినది. క్రౌర్యమే రూపమును ధరించి స్థూలమగుకాయముతో తనతలపైఁబడవచ్చుచున్నదని యని-పించి, సీతారాముఁడు తత్క్షణమే ఆకుటీరమునుండి బయటికి

పరుగెత్తెను. కొంతసేపటికి రుక్మిణిలో పుట్టినవణఁకు తగ్గినది; పిడికిళ్లు వదులైనవి; పెదవులు విడినవి. అక్కడనే కూర్చుండి ప్రారంభించినది—"ఔనౌను, యువరాజు నీకే యువరాజు! యువరాజాపదలో పడెనని నీకు బహుకష్టముగనున్నది! యువరాజు నాకేమియు కాఁడు కాఁబోలు! పశువా, నీ వెఱుఁగవు కాబోలు యువరాజు నాయువరాజని! అతనికి కీడైన మేలైన నేను చేయఁగలను నాయువరాజును నీవు ఖయిదునుండి విడిపింపఁగలనా? చూచెద నీవెట్లాపని సాధించెదవురా!"

ఆనాఁడే బయలుదేరి సీతారాముఁడు రాయగడు-వెళ్లెను.

సాయంకాలమగుచున్నది, వసంతరాయలు గుమ్మముదఁ గూర్చుండియున్నాఁడు ఎదుట పెద్దబయలు కనఁబడుచున్నది. దానియవతల కొలని కవతలియున్న నుండు మామిడితోఁటలో సూర్యుఁడు మునుఁగుచున్నాఁడు. వసంతరాయని చిరసహాయమగు వీణ యున్న దతనిచేత మతిలేదు. అస్తమించుచున్న సూర్యునివైపు చూచుచు ఆవృద్ధుఁడు తనలోఁదాను పాడుకొనుచున్నాఁడు.

ఆయన ఆపాటయేల పాడుచుండెనో కదా! "పాడుచున్నాను గాని ఎవరికొఱకై పాడుచున్నానో వారిక్కడ లేరే!" అని యనుకొనుచుండవచ్చును. "పాట దానియంతట నదే వచ్చుచుండును, కాని పాటవలన మనస్సునకు మునుపటి సుఖము లేదు. "ఇప్పటికిని ఆయానందము కొంచెము కొంచె-

ముగా వచ్చుచుండును, "కాని యానందము పుట్టినప్పు డెవ-
రినిఁ గౌఁగిలించుకొనవలెనని నామనస్సున కోరికపుట్టుచుండునో
వారేరి? ఆతాటిచెట్టుపై మేఘములుచేరిననాఁడు నామన
స్సానందపరవశమై నాట్యముచేయసాగినది. ఆనాఁడే యశో-
హారునకుపోతిని——ఎవరికొఱకచ్చటికి పోతినో వారిని మఱి-
చూడలేనా! ఇప్పటికిని అప్పుడప్పుడు మునుపటివలె నానం-
దము పుట్టుచుండును, కాని, ఆహా!——" ఈ విధముగ
నాలోచించుచు కాఁబోలు వసంతరాయల కంఠమునుండి
పాట దానియంతటనదియే వచ్చుచున్న దీ సాయంకాలము!

అట్టిసమయమున ఖాఁసాహేబ్ వచ్చి అతిభక్తితో
సలాముచేసెను. వానిని జూడఁగానే వసంతరాయలు అపరిమిత
సంతోషముతో, "రమ్ము, ఇటురమ్ము ఖాన్‌సాహేబ్" అనెను;
మఱికొంచెము దగ్గఱకువెళ్లి కొంచెము కలతఁజెందుచు,
"నీముఖము నేఁడంత వాడియున్న దేల? కులాసాగా
నున్నావా?" అని యడిగెను.

ఖాన్ ——"ఎట్లున్నామని యడుగకుఁడు మహారాజా,
మీముఖము వాడియుండుట చూచి మా కానంద మెట్లుండఁ-
గలదు? మాలో నొకసామెత యున్నది రాత్రి యనునఁట
'నాలో నేమియు లేదు, కాని నాతలపై చంద్రుని నుంచుకొంటిని,
ఆచంద్రునితోనే నా వికాసము, ఆచంద్రుఁడు వాడినప్పుడే
నేను వాడుదును!' మాలో నున్న దేమి మహారాజా! మీ
ముఖమున నవ్వులేనప్పుడు మాముఖములు వాడియుండక మఱి

యెట్లుండును? మాకిఁక నెట్టిసుఖమును లేదు, మహాప్రభూ!"

"నాకేమియు జబ్బుచేయలేదే, అట్లనుచున్నావేమి? నన్ను జూచి నేనే నవ్వుచుందును, నాలో నేనే ఆనందించుచుం-దును—నాకెట్టిజబ్బును లేదే సాహేబ్!" అని వసంతరాయ లాతురతతో ననెను.

"మునుపటి మీపాట యేది మహారాజా?" అని సాహే బడిగెను.

"నాపాట వినవలెనని యున్నదా?" అని కొంచెము గాంభీర్యమువహించి యడుగుచుఁ బాట ప్రారంభించెను.

"మీవీణావాద్య మేది మహారాజా? మీవీణయేది?" అని సాహే బడిగెను.

వసంతరాయలు కొంచెము నవ్వి జబాబు చెప్పెను— "వీణ లేకపోలేదు. వీణ యున్నది, దానితీగెలుమాత్రము తెగిపోయినవి, కంఠము దానితో కలియకుండనున్నది." ఇట్లని తలతడవుకొనుచు మామిడితోఁటవైపు చూడసాగెను.

కొంచెమునే పూరకుండి "ఖాన్ సాహేబ్ నీవొక పాటపాడుము— ఎదీ ఆ "తాజ్ బె తాజ్ నౌబె నౌ!"

ఖాఁ పాట ప్రారంభించెను:—

"తాజ్ బె తాజ్ నౌబె నౌ"

సాహేబ్ పాట వినుచు ఒక్కనిమిషములో వసంత-రాయలు ఒడలుమఱచినవాఁడయి మఱికూర్చుండి యుండలేక పోయెను. లేచి నిలుచుండి వానితోఁ గలసి పాడ నారంభిం-

చెను, చేతులతో తాళము వేయుచు ఒక్కచరణమే పదిమార్లు పాడుచుండెను. వీరిద్దఱు నిట్లు పాడుచుండ సూర్యుఁ డస్తమించి, చీఁకటి యగుచుండెను. గొల్లపిల్లవాం డ్రింటికిఁబోవుచు నీపాటవిని తామును పాట మొదలుపెట్టిరి. ఇట్టిసమయమున సీతారాముఁడువచ్చి వసంతరాయలకు దండము పెట్టెను. వసంతరాయ లులికిపడెను; పాట నిలిపి సీతారామునికి దగ్గఱగ వచ్చి వానిమీఁద చేయివేసి ప్రశ్నింప మొదలుపెట్టెను—"ఇదిగో! సీతారామ! ఖులాసాగా నున్నావా? తాత యేలాగున నున్నాఁడు? విధ యొక్కఁడ! అందఱును క్షేమమూ?"

సాయిబు అచ్చటనుండి వెళ్లిపోయెను. "ఒకొక్కటి మనవి చేయుచున్నాను. మహారాజా!" అనుచు సీతారాముఁడు వృత్తాంతము చెప్ప మొదలుపెట్టెను. యువరాజు మనములో పడుటనుగుఱించి కొంచెము కొంచెముగఁ జెప్పుకొని వచ్చెను. కాని మొదటనుండి చివరవఱకు జరిగినదంతయు జరిగినట్లుగఁ జెప్పలేదు, యువరాజు కారాబద్ధుఁ డగుటకుఁ గారణ మంతస్పష్టముగఁ దెలియపఱచలేదు.

వసంతరాయలు తల్లడిల్లి పడుచుండినది, సీతారాముని చేయి గట్టిగాఁ బట్టుకొని నిలుచుండెను; కన్నులు పెద్దవి చేసి నోరు తెఱచుకొని కనుబొమలెత్తి, తెప్ప వేయకఁ జూచుచు, "హాఁ! నిజమే!" అని యనుచుండెను.

"ఔను మహారాజా!" అనెను సీతారాముఁడు.

కొంచెమునే పూరకుండి వసంతరాయులు "సీతారామ్!" అనియనెను.

సీతారాముఁడు—"మహారాజా!"

వసంతరాయులు—"అల్లైన తాత యిప్పు డెక్కడ?"

సీతారాముఁడు—"ఖైదులో మహాప్రభూ!"

వసంతరాయులు తలవంచుకొనుచు నిలుచుండెను. ఉదయాదిత్యుఁడు కారాగారమున నున్నాఁడనుమాట అతని తలలో నిలువకున్నది. ఎంత యత్నించినను నూహింపఁజాలకున్నాఁడు. మఱియొకనిమిష మూరకుండి "సీతారామ్!" అని మరల ననెను.

సీతారాముఁడు—"ఏమి సెలవు మహారాజా!"

"అల్లైన తాత యిప్పు డేమి చేయుచున్నాఁడు!"

"మఱే మేమి చేయగలఁడు, ఖైదులో కాలంపుచ్చుచు-న్నాఁడు"

"అందఱును గలిసి యతనిని ఖైదులో పెట్టి తాళము-వేసిరా?"

"చిత్తము మహాప్రభూ!"

"ఎవ్వరును నతనిని ఒకమాఱైనను బయటికి రానీయరా?"

"లేదు రానీయరు మహారాజా!"

"ఒక్కఁడే ఖైదులో కాలంపుచ్చుచుండునా?"

ఈప్రశ్నలు వసంతరాయులు తనలో తాననుకొను-చున్నవి, విశేషించి ఎవ్వరినిఁ నడిగినవి కావు సీతారాముఁడా

మాట గ్రహింపఁజాలక "ఔను మహారాజా," "లేదు మహాప్రభూ" అని యుత్తర మిచ్చుచుండెను.

"తాతా నీవు నాదగ్గఱకు రారా నాయనా! నిన్నెవ్వరును పోల్చుకొనలేకుండిరి!" అని వసంతరాయ లనెను చివరకు.



## ఇరువది యొనిమిదవ పరిచ్ఛేదము

ఎవరి యాజ్ఞయు లక్ష్యము చేయక వసంతరాయలు మరునాఁడే బయలుదేఱి యశోహరమునకు వచ్చెను. వచ్చి తిన్నగ ప్రాసాదాంతఃపురములోనికిఁ బోయెను. హఠాత్తుగ తాతయ్య కనఁబడుటవలన విభకేమియు బోధపడలేదు, కొన్ని నిమిషములవఱకు నేమిచేయవలెనో తెలియక చూచుచున్న-దానివలె నుండెను—నోటినుండి మాటలేదు, కదలిక మెదలిక నిలిచియుండెను, కనులలో విస్మయమును ముఖమున నా-నందమును గానఁబడుచుండెను. కొంచెమునకే పిమ్మట నిలువనుండి తాతయ్య కాళ్లఁ బట్టుకొనినది, తాతయ్య [illegible] లేపికొన్నను.

వసంతరాయ లేకాగ్రచిత్తముతో విభను చూచుచు "విభా!" అనెను, "విభా!" అనుమాట తప్ప మఱియేమియును తాతయ్య నోటివెంటరాలేదు. సీతారాముఁడు చెప్పినది నిజము-కాకపోవచ్చుననునాశ కొంచెముండెను కాఁబోలు తాతయ్య మనస్సునకాని స్పష్టముగ ప్రశ్నించినచో నిజము బయలుపడి-పోవునని భయపడుచుండెనేమో! ఆప్రశ్నకు విభ జబాబీయవలెనని యతనికోరిక కాదు. కనుక నతఁడతిభీతితో విభముఖము చూచుచు, "విభా" అనిమాత్రము ప్రశ్నించెను; కనుకనే యతఁడేకాగ్రచిత్తముతో విభముఖమును జూచుచుండెను. విభ అదియెఱుఁగును, కనుకనే తాతయ్యప్రశ్న కుత్తరమీయలేక

పోయినది. తాతయ్యను జూచినతోడనే యామెలోఁబుట్టిన-
యానంద మంతలో మాయమైపోయినది; పూర్వము తాతయ్య
అచ్చటికివచ్చురోజు లామెకు జ్ఞప్తికివచ్చినవి. ఆహా, ఎం
యానంద మాకాలది ! ఉత్సవమువలె నుండెను తాతయ
ఎప్పుడువచ్చినను. సురను వేళాకోళము చేయుచుండును, విభ
నప్పుచు దగ్గఱకూర్చుండును, అన్నయ్య శాంతస్వరూపుఁడై
తాతయ్యపాట విని యానందించుచు ప్రక్కను కూర్చుండును.
నేఁడు తాతయ్య వచ్చియున్నాఁడు, కాని తాతయ్య
యొద్ద కెవ్వరును లేకున్నారు; ఆయంధకార ప్రపంచమున
నుండువిభ యొక్కతెమాత్రము వచ్చినది తాతయ్యదగ్గఱకు,
ఆసుఖపూరితమైన ప్రపంచము ముక్కలై పోఁగా మిగిలినది
ఈవిభ యొక్కతెకదా! తాతయ్య వచ్చినతోడనే యానందధ్వ-
నితో నిండియుండు నాసురమగని నేఁడిట్లున్న దేమి! అంధకార-
మయము! ఆగదిలో నెవ్వరిబ్బయును లేదు; 'అంతయును శూన్యము'
అనుచున్నట్లున్నది తాతయ్యను జూచినతోడనే ఆగదియేడ్చు
నాయనిపించుచున్నది. ఎట్టిప్రవృత్తి నాశించియేమో తెలియదుగాని
వసంతరాయలు లోనుండి తాతగారిగదిదగ్గఱకుఁ బోయెను. కొంచెమునే
పచ్చట నిలిచి చూచి, లోనికివంగి నాలుగువైపుల నొకసారి
చూచెను. తత్క్షణమే మరల వెనుకకుతిరిగి గుండెఁ బద్దలుచే-
యుకంఠముతో "విభా, ఈగదిలో నెవ్వరును లేరా!" అనెను.

విభ యేడ్చుచు "ఎవరును లేరు తాతయ్యా" అని
యనినది

"మునుపుండువారెవ్వరును లేరు," అని లోపునుండి
ఆగది యనుచుండునటుండెను.

వసంతరాయలు చాలసేపేమియు మాటాడక యూరక నిలుచుండెను, చివరకు విభ చేయిపట్టుకొని మెల్లమెల్లగఁ బాడు-కొనెను.

వసంతరాయలు ప్రతాపాదిత్యునియొద్దకుఁబోయి యిట్లు వేఁడుకొనసాగెను—"బాబూ ప్రతాప్, ఉదయుని మీ రేల కష్టపెట్టుచున్నారు, వాఁడు మీ కేమి చేసినాఁడు? మీ కంటికి వాఁడు మాటిమాటికి నపరాధియగుచు, వానియెడల మీ కనిష్టముగనున్నచో వాని నీముసలివాని చేతి కిచ్చివేయుఁడు. నేను తీసికొని వెళ్లిపోయెద, నాదగ్గఱనే యుంచుకొని, మీకు మఱి కనఁబడకుండఁ జేసెదను.

ప్రతాపుఁ డోర్పుతో వసంతరాయలు చెప్పినదంతయు విని యుట్లనెను—"బాబయ్యగారూ, నేను చేసినదేదో బాగుగ యోచించి చేసితిని, ఈవిషయములో మాత్రము నే నెఱుఁగునంత మీ రెఱుఁగరు. మీ రుపదేశించుటకు వచ్చినా-రుగాని మీయుపదేశము వ్యర్థమగును."

వసంతరాయలు ప్రతాపాదిత్యునికి దగ్గఱగవచ్చి అతని చేయిపట్టుకొని యిట్లనెను—"నీకు జ్ఞప్తిలేదా ప్రతాప్, చిన్నప్పుడు నిన్ను నాయొడిలో నుంచుకొని పెంచి పెద్దవానిని జేసినాను! అన్నయ్య నిన్ను నాచేతి కప్పఁజెప్పి మృతినొందిన నాఁటినుండి నిన్నొకనాఁడైనను కష్టపెట్టితినా? కేవల మసహా-యుఁడవై నీవు నాచేతిలో నుండియున్నప్పుడు తండ్రిలేని వా-నివలె నీకొక్కనాఁటికైన ననిపించినదా? నే నెట్టియపరాధము

చేసితినో చెప్పుము ప్రతాప్, నన్నీవృద్ధవయస్సున నిట్లు కష్ట-పెట్టుచుంటివిగదా! నేను నిన్ను పెంచి పెద్దవానిని చేసితిని గనుక నాఋణము తీర్పుమని కాదు నేను చెప్పునది—నిన్ను పెద్దవానినిఁ జేయుట మాయన్న ప్రేమ ఋణముతీర్పఁగోరఁ ప్రయత్నించుట, నిన్ను బాకీతీర్పుమని నే నడుగలేదు, ఎన్నఁడును నడుగను, ప్రార్థించి కేవలము నిన్న డుగుకొనుచున్నాను, నాప్రార్థన సఫలము చేయవా?"

వసంతరాయలు కనుల నీరుపెట్టుకొనెను. ప్రతాపుఁడు రాతివిగ్రహమై కూర్చుండెను.

కొంతసే పూరకుండి వసంతరాయలు తిరిగి ప్రారంభించెను—"నామాట వినవా ప్రతాప్? నాప్రార్థన నంగీకరింపవా? నే నడుగుదానికి ఉత్తరమీయవా!" మఱికొంతసే పూరకుండి పెద్దనిట్టూర్పు విడిచి, "సరియే, నాకు మఱియొక్క చిన్నకోరిక యున్నది, అదియైనను నెరవేర్పుము—ఉదయపు నొకమాఱు చూడవలెనని యున్నది, నన్నెవ్వరును అడ్డుపెట్టకుండునట్లాజ్ఞాపింపుము"

ప్రతాపుఁడు దానికైనను ఒప్పుకొనలేదు. తనయిచ్ఛకు విరుద్ధముగ నుదయాదిత్యునియెడల ననురాగము వసంతరాయలు చూపించుట ప్రతాపునకు రుచింపలేదు. లోకులు తనపైన మోపుచుండునపరాధ మధికమగుచున్నకొలఁది, ప్రతాపుని ప్రవర్తన వంకర యగుచుండును.

వసంతరాయ లంతఃపురములోనికి మరల పోయెను, అతనిముఖము వాడిపోయినది, ఆముఖముచూచి విభకు

అపరిమితదుఃఖము వచ్చినది. విభ వసంతరాయలని చేయిపట్టు-కొని "తాతయ్యా నాగదిలోనికి రమ్ము," అనెను, తాతయ్య విభతోఁ గలసి గదిలోనికి మెల్ల మెల్లగఁబోయెను. తాతయ్యను గూర్చుండనిచ్చి ఆయన జుట్టులో వ్రేళ్లనుబెట్టి దువ్వుచు, "తాతయ్యా, నీపండువెండ్రుకలు తీయనిమ్ము," అనెను. "ఆ పండువెండ్రుక లిక లేవమ్మా విభా! అటువంటివన్నియు వయస్సుముదురనన్నాళ్లే, అప్పు డడుగుచుంటిని పండువెండ్రు-కలు తీయుమని, ముసలివాఁడ నైపోతి నిప్పుడు, పండువెండ్రు-కలు మఱిలేవు," అని వసంతరాయ లనెను.

విభముఖము వాడిపోయినది, కనులనీరు గిరగిర తిరుగు-చుండెను, తాతయ్య ఆసంగతి కనిపట్టి విభను దగ్గఱకుఁ దీసి-కొని దువ్వుచు నిట్లనెను.—"రమ్మమ్మా విభా రమ్ము, పండు వెండ్రుకలు నాలుగు తీయుచున్నగాని, కాని పండువెండ్రుకల సరబరాయి నేనిక చేయలేనమ్మా ముసలివాఁడ నైపోయినాను, మీరు మఱియొకతలను చూచుకొనుఁడు, నాఉద్యోగము విడిచిపెట్టుకొనుచున్నాను, ఇదియే నాదరఖాస్తు!"

ఆసమయమున దాసి యొకతెవచ్చి "మహారాణియమ్మ మిమ్మును దయచేయుమనుచున్నారు. మహాప్రభూ," అని చెప్పెను.

వసంతరాయలు రాణిగదిలోనికి వెళ్లెను.

రాణి వసంతరాయలకు ప్రణామము చేసినది, "ఆయుష్మతీ-భవ," అని వసంతరాయ లాశీర్వదించెను.

రాణి, "అట్టియాశీర్వాదము మఱి యెన్నఁడును చేయ-కుఁడు మామయ్యా, నా కిప్పుడు చావే బ్రతుకగును," అనెను.

వసంతరాయలు—"నారాయణ నారాయణ! అటువంటి మాట నోట రానీయకూడదు."

రాణి—"మరి యేమనుమనెదరు, మామయ్యా! నాకు శనిపట్టినది నాసంసారమునకు శనిపట్టినది"

వసంతరాయలకు మిక్కిలి బాధకలిగినది.

రాణి—"విభమాట అనుకొనుసరికి నానోటికి అన్నము పెళ్ళకున్నది. అడిగినయెడల నేమియు చెప్పదు, దినదినము కృశించిపోవుచున్నది. ఏమిచేయవలెనో నాకేమియు తోఁచ-కున్నది.

వసంతరాయలమనస్సు కొట్టుకొనిపోవుచుండెను, "చూ-డుఁడు మామయ్యా కొంప ముంచు జాబొకటి వచ్చినది," అనుచు అతనిచేత పత్రమొకటి పెట్టెను.

వసంతరాయ లాపత్రము చదివియు జదువకమునుపె రాణి యేడ్చుచు మొదలుపెట్టినది— "దేనిని జూచి నన్ను సుఖపడుమందురు చెప్పుఁడు. నాబిడ్డఁ డుదయుఁడేమియు నెఱుఁ గఁడు, అట్టివానిని మహారాజుగారు—వానిలో రాజలక్షణా లేమియు లేవట, ఐనను గర్భమున భరించితిని నాబిడ్డఁడే కదా, వాని నొకసారి చూచుటకైనను నాకు సెలవీయరు!" కొన్ని-దినములనుండి రాణి యేమాట యెత్తినను వానిలోని కుద-

యునిమాట వచ్చిమూరుచున్నది. ఆదుఃఖము రాత్రి గాని పగ-లుగాని ఆమెను వదలకున్నది.

జాబుచదివి వసంతరాయలు నిశ్చేష్టుఁడయ్యెను, ఏమియు మాటలాడలేక యక్కడనే చతికిలఁబడి చేతులతో తలతడ-వుకొన నారంభించెను. కొంతసేపయినతరువాత "ఈజా బెవ్వ-రికిని చూపలేదుగదా?" అని రాణి నడిగెను.

రాణి "ఈజాబుమాట తెలిసినయెడల మహారాజుగారు నిలువనిత్తురా? విభ కీసంగతి తెలిసినయెడల ఆమెప్రాణములు నిలుచునా?"

వసంతరాయలు—"మంచిని చెపితివమ్మా! ఈజాబిక-నెవ్వరికిని కనఁబఱచకుమమ్మా. విభను త్వరలో నత్తవారియిం-టికి పంపునేర్పాటు చేయుము, మానావమానములసంగతి యాలోచింపకుము."

రాణి—"నేనును అలాగుననే యనుకొంటిని, మర్యాద-యాలోచించుట కిది కాదు సమయము. నాబిడ్డ సుఖముగ నున్న నదియే నాకు చాలును కాని అక్కడకుఁబోయినతరువాత వారువిభను కష్టపెట్టుదురేమో యని నాకు భయమగుచున్నది"

వసంతరాయలు—"విభను కష్టపెట్టుదురా! ఆమెహృద-యమున నుండునది ఎక్కడకుఁబోయిన నక్కడనే యాదరము-పొందును. అట్టిమహాలక్ష్మి మతియెక్కడనైన గలదా! అల్లుఁడు

మీామీాఁద కోపగించి వ్రాసినజాబది. మీా రామెను నచ్చటికి పంపఁగానే ఆకోపము చల్లారిపోవును." వసంతరాయల సరళ హృదయమునకు బోధపడిన దిదియే, రాణికూడ నట్లే యనుకొనెను.

"విభను బంపుమని కోరుచు నల్లుఁడు జాబు వ్రాసెనని ఇంటిలో నలుగురికి తెలియఁజేయుము, అట్లైన వెళ్లుటకు విభ కేవిధమైన నభ్యంతరము నుండదు," అని వసంతరాయలు రాణికి సలహా యిచ్చెను.

---

## ఇరువది తొమ్మిదవ పరిచ్ఛేదము.

సాయంకాలమైనది, ముందింట వసంతరాయ లొంటరిగా గూర్చుండియుండెను, సీతారాముఁడు వచ్చి ఆయనకు దండము పెట్టెను.

"ఏమి సీతారామ్, ఏమిసంగతి?"

"అదియంతయుఁ దరువాత చెప్పెదను, మొదట మీరు నాతో రండు."

"ఎక్కడికి సీతారామ్? ఏల?"

దగ్గఱకు వచ్చి సీతారాముఁడు వసంతరాయల చెవిలో నేమో చెప్పెను వసంతరాయలు కనులు పెద్దవిచేయుచు, "నిజమే!" అని ఆశ్చర్యపడుచు నడిగెను.

"అవును మహాప్రభూ!" అనెను సీతారాముఁడు.

వసంతరాయలు లోలోపున ఆందోళనపడుచు, "ఇప్పుడే రావలెనా?" అని యడిగెను.

"చిత్తము మహాప్రభూ!"

"ఒక్కమాఱు విభను జూచి రావచ్చునా?"

"మఱి వ్యవధిలేదు మహారాజా!"

"ఎక్కడికి పోవలెను?"

"నాతో రండు, నేను తీసికొనిపోయెద."

వసంతరాయలు లేచి నిలుచుండి, "ఒక్కమాఱు విభను, చూచి వచ్చిననేమి?" అని యడిగెను.

"వద్దు మహారాజా, ఆలస్యమైనచో కోపముసు గును." అని సీతారాముఁడనెను.

"అట్లైన వెళ్లను" అని వసంతరాయ లనెను; ఇద్దఱును కలసి బయలుదేఱిరి; నాలుగడుగులు వేసిన తరువాత, "ఒక్క నిమిషమాలస్యమైన ప్రమాద మేమున్నది?" అని మరల వసంతరాయ లడిగెను.

"ఆలస్యమైన నాపద సంభవింపవచ్చును మహారాజా," అనెను సీతారాముఁడు.

దుర్గానామస్మరణము చేయుచు వసంతరాయలు రాజ-ప్రాసాదమును విడిచి బయటికి వచ్చెను.

వసంతరాయలు వచ్చినట్లుదయాదిత్యుఁ డెఱుగనే యెఱుగఁడు. ఆయన వచ్చినట్లు విభ అన్నతోఁ జెప్పలేదు. తాతయ్య అన్నను జూచుటకు సెలవుదొరకదని విభ యెఱుఁ-గును, అట్టి యవస్థలో తాతయ్యవచ్చిన ట్లన్నయ్యకుఁ దెలియఁ జేయుట అన్న దుఃఖమును వృద్ధిఁజేయుట యని విభ తలఁచినది.

చీఁకటిపడినతరువాత విభ అన్నయ్యయొద్ద సెలవుపుచ్చు-కొని కారాగారము విడిచి బయటికి వెళ్లినది. దీపము దగ్గఱ-పెట్టుకొని ఉదయాదిత్యుఁడు సంస్కృతగ్రంథ మొకటి చదువు-చుండెను. కిటికీలోనుండి వచ్చుగాలివలన దీపము కదలం-

చుండెను, అక్షరములు బాగుగాఁ గనఁబడకుండెను. పురుగులు వచ్చి దీపముమంటలోఁ బడుచుండెను, దీపము ఘుస్సుఘుస్సున లేచి ఆరిపోఁబోవుచుండెను. ఇంతలో నొకమారు గాలి జోరుగా కొట్టి దీపమారిపోయినది. ఉదయాదిత్యుఁడు పుస్తకము మూసి మంచముపై కిపోయి కూర్చుండెను. ఒక్కొక్కటిగ నెన్నియో సంగతులతనికి జ్ఞప్తికివచ్చుచుండెను. విభమాట యనుకొన నారంభించెను. నేఁడు విభ కొంచెమూలస్యముగ వచ్చినది; కూరమూలుకింక కొంచెము త్వరగాఁ వెళ్లిపోయినది. నేఁడా మెముఖము ప్రతిదినమునకంటె వాడియున్నది. ఆమాటయే ఉదయుఁడు తనలో తానను కొనుచుండెను ఈలోకములో నతనికి విభతప్ప మఱియెవ్వరును లేరనిపించినది. రోజంతయు విభతప్ప మఱియెవ్వరు నతనికిఁ గానరారు, అతఁడు యోచించు-చుండఁదగినది విభయొక్కటే, అతఁడు యోచించుచుండవలసి-నది విభయొక్కటే! విభయాడు ప్రతిచిన్నమాట, ఆమె ప్రతి-చిన్నపని ఉదయుఁడు తనహృదయమున దాచియుంచును, దప్పికగొనినవాఁడు తనకుదొరకిన పానీయమున నొక్కబిం-దువునైనను ననుభవింపక విడిచిపెట్టఁడు, అట్లే చెల్లెలి ప్రీతిని తెలియఁజేయు ప్రతి చిన్నవస్తువును నుదయుఁడు మనసార అను-భవించుచుండును కనుకనే నేఁడీ చిన్నచీఁకటిగదిలో నొంటరిగఁ గూర్చుండి ప్రేమమూర్తియగు నావిభనుగుఱించియే యో-చించుచుండెను. "ఆమెముఖము మాడియున్నది" ఆయంధ-కారమధ్యమునుండి ఒకమా ఱితట్లనుకొనెను—"విభకు

క్రమక్రమముగ విసుగుపుట్టుచున్నదేమో! విచారించుచు చీఁకటిగదిలో నొంటరిగా బసచేసికొనియు నన్ను సేవచేయుచు కాలముగడుపుట కష్టముగ నున్నదేమో! రాను రాను నే నామెసుఖమున కడ్డుపడుచున్నానని యనుకొనునా? నేనామె సంసారపథమున కడ్డుగానున్న ముండ్లకంపయని యనుకొనునా? నేఁడు ఆలస్యముచేసి వచ్చినది. రేపింతకంటె నాలస్యముగ-వచ్చునేమో! మఱికొన్ని దినములైనతరువాత—రోజంతయు నేను కనిపెట్టుకొని యుండవలసివచ్చునుగాఁబోలు; మధ్యాహ్నమగును, సాయంకాలమగును, రాత్రిపడును, ఐనను విభ రాదు—ఆమరునాఁటినుండియుఁ అసలే రాదేమో!" ఇట్లు మనస్సునను దట్టుచున్నకొలఁది లోపల దుఃఖ మధికమగుచుండెను. శూన్యమగు ప్రపంచమున తానొక్కఁడే యుండునట్లు ఉదయుఁడు భవిష్యత్తు నూహించుకొనుచుండెను. తనసుఖమును నాశనముచేసిన యన్నను విభ యను రాగవిహీనమైన నేత్రములతోఁ జూచుదినము వచ్చునని అతనియూహకుఁ దట్టినది. ఊహ తట్టినంతమాత్రాన నతని హృదయమున నాందోళన పుట్టుచుండెను. "నేనెంత స్వార్థపరుఁడను? ఆమెయెడల నా కనురాగమున్నది గదా? యని నేనామె కెంతయుపకారము చేసితిని! పరమశత్రువైన నామె కట్టియుపకారము చేయలేఁడే!" అని యుదయునకుఁ దోఁచుచుండెను. "ఇఁక విభమీఁద నే భారమంతయు మోపియుండను," అని మాటిమాటికి శపథముచేయుచుండును. కాని విభ తన్ను వదలిపోయినదని యూ-

హించుకొనునంతమాత్రమున నతనిబల మెగిరిపోవుచుండును; నడుసముద్రమునబడి కొట్టుకొనుచున్నవానివలె నతఁడగు-చుండును; నీటిలోఁబడి మునిఁగిపోవుచు చావ సిద్ధముగా-నున్నవానివలె విభ్రమూహించుకొని యామెను గట్టిగాఁబట్టు-కొని తనప్రాణములను గాపాడుకొనఁ బ్రయత్నించుచుండును.

ఉదయాదిత్యుఁడు తనలో దానిట్టి యాందోళనపడు-చుండు సమయమున, "అగ్ని—అగ్ని" అని బయటినుండి కేకలు-వినఁబడినవి. ఉదయునిగుండె కొట్టుకొన నారంభించినది. వం-దలకొలఁది గొంతులొక్కసారిగ వినఁబడుచున్నవి. బాధ-తోను, భయముతోను వేయుచుండు నానావిధములైన కేక-లును, పరుగెత్తుచుండు అడుగులచప్పుడును వినఁబడుచుం-డెను. ప్రాసాదమునకు సమీపమున నెక్కడనో నిప్పుపుట్టినదని ఉదయాదిత్యుఁడనుకొనెను. బయట గందరగోళ మిక్కిలి-యున్నది, ఉదయుఁడు మనస్సులో కలతఁజెందుచున్నాఁడు, హఠాత్తుగ మెదుగక తలుపుతెరచి ఎవరో ఆచీఁకటికొట్టులో ప్రవేశించిరి ఉదయుఁడులికిపడి, "ఎవరది?" అని యనెను.

"నేను, సీతారామ్, మీరు బయటికి రండు మహా-రాజా!" అని జబాబు వినఁబడినది

ఉదయుఁడు—"ఏల" అని యడిగెను.

సీతారాముఁడు—"ప్రాసాదమునకు నిప్పంటుకొన్నది, మహా-రాజా, మీరు తత్క్షణము బయటికి రావలెను," అనుచు నించు మించుగ నాయన నెత్తుకొని బయటికి మోసికొనిపోయెను.

చాలదినములైనతరువాత ఉదయుడు నేడు బహిః-ప్రపంచములోనికి వచ్చెను. నలుదిక్కులను వ్యాపించియున్న ఆకాశము మీద కనబడినది, గాలి తనవక్షమును విరివిగ-జేయుచున్నదా యని అతనికి అనిపించినది. ముఖమునకడ్డుగ అన్నివైపులను నుండుగోడలు పీడిపోయినవి. ఆ చీకటిరాత్రి, మీదనుండి లెక్కలేనినక్షత్రములు చూచుచుండ ఆ లేత-గడ్డిపై నాబయలున నిలుచుండియున్న ఉదయాదిత్యునిహృద-యమును బట్టరానియానంద ముదయించినది. ఆనందగద్గదకంఠుడై కొంతసే పట్లూరకయుండి తరువాత సీతారాముని 'ఏమిచేయ-వలెను, ఎచ్చటకు బోవలెను?' అని యడిగెను. అనేకదినము లాచిన్నగదిలో ఖైదీగానుండి హఠాత్తుగ నేడా బయలులోనికి వచ్చుటవలన ఉదయాదిత్యునకు తాను కేవల మసహాయుడ-నని అనిపించి, "ఏమి చేయవలెను, ఎచ్చటకు బోవలెను?" అని సీతారాముని నడిగెను. "రండు నాతో రండు" అని సీతారాముడు పలికెను

ఇవతల అగ్ని విస్తారమగుచుండెను. ఆనాడు రెండవ-పూట పురజనులలో కొందఱు యజమానులతో నేదో పని-చేసికొనవలెనని వచ్చి ప్రాసాదప్రాంగణమున నందఱు నొక్క-చోట చేరియుండిరి. ఇండ్లు కాలుచున్నవని మొదట కేకలు వీరినోట వచ్చినవే పహారావాం ప్రక్కగాను కారాగారమున కంటికట్టియుండిన యిండ్లవరుస యొకటియుండెను—వానిలో-నే పహారావాం ప్రపంచములు, పీటలు, పాత్రసామాను, బట్టలు పాతలు మొదలగున వన్నియు నుండును. "అగ్ని అగ్ని" అని

కాదు—నాయిల్లు వదలుకొని నన్నిప్పుడు రమ్మనుచున్నావా?" ఇట్లనుచు భటు లాగుంపులో మాయమగుచుండిరి.

ఈరీతిని మాటిమాటికి ప్రతిహతయగుచు నాయాఁడుది ఉగ్రస్వరూపిణి యయ్యెను. చివరకు తనచేతికి దొరకిన వాని నొకనిని గట్టిగాఁబట్టుకొని ఇట్లనసాగెను— "మీ ముఖములు తగులబెట్టా! మీకు కండ్లు లేవా? రాజుగారి యన్నము తినుచుండి ఆమాత్రము జ్ఞాన మక్కర లేదా! రేపు రాజుగారితోఁ జెప్పి గోతిలో మోకాలిలోతు ముండ్లలో మిమ్ములను పాతిపెట్టించి మఱి వదలెదను—యువరాజు పాఱి పోయినాఁడు

"మంచిపని చేసినాఁడే! అయిన నీ కేమైనదే?" అనుచు వాఁడుదానిని నాలుగుతిట్లుతిట్టి బాగుగ బుద్ధిచెప్పెను—ఇండ్లకు నిప్పుముట్టించినవారిలో వీఁడొకఁడు. తిట్లుతిని యారమణి భీషణాకారము ధరించినది — క్రుద్ధవ్యాఘ్రినేత్రములవలె నాసికలు మెఱయుచుండెను, జుట్టు పైకి పొడుచుకొని వచ్చుచుండెను. పటపట పండ్లు కొఱుకుచునున్న ఆమెముఖముపై నాయగ్నిజ్వాలల కాంతిపడి ఆమె కొకపిశాచిరూపము వచ్చినది. ముందుచు నెదుటనుండు కొఱకంచు నొకదానిని చేతఁబుచ్చుకొనినది ఆపిశాచి— చేయి కాలుచున్నను దానిని బాఱవేయక తన్ను తిట్టినవానివెంట పరుగెత్తినది; ఎంత ప్రయత్నించినను వానిని బట్టుకొనలేక, తుద కాకొఱకంచు వానివైపు విసరినది.

—

## ముప్పదియవ పరిచ్ఛేదము.

యువరాజును దోడ్కొని సీతారాముఁడు కాలువ-యొడ్డునకు వచ్చెను. అక్కడ పెద్దపడవ యొకటి కట్టియుం-డెను. ఆపడవయెదుటకు వచ్చి యిద్దఱును నిలుచుండియుం-డిరి. వారిరాకనుజూచి పడవలోనుండి యెవరో బయటికి-వచ్చి "వచ్చితివా తాతా?" అని యనెను. ఉదయాదిత్యుఁడదివినఁగానే ఉలికిపడెను—చిన్నప్పటినుండి తాను వినుచుం-డినకంఠ మిప్పు డతఁడు వినినది; అతని బాల్యస్మృతులతోను, యౌవనసుఖదుఃఖములతోను కలసియున్నకంఠ స్వరమది; ప్రపంచములో నేరవంతసుఖము, ఆనందము అతనికి మిగిలియు-న్నవో వానితో నేకమైయున్న స్వరమది! అతఁడు ఖైదులో-నుండురోజులలో రాత్రివేళ నప్పుడప్పుడు నిద్రలేక కూర్చుండి యుండుసమయమున కలలో వినఁబడువేణువువలె కంఠస్వర మొకటివిని యతఁడులికిపడి లేచుచుండెను—ఇప్పు డుదయుఁడు వినినది ఆకంఠమే! ఉదయునివిస్మయము పూర్తిగ పోకమునుపే వసంతరాయ లతనిదగ్గఱకువచ్చి అతనిని కౌఁగిలించుకొనెను. ఇద్దఱికనులు నీళ్లతో నిండిపోయినవి, ఇద్దఱును నాగడ్డపై నచ్చటనే కూర్చుండఁ బడిపోయిరి. చాలసేపైనతరువాత ఉదయాదిత్యుఁడు "తాతయ్యా!" అనెను. "ఏమి తాతా?" అని వసంతరాయలు ప్రత్యుత్తరమిచ్చెను—మఱిమాటలు లేవు.

మఱికొంతసేపైనతరువాత ఉదయాదిత్యుఁడు కనులు పూర్తిగ విప్పి మొదట నాలుగువైపులను చూచెను, తరువాత ఆకా-శము వంక కనుల నెత్తెను. తుదకు వసంతరాయలముఖము-వైపుచూచుచు, "తాతయ్యా, నాకు నేఁడు స్వాతంత్ర్యము దొరకినది, నీవు దొరకితివి, నేను కోరఁదగిన దింకేమున్నది? ఈసమయ మెంతసేపుండును తాతయ్యా?" అని యడిగెను.

మఱికొంచెముసేపైనతరువాత సీతారాముఁడు దగ్గఱకు వచ్చి "పడవలోనికి రండు యువరాజా!" అనెను.

యువరాజు—"పడవలోని కేల?"

"ఇక్కడనుండినయెడల వహారావాండ్రు వత్తురు."

యువరాజాశ్చర్యపడుచు నప్పుడు వసంతరాయలను "మనము పాఱిపోఁబోవుచున్నామా?" అని యడిగెను

వసంతరాయ లుదయాదిత్యుని చేయిఁబట్టుకొని ప్రత్యు-త్తరమిచ్చెను. "ఔను, నాయనా, నేను నిన్ను దొంగలించుకొని పోవుచున్నాను. ఈదేశమునందుండువారివి పాషాణహృద-యములు, నీయెడలనను రాగము లేదు వారికి, ఇది వ్యాఘ్ర దేశము, అందుండు హరిణశిశువవు నీవు. నిన్ను తీసికొనిపోయి నాహృ-దయమధ్యమున దాచియుంతును. అచ్చటి కెట్టియాపదయు-రాదు" ఇట్లనుచు ఉదయుని ఈదయావిహీనమగు ప్రపం-చమునుండి తీసికొని ప్రేమరాజ్యమునఁ గట్టిపెట్టియుంచఁగోరు-చుండునట్లు వసంతరాయ లతనిని దగ్గఱకు లాగుకొని గట్టిగా పట్టుకొనెను.

ఉదయాదిత్యుఁడు చాలసే పాలోచించి, "తాతయ్యా, నేను పాఱిపోవఁజాలను," అనెను.

వసంతరాయలు— "ఏమి తాతా! ఈముసలివానిని మఱచిపోతివా?"

ఉదయుఁడు—"నేను నాన్నదగ్గఱకు పోయి ఆయన-పాదములపైఁబడి క్షమింపవేఁడుకొనెదను నేను రాయగడు-నకు పోవుటకు నాన్న అనుమతి నీయవచ్చును."

వసంతరాయలు భీతుఁడగుచు—"నామాట వినుము తాతా, అచ్చటకు పోవద్దు, నీప్రయత్నము నిష్ఫలమగును," అనెను.

"అట్లైన నన్ను ..దులోనికే మఱలపోనిమ్ము," అని నిట్టూర్పువిడుచుచు ననెను.

వసంతరాయలు లతనిచేతులు గట్టిగా బట్టుకొని, 'ఎట్లు-పోఁగలవో పొమ్ము చూతము, నేను నిన్ను విడువను,"అనెను.

ఉదయాదిత్యుఁడు— "ఈయభాగ్యుని దగ్గఱనుంచు-కొనిన నాకదను పిలిచి తెచ్చుకొనుటయే తాతయ్యా! నేనుండు చోట ఒక యణుమాత్రమైనను శాంతియుండనేరదుకదా!"

వసంతరాయలు—"నీవలన విభకూడ కారావాసిని యై పోయినది తాతా. ఇంత చిన్నవయస్సునసే యామె సుఖము-నకు నీళ్లధారయా? అట్లగుచుండుట చూచి నీ వూరకుండఁ గలవా?"— ఇట్లనుచుండు వసంతరాయల నేత్రములనుండి అశ్రుధారలు పడుచుండెను.

"ఔను తాతయ్యా నీవనునది నిజమే! పోదము పద, అప్పైన" అని తొందరతొందరగ ఉదయుండనెను. తరువాత సీతారామునివైపు చూచి, "కోటలోనికి మూండుజాబులు పంపవలసియున్నది," అనెను.

సీతారాముండు—"పడవలోనే కలము సిరా యున్నది, తెచ్చియిచ్చెదను త్వరగా వ్రాయుము యువరాజా, వ్యవధి లే-దంతగా."

క్షమింపుమని వేండుకొనుచు ఉదయుండు తండ్రి కొక-జాబు వ్రాసెను

తల్లి కిట్లు వ్రాసెను—"అమ్మా, నన్ను కని నీవెన్నండును సుఖింపలేదు. కాని ఇంక నీవు నిశ్చింతగ నుండవచ్చును నేను తాతయ్యయొద్దకు పోవుచున్నాను. అచ్చట నేను సదా సుఖముగా నుందును, ఎల్లప్పుడు ననురాగమున మునింగి-యుందును నీ కెట్టిదుఃఖమును నుండగూడ దింక."

విభకు:—

చిరాయుష్మతీ భవ,—నీకేమివ్రాయంగలనమ్మా, జన్మజన్మ-ములం నీవు సుఖముగనుండుము. అత్తవారియింటికి వెళ్లి సుఖ-ముగ కాంపురముచేయుచు, నీసమస్తదుఃఖములను సకలకష్ట-ములను మఱచిపొమ్ము!" వ్రాయుచుండ ఉదయునికనులు నీళ్లతో నిండెను.

ఈమూండుజాబులను సీతారాముం డొకపడవవాని చేతి కిచ్చి కోటలోనికిం బంపెను. అందఱును పడవనెక్కిరి—ఆసమ-

యమున నెవతెరో యాపడవవైపు పరుగెత్తుకొనివచ్చుచుం-
డుట అందఱకును కనఁబడినది ఆమెను జూచి సీతారాముఁ
డులికిపడి, "ఇదిగో ఆమాయలాడి, ఆమంగళకారి, ఆపిశా-
చివలె నున్నదే!" అనెను అంతకంతకు దగ్గఱపడుచుండిన
యావిగ్రహము రుక్మిణిదే! ఆమె జుట్టు విరఁగఁబోసికొని యు-
న్నది, ఆమె పైట జారిపోవుచున్నది, కనులనుండి నిప్పుకణ-
ములు బయటపడుచున్నట్లుండెను నాటినాటికినామె వాంఛల
కడ్డుగ నేదో వచ్చుచుండుటచేతను, పగతీర్చుకొనవలెనను-
కోరిక ఆమెలో నెంత తీవ్రముగనున్నను అది సఫలము కాక-
పోవుటచేతను, లోపున పుట్టుచుండు బాధ ఆమెను ఇటునటు
నూపివేయుచున్నది. ఎదుట నెవఁడు కనఁబడిన వానినే చీల్చి
ముక్కలుముక్కలుగఁజేసి కోపము చల్లార్చుకొనఁగోరుచు-
న్నదా యని చూచువారికి తోఁచుచుండెను.

ఇండ్లు కాలుచుండుచోట చాలతిట్లును పోట్లును తిని,
రుక్మిణి వెఱ్ఱెత్తినదానివలె కోపముతో కోటవైపునకు పరుగె-
త్తిపోయెను. తిన్నగ ప్రతాపాదిత్యుని గదిలోనికి వెళ్లవలె-
నని అనేకప్రయత్నములు చేసినది; కాని సాధింపలేకపోయినది-
పహరావాండ్రామె వెఱ్ఱిదని భావించి కొట్టి వెంటఁబెట్టుచుం-
డిరి. అప్పుడామె భరింపలేని బాధతో కోటనుండి పరుగెత్తు-
కొనివచ్చి వ్యాఘ్రివలె నుదయునిపై నుఱుకవలెనని ప్రయ-
త్నించెను. కాని మధ్యను సీతారాముఁ డడ్డుపడెను. రుక్మిణి
యాసీతారామునిపైఁబడి రెండుచేతులతో వానిని గట్టిగాఁ

బట్టుకొనెను. సీతారాముని కేకలువిని పడవవాండ్రు పరుగెత్తు-కొనివచ్చి వానిని విడిపించిరి.ఆత్మఘాతియైన వృశ్చికము సర్వాం-గములను తనతోఁకతో కుట్టుకొనుచుండునట్లు, రుక్మిణి తన-గుండె నప్పుడు గోళ్లతో చీరుకొనుచు, జుట్టును పీకుకొనుచు, "ఏమియును చేయలేకపోతిని, ఏమియు కాలేదు— నేను ప్రాణత్యాగము చేయుచున్నా నిదిగో! ఈస్త్రీహత్యా పాతకము మీదే!" అని కేకలువేయుచు ననెను. ఈశాప మాయంధకార-మున నలుదిక్కులను ప్రతిధ్వనించుచుండెను. ఇట్లు శపిం-చుచు తత్క్షణమే ఆనీటిలో దుమికిపడెను వర్షకాలమగుటచే నిండుగా పారుచుండు కాలువలో నెక్కడనో యడుగున చేరుకొనియుండును. సీతారాముని భుజమునుండి రక్తము కారుచుండెను బట్ట నీటిలో ముంచి వాఁడా గాయముపై కట్టెను. ఉదయాదిత్యునిముఖము చెమటతో నిండిపోయినది. అతనికి కాళ్లు చేతులు చల్లఁబడిపోయి మతితప్పిన ట్లయ్యెను. వసంతరాయలుగూడ దారితప్పినవానివలె నిశ్చేష్టుఁడై నిలు-చుండియుండెను. పడవవాండ్రిద్దఱు వారిద్దఱిని నెత్తుకొని-పోయి పడవపై నెక్కించి పడవను తత్క్షణమే విడిచిపెట్టిరి. సీతారామునిమనస్సున భయముపుట్టి "బయలుదేరుసమయమున నెట్టి యమంగళము జరిగినది!" అని తనలో తా ననుకొను-చుండెను.



## ముప్పది యొకటవ పరిచ్ఛేదము

ఉదయాదిత్యునిపడవ కాలువదాటి నదిని జేరఁగానే సీతారాముఁడు యువరాజునొద్ద సెలవుపుచ్చుకొని పడవ విడిచి మరల నగరమున కేగెను. వచ్చునప్పుడు యువరాజు నడిగి ఆయన కత్తిని పుచ్చుకొనెను.

ఉదయుఁడు వ్రాసిన మూఁడుజాబులును సీతారాముఁ డొకనిచేతికిచ్చి ప్రాసాదమునకుఁ బంపెను.నిజమే, కాని ఆజాబు లెవ్వరికిని నీయవద్దని వానితో రహస్యముగా నొక్కినొక్కి చెప్పెను. పడవనుండి వచ్చి సీతారాముఁ డాయుత్తరములను మరల వానియొద్దనుండి తీసికొని రాణియుత్తరమును, విభ యుత్తరమునుమాత్ర ముంచి మూఁడవయుత్తరము చించి-వేసెను.

నిప్పు మఱింత వ్యాపించినది. వింత చూచుటకు నిద్ర మాని యనేకులు వచ్చి చుట్టును చేరియున్నారు. దానివలన మంటలార్పుట మఱింత కష్టమగుచున్నది.

ఈయగ్నికాండలో సీతారామునికిఁ గూడ నొకవం-తుండెనని చెప్పుట యనవసరము. ఉదయాదిత్యునియెడల ననురాగముగల పురజనులు కొందఱు ప్రాసాదభృత్యులు కొందఱితోఁ గలసి జేసినపని యిది. అయిదారిండ్లు సాయం-కాలమప్పు డొక్కమాఱంటుకొనుట దైవికముగా జరిగినపని

కాదగ్గెన. అదేవిధముగ, ఇంతసేపార్పుచున్నను నిప్పారికూడ నారకుండుటకును కారణము లేకపోలేదు. నిప్పార్పుటకు బయలుదేరినగుంపులలో నిద్దతేసి ముగ్గురేసివంతున సీతా-రాముని జట్టుగాండ్రున్నారు. నిప్పులేనిచోట నీళ్లు పంపుచు-న్నారు, నీళ్లకుపోయినవారు మఱి రాకున్నారు, అతిచమత్కా-రముగా కుండలు విరుగుచున్నవి, వీడు వెళ్లి వానిమీఁదను వాఁడు వచ్చి వీనిమీఁదను పడుచున్నారు, గొప్పగందరగోళము జరుగుచున్నది, నిప్పుమాత్రము ఆరకున్నది.

ఈవల ఈగందరగోళ మిట్లుండుసమయాన, సీతారా-ముని జట్టులోనివాండ్రువచ్చి ఉదయాదిత్యుని శౌన్యకారా-గారమునకు నిప్పంటించిరి. క్రమక్రమముగా తలుపులకు, ద్వారమునకు, కిటికీకి, దూలములకు, కర్రలకు నిప్పు వ్యాపించినది, అన్నియు కాలుట మొదలుపెట్టినవి. ఆయింటికి నిప్పంటు-కొనఁగలదని యెవ్వరును కలలోనైన ననుకొనలేదు, కనుక నెవ్వరిదృష్టియు నటువైపునకు పోలేదు. సీతారాముఁడు వచ్చుసరికి ఇండ్లన్నియు జ్వాలామండితములై కాలవలసినరీతిని గాలుచుండెను. ఏదో యొకశవము తలయుఁ గొన్ని యెముకలును సంపాదించి, ఇవియుఁ దనతోఁ దెచ్చిన యుద-యాదిత్యునికత్తియు నాప్రైదుగదిలోనికి విసరెను.

ఆవల ప్రహరీశాలకు నిప్పార్పుచుండువారికి హఠాత్తుగ కారాగారమువైపునుండి కేకలు వినఁబడినవి. ఉలికిపడి "అది యేమి? అది యేమి?" అని యందఱును నొక్కుమ్మడిగ ననిరి.

ఎవఁడో అటువైపునుండి పరుగెత్తివచ్చి పైదుగదికి నిప్పంటుకొనినదని చెప్పెను. సహారావాంద్రదేహములను రక్తము నీరై పోయినది, దయాల్‌సింగునకు తలతిరుగుట మొదలుపెట్టినది. అతని చేతిలోనున్న కుండ క్రిందపడి ముక్కముక్కలైనది. ఇంతలో నటువైపుననుండి మఱియొకఁడు వచ్చి, "యువరాజు గదిలోనుండి కేకలు వేయుచున్నాఁడు—వినఁబడుచున్నది" అనియెను. వీనిమాటలు పూర్తికాకమునుపే సీతారాముఁడచ్చటకు పరుగెత్తుకొనివచ్చి "ఓరీ, త్వరగా రండు, యువరాజు గదిపై నుండుడాబా విరిగి పడిపోయినది, కేకలువేసి పిలిచినను ఆయనయొద్దనుండి జబాబురాకున్నది," అని అన్నాఁడు. అందఱు నచ్చటకుఁ బరుగెత్తిరి. డాబా కూలి పడియున్నది, ఎటువైపుచూచినను మంటలు, లోనికి ప్రవేశించుమార్గము కానరాలేదు. ప్రతివాఁడును మఱియొకనిపై నేరము మోపుచు అందఱును ఆమంటలచుట్టు నిలుచుండి, ఎవరియజాగ్రత్తవలన నిది సంభవించినదో నిర్ధారణచేయుటకు మొదలుపెట్టిరి. ఘోరమైన వివాదము జరిగినది— తిట్లతో ప్రారంభమై కొట్టుకొనుటవఱకు వచ్చినది.

ఇల్లంటుకొని, యువరాజు చనిపోయెనన్న వదంతి పుట్టించి కొంతకాలమువఱకైనను నిశ్చింతగా నుండువచ్చునని సీతారాముఁడు తలంచెను. నాలుగువైపులను నిప్పంటుకొని యిల్లు నిరాటంకముగా కాలుచుండుట చూచి సీతారాముఁడు మిగుల నానందించుచు తలకు కండువా యొకటి చుట్టుకొని తనయింటి

వైపు బయలుదేరి కోటనువదలి కొంతదూరము వచ్చెను. అప్పటికి చాలరాత్రియైనది; తానుతప్ప దారిపోవువా రెవ్వ-రును గానరాలేదు; నలుదిక్కుల నిశ్శబ్దము; ఉండియుండి వెదురాకులను కదలించి శబ్దముచేయుచు దక్షిణవాయువు వీచుచున్నది. మనస్సున నుల్లాసముపుట్టి, సీతారాముఁడు సరసమైన పాటయొకటి మొదలుపెట్టెను. ఆనిర్జనపథమున నొంటరిగా పాడుకొని పోవుచుండుపాంథుని మనస్సున కప్పు డొకయూహ తట్టినది. "నేను యశోస్వరువిడిచి వెళ్లిపోక-తీరదు, అట్లైన శ్రమఁపడకుండ దొరకునప్పుడు కొంత డబ్బేల సంగ్రహించుకొని పోఁగూడదు? మంగళ చచ్చనది, పాడు ముండ—శని విరుగుడైనది! దానియింట కొకసారిపోయి చూచిన బాగుగనుండును, కావలసినంత డబ్బుండెను దాని యొద్ద; ఈమూఁడులోకములలో నొక్కఁడైనలేఁడు దానికిఁ గావలసినవాఁడు, ఆరూపాయలు నేను తీసికొనిన తప్పేమి? నేను తీసికొననిచో నింకెవరైన తీసికొందురే! ఈవిధముగ తనలో తాననుకొనుచు మంగళ కుటీరమువైపు తిరిగెను, ఉల్లాసముతో మనస్సు నాట్యమాడుచుండ మరల పాడ నారంభించెను. ఆదారిని పోవుచున్న యభిసారిక యెవరో యొకతె సీతారాముని కంటఁబడెను—సీతారామునకు తెలియ కుండ నిట్టివి యెన్నఁడును జరుగనేరవుగదా! రసికత కనఁ-బఱచుచు నాలుగుమాటలాడవలెనని యనివార్యమైన కోరిక పుట్టినది సీతారామునకు; కాని యిప్పుడు వ్యవధిలేదని

జ్ఞప్తి యుంచుకొని ఆవాంఛ నణఁచుకొనుచు త్వరత్వరగా వెళ్లిపోయెను.

సీతారాముఁడు రుక్మిణి కుటీరమునకుఁ బోయి చూచు-సరికి, తలుపు తెరచియుండెను. అతిసంతోషముతో వాఁడాకు-టీరములో ప్రవేశించి, యొకమూఱు నాల్గువైపులను జూచెను.. ఘోరమైన యంధకారము; ఏమియు కానరాకుండెను, చేతులు చాచి తడవుకొనుచు లోనికిఁబోయెను, కాలికి పెట్టియొకటి తగిలి వాఁడు నేలఁబడిపోయెను, వానితలను గోడతగిలెను. అతనికి మిగుల భయమువేసినది ఇంటిలో నెవరో యున్నట్లును, ఊపిరితీయుట వినఁబడుచున్నట్లును, అతని కనిపించినది మెల్ల మెల్లఁగ ప్రక్కగదిలోనికిఁ బోయెను. పోయి చూచునప్పటికి రుక్మిణి పడకగదిలోనుండి వెలుతురు వచ్చుచుండెను

దీప మిప్పటివఱకును వెలుగుచుండుట కని పెట్టి సీతా-రాముఁడు మిగుల సంతోషించుచు ఆగదివైపునకు వడివడిగాఁ బోయెను. ఎవరది! ఎవ రాగదిలో! ఎవతెయో స్త్రీయొక తె గజ-గజ వణఁకుచుఁ బండ్లు పటపటకొరుకుచుఁ గూర్చుండియుండెను. కట్టుకొనియున్నది తడిబట్ట, సగము జారియున్నది. విప్పియున్న జుట్టునుండి టప్పటప్పున నీటిచుక్కలు పడుచున్నవి. గదిలో చిన్నదీప మొక్కటిమాత్రముండెను మినుకుమినుకుమను చుండు నాదీపపుకాంతి తెల్లఁబారిపోయిన యారమణి ముఖముపైఁ బడుచుండెను. వెనుకగోడపై పెద్దనీడ పడియుండెను కళలేక బూడిదవలెనుండు నా మె ముఖమువై ఖరి, ఆనీడ, ఆనిశ్శబ్దత —

గదిలోఁ బ్రవేశించినతోడనే వీనివలన సీతారాముని దేహము చల్లఁబడిపోయినది. ఆజుట్టు విరుగఁబోసుకొని తడిబట్టతోఁ గూర్చుండియున్నది మంగళవలె గనఁబడఁగానే అది యామె భూతమేమో యని సీతారామునకు భయమైనది—ముందునకు వెళ్లలేకపోయెను. ధైర్యము తెచ్చుకొని వెనుకకుఁ దిరిగిపోలేక పోయెను. సీతారాముఁడు వట్టి పిరికివాఁడు కాఁడు, రెండు నిమిషము లట్లు నిలుచుండి ధైర్యము నటించుచు, "నీవెక్కడ నుండి వచ్చితివే, నీవు చావలేదా?" అని పరిహాసము చేయున ట్లామెను బ్రశ్నించెను రుక్మిణి ముఖమెత్తి సీతారామునివైపు చూచినది; సీతారాముని ప్రాణము లెగిరిపోయినవి. రుక్మిణి యట్లు కొంచె మతనివైపు చూచి, "ఔను! మిమ్ములను నాశ-నము చేయనిదే నేను చచ్చితి ననుకొంటిరా!" అనెను. లేచి చేతులు విసరుచు మరల ప్రారంభించినది,"నేను యమలోకము-నుండి తిరిగివచ్చితిని; నిన్నును యువరాజును బూడిద చేసి, ఆబూడిద నాదేహమున పూసికొనినఁగాని యమునికోరిక నెరవేర్పఁబోను—అంతవఱకు నాకు యమలోకమున స్థానము లేదు."

రుక్మిణి కంఠము విని సీతారామునకు ధైర్యము వచ్చి-నది. సీతారాముఁడామెయెడల ననురాగము కనఁబరచి స్నేహము చేసికొందమని ప్రయత్న మారంభించెను. మిక్కిలి దగ్గఱగఁ బోకపోయినను మొనటికంటె సమీపించి కోమల స్వరముతో నిట్లనెను—" నీ కేక్షణమున కేమతివచ్చునో

పోల్చుకొనుట నాతరముగాదు తల్లీ, అందుచేతనే నిన్నుఁ జూచిన నా కప్పుడప్పుడు కోపము వచ్చుచుండుసు. నాయెడల నీవింత అప్రసన్నురాలవగుటకు నేను జేసిన యపరాధమేమి? ఇది యంతయు నటనే నేనెఱుగుదును! నన్నా పాట పాడనిత్తువా?"

సీతారాముఁ డిట్లు వాత్సల్యము నటించుచున్నకొలఁది. రుక్మిణికి కోప మధికమై యాపాదమస్తకము దేహమున మంటపుట్టుచుండెను. సీతారాముఁడు తనతలమీఁదనుండు జుట్టై యుండినను మంగళ వానిని పీకి ముక్కలుముక్కలుగఁ జేసియుండును, వాఁడు తన కనులై యుండినను చేతులతో పొడిచి పైకిలాగి నేలను వేసి కాళ్లతో నలిపివేసియుండును. ఇటునటు చూచినను మంగళచేత కేమియు దొరకలేదు. పండ్లు పటపట కొరుకుచు "నీపీక యిప్పుడే కోయుచున్నాను, ఒక్క నిమిష మక్కడ నిలిచియుండుము," అనుచు మంగళ కత్తిపీట తేవలెనని ప్రక్కగదిలోనికిఁ బోయెను. మంగళ యుద్దేశించుచున్నది నిజమైన చావే యని కనిపెట్టి కత్తిపీట దెబ్బవలన నిప్పుడు చచ్చుటకు సిద్ధముగా నుండనని సీతారాముఁడు సందు దొరకఁగానే కుటీరమునుండి బయటికిఁ బోయెను. రుక్మిణి కత్తి-పీట తెచ్చునప్పటికి సీతారాముఁ డాగదిలో లేఁడు; వానికి కొట్టవలసిన దెబ్బలన్నియు నామె నేలకు కొట్టినది.

రుక్మిణి యిప్పుడు చచ్చినదానితో సమానమే—యువరాజు విషయమై ఆమెకు గలయాశ పూర్తిగాఁ బోయినది, ఆమెకోరిక ఆమె యెత్తులు—అన్నియుఁ బూర్తిగ మంటఁ

గలసిపోయినవి. మునుపటి తీవ్రమైనవవ్వు రుక్మిణిముఖాన మఱి లేదు, వజ్రవర్షమును గురిపించు చూపులుకూడ నందు లేవు, మునుపు సదా కనఁబడుచుండు జాహ్నవీతరంగోచ్ఛ్వాసము-వంటి కలకల కూడ లేదు. రాజుగారికోటనుండి వచ్చుచున్న భృత్యులందఱితోఁ బోట్లాడి, తిట్టి నేఁడు వాండ్రను తోలి-వేయుచున్నది. దివాన్‌జీజ్యేష్ఠపుత్త్రుఁడు తమలపాకులు నములుచు నేఁడామెతో కొంతరసికత జరుపవచ్చెను, వానికి నేఁడు రుక్మిణిచీపురుకట్టయే ప్రాప్తియయ్యెను! అందఱకును మిగుల భయమైనది, ఆయూరివాండ్రెవ్వరును రుక్మిణిదగ్గఱకు రాఁజాల కుండిరి.

ఆకుటీరమునుండి బయటికివచ్చి సీతారాముఁడాలోచింప మొదలుపెట్టెను. "యువరాజు పాఱిపోయెనను సంగతి మంగళ యెఱుఁగును, ఆమెవలన నంతయు బయలుపడును, ఆపిశాచిముండను పీకనులిపి యేల చంపనైతిని!" అని వాఁ-డనుకొనుచుండెను. "ఏమైననుసరే, యశ్శోరున నుండుట నాకిఁక శ్రేయస్కరము కాదు, నే నీక్షణమే పాఱిపోవలెను," అనుకొనెను. సీతారాముఁడు సపరివారముగ నారాత్రియే యశ్శోరు విడిచి గాయగడునకుఁ బాఱిపోయెను.

రాత్రి యంత్యభాగమున మేఘము క్రమ్మి వర్షము ప్రారంభమైనది, నిప్పారిపోయినవి. యువరాజు చనిపోయెనను వదంతి ప్రతాపాదిత్యుని చెవినిగూడఁ బడ్డది. రాజుగారీమాట వినఁగానే సభాగృహమునకు వచ్చి కూర్చుండిరి. సహోదరావాం-

త్రను బిలిపించిరి. మంత్రియు మరియిద్దరుముగ్గురు సభాసదులునుగూడ వచ్చిరి. అతిభయంకరముగ నిల్లు కాలుచుండు సమయాన యువరాజు కిటికీలోనుండి కనఁబడెనని యొకఁడు సాక్ష్యమిచ్చెను, యువరాజు కేకలు తాము వినిరని కొందఱు సాక్ష్యమిచ్చిరి. మంటలలో కాలి దొరకిన యువరాజు కత్తిని దీసికొనివచ్చి రాజు నెదుట బెట్టెను మరియొకఁడు. పినతండ్రి యెక్కడ నని ప్రతాపాదిత్యుఁ డడిగెను—ఇల్లంతయు వెదకిరిగాని వసంతరాయలు కానరాలేదు.

ఇల్లు కాలుచుండుసమయాన నాయనకూడ యువరాజుతోఁ గారాగారమునఁ గాన్పించెనని ఎవఁడో యనెను. "లేదు, లేదు, ఇల్లు కాలి, యువరాజు మృతినొందెనని రాత్రి తెలియఁగానే యశోహరు విడిచి వెళ్లిపోయెను," అని మరియొకఁడు చెప్పెను. ఈనానావిధములగుసాక్ష్యములు వినుచు ప్రతాపాదిత్యుఁడు సభాగృహమందుఁ గూర్చుండియుండ, ద్వారముకడఁ గోలాహల మొకటి లేచినది. ఎవతెయో స్త్రీయొకతె రాజసభలోనికి రాఁబోవుచుండ ద్వారపాలకు లామెను రానీయకున్నారఁట. అది వినినతోడనే యామెను లోనికి వదలుఁడని రాజుగారి యాజ్ఞయైనది భృత్యుఁ డొకఁడు రుక్మిణిని దీసికొని లోనికి వచ్చెను. "నీ కేమి కావలెను," అని రాజుగా రడిగిరి.

రుక్మిణి చేతులు విసరుచు బిగ్గరగ నిట్లనెను—
"నాకు కావలసినది మరియేమియు లేదు—మీ పహారావాండ్రందఱను నారేసిమాసములు ఖైదులో కుళ్లఁబెట్టి చివరకు

మూరినుక్కలచే వాండ్రను తినిపింపుఁడు మహారాజా; ఇది కనులార చూడనిదే నాకు తృప్తికలుగదు! వీండ్రకుఁ దమ యెడల భయభక్తులున్నవని ఎన్నటికిని నమ్మకుఁడు."

ఈమాటలు వినినతోడనే అచ్చటినుండు భృత్యులంద-ఱును కేకలువేయ నారంభించిరి, రుక్మిణి వెనుకకుఁ దిరిగి కనులు పెద్దవిచేసి ఇటునటు త్రిప్పి, "నోళ్లు మూయుఁడు, మీరు ఘో-రమైన దొంగలు," అనుచు వాండ్ర వదల్పినది. "నిన్నరాత్రి మీ కాళ్లుసేతులు పట్టుకొని యెన్నియోసారులు మీయువ-రాజు రాయగడు తాతగారితో పారిపోవుచున్నాఁడని మనవి-చేసికొన్నాను; నామాట మీరు చెవినిబడనీయలేదు రాజు-గారియింటనౌకర్లు మీరు, మీకు గర్వముబలిసినది, పాములకు నాలుగేసి కాళ్లు మీకు కనఁబడుచుండును! చెదపురుగునకు రెక్కలు వచ్చుట చచ్చుటకొఱకే!"

ప్రకాశాదిత్యుఁడు — "జరిగినదంతయు పూర్తిగాఁ జెప్పుము!"

రుక్మిణి — "చెప్పవలసినది మఱియేమున్నది! యువరాజు-వసంతరాయలతో నిన్నరాత్రి పాఱిపోయెను."

ప్రకాశాదిత్యుఁడు — "ఆ యింటికి నిప్పెవరంటించిరో నీవెఱుఁగుదువా?"

రుక్మిణి — "మఱియెవరు మీసీతారాముఁడే! యువ-రాజునకును, వానికిని పరమమైత్రి; యువరాజునకు వాఁడే సర్వమును, వాఁడుతప్ప మఱియెవ్వరును లేరట్టే అతనిధోరణి.

ఇది యంతయు సీతారాముని పని. అనుసలి రాజు, సీతారాముఁడు, యువరాజు కలసి యాలోచించి చేసినపని యిది, అది నేను స్పష్టముగా చెప్పఁగలను"

కొంతసేపటివఱకు ప్రతాపుఁడేమియు మాటలాడ లేదు, చివరకు, "నీ కాసంగతి ఎట్లు తెలిసినది?" అని యడిగెను.

రుక్మిణి—"అదియంతయు చెప్పిన లాభము లేదు. ఇద్దఱుమనుష్యులను నాకు సహాయమిమ్ము. నేనే స్వయముగఁ-బోయి యువరాజును వెదకి తీసికొనివత్తును. ఇట్టిపని మీ-నౌకర్లకుఁ జేతకాదు, వాండ్రు వట్టిమేకలవంటివాండ్రు!"

రుక్మిణికి మనుష్యుల నిచ్చి ప్రతాపాదిత్యుఁడు పహారా-వాండ్రపై శిక్షవిధించెను. సభాగృహమునుండి ఒక్కొక్కఁడు బయటికిఁ బోయిరి. చివరకు రాజును మంత్రియు మిగిలిరి. రాజుగారు తనతో మాటలాడుదురని మంత్రి యనుకొనెను. కాని రాజుగారేమియు ననకుండుట చూచి ఏదో చెప్పవలెనని యుద్దేశించి, "మహారాజా!" అని ప్రారంభించెను. కాని రాజు-గారదివినిపించుకొనకుండుటచూచి మెల్లమెల్లఁగ మంత్రి కూడ బయటికిఁ బోయెను.

ఆనాఁడే సాయంకాలము ఉదయుఁడు పాఱిపోవుటను గూర్చి ప్రతాపుఁ డొక్కజాలరివానినోటవెంట వినెను— పడవెక్కి పోవుచుండ వాఁడు యువరాజును జూచెనఁట ప్రతాపాదిత్యుఁ డితరులవలనఁగూడ క్రమక్రమముగ నా వార్తయే వినుచుండెను రుక్మిణితోఁ గలసివెళ్లియుండిన భృత్యు

లోక వారము దినము లైనతరువాత తిరిగివచ్చి యువరాజును రాయగడులోఁ జూచితిమని చెప్పిరి.

ప్రతాపుఁడు—"ఆమె యేదీ?"

భృత్యులు—"ఆమె తిరిగి రాలేదు, అక్కడనే యుండి పోయినది."

అప్పుడు ప్రతాపాదిత్యుఁడు ముక్తియార్ ఖాన్ అను పఠాన్ సేనాపతి నొకనిని బిలిపించి వానితో రహస్యముగ నేదియో చెప్పెను. అతఁ డదివిని రాజుగారికి సలాముచేసి సెలవుపుచ్చుకొని వెళ్లిపోయెను.



## ముప్పది రెండవ పరిచ్ఛేదము.

ఉదయాదిత్యుఁడు వెళ్లిపోయెనని ప్రతాపాదిత్యుని-కంటె రాణికిని విభకును ముందుగనే తెలిసినది. రాజుగారీసంగతి వినినతోడనే యేమిచేయుదురో యని వారిద్దఱును మిగుల దిగులు చెందుచుండిరి. ప్రతిదినమును నెవరో క్రొత్తగ నాసంగతినే చెప్పవచ్చుచుండిరి, వినినకొలఁది వీరికి భయ మధికమగుచుండెను. ఇట్లొకవారము గడచినది, రాజుగారికి నిశ్చయమైనసంగతి అప్పుడు తెలిసినది. కాని రాజుగారేమియుఁ జేయలేదు; వారికి కోపమున్నట్టు పైకెట్టి నిదర్శనమును లేకుం-డెను. రాణి మఱియూరకుండలేక, రాజుగారియొద్దకుఁ బోయినది కాని చాలసేపటివఱకు నుదయునిమాట యెడుగుటకు సాహ-సింపలేదు. రాజుగారుకూడ నామాట యెత్తలేదు. చివరకు రాణియే మఱి యాగలేక యిట్లనెను—"ఈసారికి ఉదయుని క్షమింపుము మహారాజా! నాప్రార్థనను నిలుపుము. పిల్లవాని నింకను కష్టపెట్టితివన్న నేను విషముతిని ప్రాణత్యాగము చేసెదను.

"నీవు మొదటనే ప్రారంభించినావు—నేనేమియుఁ జేయనే లేదే!" అని చీకాకుపడుచు రాజుగారనిరి.

రాజుగారిమనస్సు మరల వంకరకావచ్చునని జడిసి ఆవిషయమై మఱియేప్రశ్నను వేయుటకును రాణి సాహసింప

లేదు; మెల్లమెల్లఁగ నతిభయముతో బయటికి వెళ్ళిపోయినది. ఒకదినము గడచినది, రెండుదినములు గడచినవి, మూఁడుదినములు గడచినవి. కాని రాజుగారియుద్దేశమున నెట్టిమార్పును గలిగినట్టు కానరాలేదు. ఇది చూచి విభయు, రాణియు కొంత కలఁతజెందిరి కాని ఉదయాదిత్యుఁ డచ్చటనుండిపోవుటవలన రాజుగారిమనస్సు కొంతచులకనైనది కాఁబోలు ననియూహించిరి

మనస్సున దిగులులేక రాణి కొన్నిదినములు గడపినది.

రామచంద్రరాయలు విభను బంపుమని జాబువ్రాసెనని యింతకుఁ బూర్వమే రాణి విభతో చెప్పినది, ఆమాటయే ఇంట నలుగురకు దెలియఁజేసినది. ఇది విన్నప్పటినుండి విభకు మహానందముగ నుండెను. కాని రామమోహనునితోఁ బోక వాని నొంటరిగఁ బంపివేసినప్పటినుండి యామెమనస్సున కెట్టి విశ్రామమును లేకుండెను. నడుమ నెప్పుడైనను మనస్సున కొంచెము శాంతికలిగినతోడనే తనమాట తలఁపునకు వచ్చుచుండెను— "ఆయన యేమనుకొనుచున్నారోకదా! నాయవస్థ నాయన సరిగా బోధపరచుకొనఁగలిగిరా? ఆయనకు నాపై కోపమువచ్చినదికాఁబోలును? అంతయు నాయనకు బోధపరచి చెప్పిన నాయన నన్ను క్షమింపరా? ఆహా పరమేశ్వరా, నేనెప్పు డాయనను చూతునోకదా, ఎప్పు డాయనకు నంతయు బోధపరతునోకదా!" విభ యీమాటలే వెనుకముందులుగ చేయుచు నెల్లప్పుడును ననుకొనుచుండెను. భయ మొకటాయియై రాత్రింబవళ్లామెమనస్సునఁ గూర్చుండియుండెను

తల్లిమాట వినఁగానే విభ కపరిమితానందము కలిగినది, మనస్సును నొక్కియుంచుచుండిన భారము తత్క్షణమే తొలఁగి-పోయినది సిగ్గువిడిచి నవ్వినది; ఏడ్చినది, ఏమియు మాటలాడక తల్లివక్షమున దనముఖమును దాఁచుకొని చాలసేపూరకుండెను తల్లి కేడ్పువచ్చినది. భర్త తనవిషయమై పొరపాటుపడలేదని తెలియఁగానే విభ కీప్రపంచమంతయు నొకనందనవన మనిపించి-నది, తనభర్తహృదయమువంటిహృదయ మెక్కడనోగాని యుండదనిపించినది. ఆయన యనురాగముపై నెంతయో నమ్మక ముదయించినది. 'నాప్రాణేశుని ప్రేమయే ఈప్రపంచమున నా-నిత్యాశ్రయము,' అని యామెకు నమ్మకముపుట్టినది. 'నేనొకకోమ లమగులతవంటిదానను, బలిష్ఠుఁడగు మహాపురుషునిహస్తము-లను జుట్టుకొని, ఎట్టిభయమును లేకయున్నాను. నానమ్మకము-నుండి నాయాశ్రయమునుండి నన్నెవరు వేరుచేయఁగలరు?' లో-పున నిట్టిభావముండుటచే విభ ఆనందముతో వికసించుచుండెను. మేఘవిముక్తమగు శరదాకాశమువలె నామెప్రాణము నిర్మల-తయు, విస్తారతయుఁ గాంచెను. చిన్నపిల్లవలె విభ యిప్పుడు తనచిన్నతమ్ముఁడు సమరాదిత్యునితో నాడుకొన నారంభించెను. చిన్నముద్దుబిడ్డవలె అమ్మను ఇది యది యడుగుచుండును. దుఃఖభరితమై వ్యాఘ్రహితమగు ఛాయవలె విభ యిటునటు తిరుగుచుండెను మునుపు—ఇప్పు డావైఖరి పోయినది; లోపున ప్రఫుల్లితమగుచుండెడిహృదయము ఆమె సర్వాంగములయం-దును పరిస్ఫుట ప్రభాతమువలె ప్రకాశిత మగుచుండెను.

మునుపటిసంకోచము మునుపటివిచారము పోయి, తల్లితో నేమేమియో మాటలాడుచుండెను, మునుపు ఇట్టిమాటలనుట కెప్పుడును బుద్ధిపుట్టలేదు, బుద్ధిపుట్టినను సిగ్గువలన అని యుండలేకపోవును. బిడ్డయానందము చూచి తల్లికెంతయో అనురాగము కలుగుచుండెను. లోలోపల తల్లికి కొంత సంశయము లేకపోలేదు, కాని విభ కనుమానమునకైనను సందీయలేదు. తల్లియయ్యు నట్టి నిర్మలమైన నవ్వును ఎట్లు వాడఁగొట్టఁగలదు పాపము! కనుక బిడ్డ ప్రతిదినము దనకనుల యెదుటనే నవ్వుచు నాటపాటలను సల్పుచుండ తల్లికూడ నవ్వుచు నాయాటపాటలను విసుగుచెందక చూచుచుండెను.

రాణిమనస్సున కొంచెము భయమును సందేహమును నుండుటచేత నేఁడు రే పనుచు గడపుచున్నదిగాని విభ నత్త-వారియింటికిఁ బంపలేకున్నది. ఇట్లు ఒకటి రెండు వారములు గడచినవి, ఉదయాదిత్యునివిషయమై యొకవిధముగ నిశ్చింత కలిగెను. విభ విషయమైమాత్ర మేమి చేయవలెనో నిశ్చయించుకొనలేకున్నది. ఇట్లు మఱికొన్ని దినములు గడిచినవి. ఆలస్యమైనకొలఁది విభ తొందరపడుచున్నది, ఆలస్యమగుచున్నకొలఁది భర్తకంటికి తనయపరాధ మధికమగుచుండునని యామెకుఁ దోఁచుచున్నది. 'ఆయన కబురుపంపినతరువాతఁగూడ నాలస్యమేల! ఒకమాఱప్పుడే క్షమించిరి, మరల—'

ఇట్లు మఱికొన్ని రోజులు గడచినవి, విభ యేమియు నన-లేదు. తుదకొకనాఁడు మఱి పట్టియుంచుకొనలేక తల్లియొద్దకు

వచ్చి తల్లిని కౌఁగిలించుకొని, ఆమెముఖము చూచుచు, “అమ్మా,” అని ప్రారంభించినది. “అమ్మా” అనుసరికి తల్లి కంతయు బోధపడిపోయినది; విభను రెండుచేతులతోఁబట్టు-కొని, “ఏమి తల్లీ?” అన్నది. విభ కొంచెమునే ఊరకుండి, “అమ్మా నన్నెపుడు పంపెదవు” అన్నది. ఈమాటలు నోటినుండి రాఁగానే విభముఖము సిగ్గుచేత ఎఱ్ఱనై పోయినది. తల్లి చిరునవ్వు నవ్వుచు, “ఎక్కడకు విభూ?” అని యడిగినది. విభ మరల, “చెప్పుమమ్మా!” అని తల్లిని వేఁడుకొనుచు నడిగినది.

“మఱికొన్నిరోజు లోర్చియుండుము తల్లీ, త్వరలోనే పంపెదను” అని తల్లి యనెను—ఇట్లనుచుండఁగనే ఆమె కనుల వెంట నీళ్లు కారుట మొదలుపెట్టినవి.

---

## ముప్పదిమూఁడవ పరిచ్ఛేదము.

ఉదయాదిత్యుఁడు చాలకాలమైనతరువాత మరలరాయగడునకు వచ్చెను, కాని మునుపటియానంద మిప్పుడు మఱిపొందలేదు. తాతయ్యచేసినపని ఫలమెట్టిదగునో యనుభయమువలన ఉదయాదిత్యునిమనస్సున కెట్టిశాంతియు లేకుండెను "నాన్న అంతసులభముగా వదలిపెట్టువాఁడు కాఁడు—ఆహా, నేనెట్టి అవలగ్నమందు పుట్టితినోకదా!" అనుకొనుచు యువరాజు కలతఁజెందుచుండెను. ఉదయుఁడు వసంతరాయలకడకుఁబోయి, "నేను యశోహరునకుఁ బోయెదను తాతయ్యా," అనెను. మొదట తాతయ్య ఆమాట వినిపించుకొనక నవ్వుచు పాట మొదలుపెట్టెను. కాని ఉదయుఁ డూరకుండక, ఆమాటలనే మరలమరల ననుచుండుట చూచి తాతయ్య మనస్సునకు కష్టమైనది. పాట నిలిపి వసంతరాయలు "నేను దగ్గఱనున్న నీకు కష్టమేల?" అని యడిగెను. ఉదయుఁ డాపైని మఱియేమియు ననలేకపోయెను.

ఉదయాదిత్యుఁడు పరధ్యానముగ నుండుటచూచి తాతయ్య అతనికి సంతోషము కలిగింపవలెనని రాత్రింబగళ్లు ప్రయత్నము చేయుచుండెను—అప్పుడప్పుడు వీణవాయించుచుండును. ఉదయునితోఁ గలసి ఇటునటు విహారము చేయుటకు పోవుచుండును. దీనివలన వసంతరాయల రాజ్యకార్యమంత-

యము నిలిచిపోయినది. ఉదయాదిత్యుఁడు తనతో నుండునట్లు చేయలేనేమో యని తాతయ్యకు భయమగుచుండెను. ఉదయుఁడు యశోహరమునకు మరలఁబోవునేమో యని వసంతరాయలు భయపడుచుండెను, రాత్రింబవళ్లుదయునిపై కన్ను వేసియేయుంచెను.

"ఆదేశమునుండునది పాషాణహృదయము నిన్నా దేశమునకు తిరిగి పోనీయను తాతా," అని వసంతుఁడు మాటి మాటికి ననుచుండెను.

కొన్నిదినము లిట్లుండ నుదయునిమనస్సున నుండుక్షీతి చాల తగ్గిపోయినది.ఇన్నాళ్లైనతరువాత తనకు స్వేచ్ఛదొరకినది. తానిరుకుకొన్న రాతిగోడలు వదలినవి, తాతయ్య కోమలహృదయమున బసదొరకినది, ఇప్పుడు తనకాశ్రయమైయున్నది వసంతరాయుని అసీమప్రేమ. ఇన్నాళ్లకు నాలుగువైపులను చెట్టుచేమలు కనఁబడుచుండెను, మీఁదనుండు నాకాశము చూడఁగలుగుచుండెను, దిగంతములవఱకు వ్యాపించియున్న యుషారాగము చూడఁగలుగుచుండెను, పక్షులపాటలు వినఁగలుగుచుండెను, దిగంతములనుండి వచ్చుగాలి యతనిసర్వాంగములకుఁ దగులుచుండెను, రాత్రికాఁగానే ఆకాశమునిండ నక్షత్రములు కనఁబడుచుండెను, విభావరుల జ్యోత్స్నాప్రవాహమున మునుఁగుచుండెను. ఇక్కడ ఉదయుఁ డెక్కడకుఁ బోవలెనన్నఁ బోఁగలఁడు, ఏపనిచేయవలెనన్నఁ చేయఁగలఁడు-- అతని కిచ్చట నెట్టియడ్డును లేదు.

చిన్నప్పు డుదయాదిత్యుని నెఱిఁగినవారనేకులు దూర-దూరములనుండి అతనిని జూచుటకు వచ్చుచున్నారు. గంగాధరుఁడు వచ్చెను, ఫటిక్ వచ్చెను, హబీచాచాకరీ ముల్లాతోఁ గలసి వచ్చియుండెను, మథురుఁడు తనముగ్గురు పిల్లలను తీసి-కొనివచ్చియుండెను, పరాణు, హరి—ఇద్దఱన్నదమ్ములును వచ్చిరి, శీతల్ సర్దారు అయిదుగురు గరిడీవాండ్రతోఁ గలసి ఆటచూపవలెనని వచ్చెను—ప్రతిదినమును యువరాజుదర్శన-మునకై ఎవరో కొందఱు వచ్చుచుండిరి. యువరాజు వారి-క్షేమసమాచారమును దెలిసికొని వారి ననేకవిధముల ప్రశ్నించుచు కాలము గడపుచుండెను. ఉదయాదిత్యుఁ డిప్ప-టికిని తమ్మును మఱవకుండుట చూచి వా రమితానందము పొందిరి. మిక్కిలి యాశ్చర్యపడిరి.మథురుఁడు తన పెద్దకొడుకు-ను కనపరచుచు, "మహారాజా, మీరు రాయగడునకు వచ్చిన-నాఁడు వీనిపుట్టుక, మీరు వచ్చి వానిని చూచియుంటిరి, తరువాత మీ యాశీర్వాదమువలననే ఆయిద్దఱును పుట్టిరి." అనెను. ఇట్లని వాండ్రనుదయాదిత్యునికి దగ్గఱ తీసికొనిపోయి ప్రణామముచేయుమనెను వాండ్రు యువరాజుపాదములకు మ్రొక్కిరి. పరాణ్ వచ్చి "మీరిక్కడనుండి యశోహరునకు పోవునప్పుడు మీపడవను నడపినది నేనే మహారాజా," అనెను. "మీరిక్కడ నుండునప్పు డొకనాఁడు నాలాఠీవిద్య చూచి ఆనందించి మీరు నా కినామిచ్చితిరి మహారాజా, నేఁడు నాకొడుకులవిద్య మీకుకనపరపవలెనని కోరికగానున్నది.

మహాప్రభూ," అనుచు సీతల్ సర్దారు యువరాజునెదుట వచ్చి నిలుచుండెను. ఈవిధముగ యువరాజును జూచుటకు రాయగడు ప్రజ ప్రాతఃకాలము మొదలు సాయంకాలమువఱకు గుంపులుగుంపులుగ వచ్చి అందఱును ఒక్కచోట చేరి మాటలాడుచు మిగుల సంతోషముగఁ కాలముగడపుచుండిరి.

అన్నివైపులను నుండు చెట్లు చేమలవలనను, ప్రేమవలనను, ఆనందమువలనను, సంగీతమువలనను, ఉదయాదిత్యునిమనస్సులో నుండుదిగులు సహజముగ చాలభాగము తగ్గిపోయినది. "నాన్నకు కోపమురాలేదు కాఁబోలు! ఆయన సంతోషముకూడ కలిగియుండునేమో! లేనియెడల నింతకాలమువఱకు నిట్లూరకుండునా?" అని యువరాజు కండ్లుమూసికొని తనలోఁదా నప్పుడప్పు డనుకొనుచుండెను.

కాని యీమిథ్యానందమువలన మనస్సు ననేకదినములు భ్రమలో నుంచలేకపోయెను. తాతయ్య కేమగునో యనుభయము ఉదయుని వదలలేదు. 'తాను యశోహరమునకుఁ దిరిగి వెళ్లిపోవుటను' గుఱించి తాతయ్యతోఁ బ్రశంసించుట నిష్ప్రయోజనమనియు, ఆయనతోఁ జెప్పకయే దొంగతనముగ నెప్పుడో పోవలెననియు నిశ్చయించుకొనెను. అట్లు నిశ్చయించుకొనఁగానే ఆకారాగారము జ్ఞప్తికి వచ్చినది. ఈయానందము, ఈస్వేచ్ఛ యెక్కడ, ఎన్నటికిని ఎట్టిమార్పును జెందక విసుగుతెప్పించు ఆకారాగారవాస మెక్కడ? ఖైదులో గడపిన ప్రతినిమిషమును ఒక్కొక్కసంవత్సర మనిపించినది

అతనికి. ఆనిర్జనకారాగార మతనికనులకు కట్టినట్లైనది. వెలుతురులేదు, గాలిలేదు, తలుపులు మూసియున్నవి. తలఁచుకొనినంతమాత్రాన దేహమున పులకరింపు పుట్టుచుండెను. ఐన నెన్నఁడో ఒకనాఁడాకారాగారమునకే పోవలెనని నిశ్చయించుకొనెను, కాని "నేఁడే పోయెదను," అని మాత్రము నిశ్చయించుకొనలేకపోయెను, ఒకనాఁడు 'పోయెదను'అనుకొనుచు నిశ్చింతుఁడాయెను.

నేఁడు బృహస్పతివారము—వర్జ్యము; నేఁడు పోవుట మంచిదికాదు, రేపు పోయెద... నేఁడు రోజు బాగుగలేదు; ప్రొద్దుటమొదలు ఒక్కవరుసను చినుకులుపడుచున్నవి, ఆకాశము కనఁబడుటయేలేదు మేఘము పూర్తిగా కప్పియున్నది. ఐనను ఈసాయంకాలము తప్పక రాయగడు విడువవలెనని ఉదయుఁడు నిశ్చయించుకొనియుండెను. నేఁడు, ఉదయుఁడు తాతయ్యకు ఉదయమునఁ గానరాఁగానే తాతయ్య ఉదయుని కౌఁగిలించుకొని, "తాతా రాత్రి నేను కలగంటిని,అది మిక్కిలి పాడుకల—ఆకల స్పష్టముగ జ్ఞప్తికి రాకున్నది, కాని నీవు నన్ను విడిచిపోవుచున్నావఁట, ఎన్నటికిని మఱి నాకు కనఁబడవట!" అనెను.

ఉదయుఁడు తాతయ్యచేయి పట్టుకొని, "నేను నిన్ను విడిచి పోవచ్చునుగాని, తాతయ్యా, ఎన్నఁటికిని కనఁబడకుండుట ఎట్లు కాఁగలదు?" అని అనెను.

వసంతరాయలు మఱియొకవైపు చూచుచు, ఏదో

యాలోచించువానివలె, "ఏల కాఁగూడదు, ఇఁక నెంతకాలము బ్రతికియుండఁగలను, ముసలివాఁడనై పోతినిగదా!" అనెను.

గతరాత్రి తాను కన్నకల ఇంకను వసంతరాయలమన-స్సున ప్రతిధ్వనించుచుండుటచే నతఁడు పరధ్యానముగ నేదో యాలోచించుచుండెను.

ఉదయుఁడు కొంచెము సేపూరకుండి, "తాతయ్యా, మనకిద్దఱకును మరల నెడఁబాటు వచ్చిన నేమగును?" అని యనెను.

వసంతరాయ లుదయుని భుజముపైఁ జేయివేసి అతనిని దగ్గఱకు లాగుకొనుచు నిట్లనెను— "ఎడఁబా టేలవచ్చును తాతా? నన్ను విడిచిపోకుము నాయనా! ఈముసలి కాలములో నన్నొంటరిగ వదలిపెట్టకుము తాతా!"

ఉదయునికనులు నీళ్లతో నిండినవి, ఉద్దేశ మింకను దనమనస్సులోనే యుండ తాతయ్య కెట్లు దానిజాడ దొరికి-నదో? యని ఆశ్చర్యపడుచు నిట్టూర్పువిడిచి, "నేను దగ్గఱ-నుండినయెడలనే నీకుఁ గీడు సంభవింపఁగలదు తాతయ్యా!" అనెను.

వసంతరాయలు నవ్వుచు నిట్లు ప్రత్యుత్తమిచ్చెను— "ఎట్టికీడు తాతా? ఈవయస్సున విపత్తునకుజడిసెదనా! మృత్యు-వుకంటె గొప్పవిపత్తు లేదుకదా! అట్టిమృత్యువుకూడ నాపా-రుగుననే బసచేసియున్నది, మృత్యు విప్పుడు సదా నాసమా-చారమును కనుఁగొనుచుండును, దానికి నేను భయపడను.

అన్ని విపత్తులను దాటి పెద్దవయస్సువచ్చువఱకు బ్రతికియుండఁ-గలిగినవాఁడను నేను. ఒడ్డుచేరినతరువాత పడవ మునిగిపోయిన నేమి?"

ఉదయుఁడు నేఁడు దినమంతయుఁ తాతయ్యతోనే యుండెను. రోజంతయు చినుకులు చిటపట పడుచునే యుండెను.

సాయంకాలమయి చినుకులు కొంచెము మాఁగఁగానే ఉదయుఁడు లేచి నిలుచుండెను. "ఎక్కడికి తాతా?" అని వసంతరాయలు తత్క్షణమే అతనిని ప్రశ్నించెను.

ఉదయాదిత్యుఁడు—"కొంచెము బయట పచారుచేసి వచ్చెదను."

వసంతరాయలు—"నేఁడు పోకున్న నేమి తాతా!"

ఉదయుఁడు—"అట్లనుచున్నావేమి తాతయ్యా?"

వసంతరాయలు—"నేఁడు బయటికిఁ బోవద్దు తాతా, నేఁడు నన్ను విడిచి పోకుము!"

"దూరముపోను తాతయ్యా, ఇప్పుడే మరల వచ్చెదను," అనుచు నుదయుఁడు బయటికిఁబోయెను

ఉదయాదిత్యుఁడు ప్రాసాద సింహద్వారముకడకు రాఁగానే పహరావాఁ డొక డతనినిఁ జూచి, మీతోఁగూడ నన్ను రానిండు మహారాజా" అనెను.

ఉదయాదిత్యుఁడు—"అవసరము లేదు."

పహరా—"మహారాజావారిచేత అస్త్రమేదియు లేదు."

"అస్త్రమేల?" అనుచు యువరాజు బయటికివచ్చెను. ఎదుటనున్న పెద్దబయలుచేరి అచ్చట పచారుచేయ నారంభించెను. క్రమక్రమముగ సంధ్యయై వెలుతురు క్షీణించి చీఁకటి కాసారంభించినది. ఎన్నో సంగతులు యువరాజుమనస్సునకు వచ్చుచుండెను. ఉదయుఁడు లక్ష్యవిహీనమును, ఉద్దేశ్యరహితమును నైన తనజీవితమునుగుఱించి యోచించుచుండెను. ఎట్టిస్థిరతయు లేనియవస్థ అతనిది, ఆఉత్తరక్షణమే ఏమైనను కావచ్చును. అతనివయస్సు స్వల్పము; జీవితమంతయు ముందుకే యున్నది; ఎక్కడను ఇల్లువాకిలిలేక, స్థిరమైన సంసారములేక ఎట్లు భవిష్యత్తునంతయు గడపఁగలనోకదా యని యువరాజు తనలోఁ దా ననుకొనుచుండెను.

విభమాట యప్పుడు జ్ఞప్తికివచ్చినది— "విభ యిప్పు డెక్కడ నున్నదోకదా? ఇంతకాలమును సుఖసూర్యుఁడామెపై నుదయింపకుండ అడ్డుగ నిలుచుండియున్నది నేనే! ఇప్పుడు విభ సుఖముగ నున్నదా?" ఇట్లనుకొనుచు నామె నెన్నోమాఱులు తనలో తాను దీవించెను.

గొల్లపిల్లవాండ్రు ఎండవేళఁ గూర్చుండుటకై బయలునడుమ నొక చెట్లగుంపు పేర్పఱుపఁబడియున్నది. అందు రావిచెట్లు, మఱ్ఱిచెట్లు, ఖర్జూరపుచెట్లు, పోకచెట్లు ఉన్నవి. ఉదయుఁడచ్చటికి వచ్చునప్పటికి చీఁకటిపడినది. తాను పాఱిపోవలెనని నిశ్చయించుకొనినదినము నేఁడు.ఆసంకల్పము విషయమైయే ఇప్పు డతఁ డాలోచించుచుండెను. తాను పోయెననుసంగతి

విన్నప్పుడు వసంతరాయ లెట్టియవస్థలోఁ బడునోకదా! అతనికి గుండె బ్రద్దలౌనుగాఁబోలు__అతిదుఃఖముతో "హాఁ! తాత నన్నువిడిచి పాఱిపోయెనే!" అనుచుండును గాఁబోలు! ఆముఖము ఆదృశ్యము ఉదయునికి కనులకుఁగట్టినట్లు కనఁబడు-చుండెను.

ఆసమయమున బహుకఠినస్వరముతో "ఇదిగో ఇక్కడ! ఇక్కడ! మీయువరాజు!" అనుచు స్త్రీకంఠ మొకటి వినఁబ-డెను. దివ్వటీలు చేతఁబుచ్చుకొని సైనికు లిద్దఱు వచ్చి ఉద-యాదిత్యునియెదుట నిలిచియుండిరి. చూచుచుండఁగనే ఆసై-నికులసంఖ్య యధికమైనది, వాండ్రువచ్చి యువరాజును ముట్ట-డించఁగా ఆరమణి యువరాజును సమీపించి, నన్నుఁబోల్చు-కొనఁ గలవా? ఇటుచూడుము, ఇటుచూడుము! అనెను. ఆదివ్వటీల వెలుఁగునయువరాజునకురుక్మిణిముఖము కనఁబడినది. రుక్మిణి ధోరణిచూచి సైనికు లామెను 'దూరముండుము' అనుచు నదల్చిరి. రుక్మిణి యామాటలు వినుపించుకొనక ఇట్లన సాగెను__ ఇదియంతయు నెవరుచేసిరో యెఱుఁగుదువా? చేసినది నేను! ఈసైనికుల నందఱను నిచ్చటికి తీసికొనివచ్చినది యెవరు? నేను! నీకొఱకై నేనెంతో చేసితిని__నీవో, యువ రాజవు--వెనుకకుఁదిరిగినిలుచుంటివి నావైపు చూడనైన చూ-డక! సైనికులు రుక్మిణిని బలవంతముగ లాగుకొనిపోయిరి. అప్పుడు ముక్తియార్ఖాఁ యువరాజునకు సలాముచేయుచు నెదుటికి వచ్చినిలిచెను. యువరా జాశ్చర్యపడుచు, "ఏమిసమా చారము ముక్తియార్ఖాఁ?" అని యడిగెను.

"మహారాజావారియాజ్ఞను తీసికొనివచ్చితిని మహా-ప్రభూ," అని యతివినయముతో ముక్తియార్ ప్రత్యుత్తర-మిచ్చెను.

యువరాజు—"రాజావారియాజ్ఞ యేమి?"

మహారాజావారి స్వహస్తలిఖితపత్ర మొకటి ముక్తి-యార్ యువరాజుచేతిలోఁ బెట్టెను.

యువరా జాపత్రమును జదివి యిట్లనెను—"దీని-కొఱ కింతసైన్యమేల? నాకొక ఆజ్ఞ తెలియఁజేయుచు నాకొక-జాబువ్రాసిన నేనే వచ్చియుందునే! నాయంతట నేనే రావలెనని నిశ్చయించితిని, రాఁబోవుచుంటిని. అట్టిచో నాలస్యమేల? ఇప్పుడే పోదము రండు, ఇప్పుడే యుశ్శోరునకు బయలు-దేరుదము!"

"తత్క్షణమే రాలేను" అని ముక్తియార్ చేతులు-జోడించి మనవిచేసికొనెను.

"ఏమి?"

"మహారాజావారియాజ్ఞ మఱియొకటి ఉన్నది, అది పాలింపనిదే రాజాలను."

"ఏ మాయాజ్ఞ?"

"రాయగడు ప్రభువుపై మహారాజావారు ప్రాణ దండము విధించిరి!"

"అబద్ధము, రాజావా రెన్నఁడు నట్టియాజ్ఞ నీయరు."

"అబద్ధముకాదు యువరాజా! మహారాజావారు స్వహస్తముతో వ్రాసియిచ్చినపత్రము నాయొద్దనున్నది."

"నీవు పొరపాటుపడుచున్నావు సేనాపతీ," అనుచు యువరాజత్యాతురముగ ముక్తియార్ ఖాన్ చేతులుపట్టుకొనెను. "యువరాజు దొరకనిపక్షమున నని రాజావారియాజ్ఞ—నేనెఱుఁగుదును. నాయంతట నేనే వచ్చుటకు సిద్ధముగా నున్నప్పుడు నీవు చేయవలసిన దేముండును? నన్నిప్పుడే తీసికొనిపొండు, తత్క్షణమే తీసికొనిపొండు. కాళ్లు, చేతులుకట్టి నన్నీక్షణమే తీసికొనిపొండు, ఆలస్యముచేయకుఁడు."

"నేను పొరపాటుపడలేదు యువరాజా, రాజావారు స్పష్టముగా నాతోఁ జెప్పిరి," అని ముక్తియార్ ఖాన్ జబాబిచ్చెను.

యువరాజు కలతఁజెందుచు నిట్లనెను—"నీవు పొరపాటుపడుచున్నావు, సందేహములేదు. నాన్న యభిప్రాయమది కాదు. అట్లైన యుత్తరువునకుఁ బోదము రమ్ము రాజుగారినోట నీకు సరిగాబోధపడునట్లు చెప్పించెదను. నీవనునదే సరియైనదని వారన్నచో అప్పుడాయాజ్ఞ నాలింపవచ్చును."

"క్షమింపుఁడు మహారాజా, మీయాజ్ఞ మన్నింపఁజాలను."

"ముక్తియార్, నేనొకనాఁడు సింహాసన మెక్కఁబోవు-

న్నాను, ఆమాట నీవెఱుఁగుదువు, నామాట నిలుపుము, న్ను సంతోషపెట్టెదను," అని తడబడుచు యువరాజనెను.

ముక్తియార్ జబాబీయక నిలిచియుండెను.

యువరాజుముఖమున రక్తములేదు, నొసట చెమట చుక్కలు కూడుచుండెను. యువరాజు ముక్తియార్ చేయి గట్టిగాఁ బట్టుకొని, "సేనాపతీ, ఆయన పుణ్యాత్ముఁడు, వృద్ధుఁడు, నిరపరాధి; అట్టివానినిఁ జంపిన నీకు నరకమునసైన స్థానము-దొరకదు," అని యనెను.

"యజమానులయాజ్ఞ పాలించిన పాపములేదు," అన్నాఁడు సేనాపతి.

"అసత్యము, అట్లుచెప్పు ధర్మశాస్త్రము మిథ్యాధర్మ-శాస్త్రము. పాపపుటాజ్ఞను బాలించుట పాపమని నీవెఱుఁ-గుదువు ముక్తియార్," అని యువరాజు గొంతెత్తి అతితీవ్ర-ముగా ననెను.

సేనాపతి ఏమియు జబాబుచెప్పక నిలిచియుండెను.

యువరాజప్పుడు నాలుగుదిక్కుల నొకమాఱు చూచి "అట్లైన నన్ను విడచిపెట్టుము, నేను కోటలోనికిఁబోయెద నీ-సైన్యమును దీసికొని యుద్ధమునకు రమ్ము. యుద్ధమున గెలిచి తరువాత ఆయాజ్ఞను పాలింపుము," అని యనెను.

సేనాపతినోట మాటలేదు. సైనికు లంతకంతకు దగ్గ-ఱను వచ్చి యువరాజును చుట్టఁబెట్టిరి. యువరాజునకు నుపాయమేమియుఁ గానరాలేదు, కేవల మసహాయుఁడై

యాయంధకారమున "తాతయ్యా జాగ్రత్త!" అని బిగ్గరగ నరచెను. ఆవనమున గంపముపుట్టినది, ఆమాటలు ఆ పెద్ద-బయలులోనికి వెళ్లి అచ్చట హరించిపోయినవి. సైనికులు మఱింత దగ్గఱకువచ్చి యువరాజును బట్టుకొనిరి ఉదయుఁడు "తాతయ్యా జాగ్రత్త!" అని మఱియొకతూరి కేకవేసెను. ఆదారినిబోవు బాటసారియొకఁ డామాటలు విని, "ఎవరది!" యనుచు దగ్గఱకు వచ్చెను. యువరాజు వానిని చూచి. "వెళ్లుము, వెళ్లుము, త్వరగా పరుగెత్తుకొని కోటలోనికి-పోయి మహారాజుగారిని జాగ్రత్తగ నుండుమనుము," అని తొందరతొందరగఁ జెప్పెను. సైనికు లాబాటసారిని బోనీయక పట్టుకొనియుంచిరి; ఆమైదానము వెంబడిపోవు బాటసారులెం-దఱు కనఁబడుచుండిరో వారందఱినిగూడ నాసైనికులు పట్టి బంధించిరి.

సైనికులలోఁ గొందఱు ఖైదీగానున్న యువరాజునొద్ద నుండిరి; ముక్తియార్ ఖానును మిగిలినసైనికులును తమసైనిక-వేషమును విడిచి యస్త్రశస్త్రములను దాఁచియుంచి మామూలు మనుష్యులవలె కోటవైపునకు బయలుదేరిరి. రాయగడుకోటకు నూటికిమించినద్వారములు, ఆద్వారములో-నుండి సైనికు లాకోటలోఁ బ్రవేశించిరి.

అప్పుడు వసంతరాయలు సంధ్యారాధనచేయు చున్నాఁడు. ఆవల, రాజప్రాసాదదేవాలయమున సంధ్యాపూజ జరుగుచున్నది, శంఖనాదము వినవచ్చుచున్నది, జయఘంట మ్రోఁగుచున్నది.

ఆ రాజప్రాసాదము అంత పెద్దదైనను నెట్టికోలాహల-ము లేక నిశ్శబ్దముగ నున్నది. వసంతరాయ లేర్పఱచిన చారముప్రకారము సౌకర్యలో చాలమంది యాసమయ-మున తమతమ యిచ్ఛానుసారము బయటికిఁబోయిరి, కొంత-సేపటికిగాని తిరిగిరారు.

వసంతరాయల యారాధన యింకను బూర్తికాలేదు, నడుమ నకస్మాత్తుగ నాపూజాగృహమున ముక్తియార్ ఖాన్ కనఁబడెను. వసంతరాయలు కొంచె మసంతుష్టుఁడగుచు, "ఈగదిలోనికి రాఁగూడదు ఖాన్‌సాహేబ్, పూజ ముగించి నేనిప్పుడే బయటికివచ్చెదను," అన్నాఁడు.

ముక్తియార్ బయటికిఁబోయి గడపదగ్గఱనే నిలిచి యుండెను. పూజ కాఁగానే వసంతరాయలు బయటికివచ్చి ముక్తియార్ వీపుపైఁ జేయివైచి "క్షేమమా ఖాన్‌సాహేబ్?" అని యడిగెను.

ముక్తియార్ సలాముచేయుచు అతికష్టముగా "చిత్తము!" అన్నాఁడు.

"భోజనమైనదా?"

"చిత్తము."

"అట్లైన నీబస కేర్పాటుచేసివచ్చెదను."

"అవసరములేదు, మహారాజా! పని పూర్తిచేసికొని ఇప్పుడే తిరిగిపోవలెను."

"అట్లు వీలులేదు ఖాన్‌సాహేబ్! నేను వదలను ఈరాత్రి నీవిక్కడ నాయతిథిగా నుండియేతీరవలెను."

"వీలులేదు మహారాజా, తక్షణమే పోవలెను."

"అట్లేల? ముఖ్యమైనపని ఏదో ఉండవలెనట్లైనను! ప్రతాపుఁడు క్షేమమా?"

"మహారాజావారు క్షేమముగానే యున్నారు"

అట్టిన వంతతొందరగాఁ బోవలసినంత జరూరుపని యేమున్నది, చెప్పుము ఖాన్‌సాహెబ్, నాకుఁ గొంచెము భయమగుచున్నది. ప్రతాపుఁడేమైన నాపదలోనున్నాఁడా!"

ముక్తియార్—"అట్టిదేమియు లేదు. మహారాజావారి యాజ్ఞను పాలించుటకై యిక్కడికి వచ్చితిని."

వసంతరాయలు—"ఏమి ఆయాజ్ఞ?"

ముక్తియార్‌ఖా నొక యాజ్ఞాపత్రమును బైకిఁదీసి వసంతరాయలచేతి కిచ్చెను. వసంతరాయలు దానిని దీపము కడకుఁ గొనిపోయి చదువసాగెను అంతలో సైనికులందఱును ఒక్కొక్కరుగ ద్వారముదగ్గఱకు వచ్చిచేరిరి.

ఆపత్రమును జదివి వసంతరాయలు ముక్తియార్ దగ్గఱకు మెల్లమెల్లఁగవచ్చి "ఇది ప్రతాపుఁడు వ్రాసినదేనా?" అని యడిగెను.

ముక్తియార్ "చిత్తము!"

"ఇది ప్రతాపుఁడు తనచేతితోఁ దానే వ్రాసెనా?" అని వసంతరాయలు మరల నడిగెను.

"అది రాజావారు స్వహస్తముతో వ్రాసినదే, మహా-రాజా!"

వసంతరాయలు కనుల నీరుపెట్టుకొని "వానిని నేను నా చేతులతో పెంచి పెద్దవానిని జేసితిని ఖాన్‌సాహేబ్!" అనెను, కొంతసేపూరకుండి మరల ప్రారంభించెను— "ప్రతాపుఁడు చంటివాఁడుగానున్నప్పుడు వాని రేయింబవలు నెత్తుకొనియుండువాఁడను, ఒక్కక్షణమైనను నన్ను విడుచు-వాఁడు కాఁడు. ఆ ప్రతాపుఁడే పెద్దవాఁడైనాఁడు, అతనికిఁ బెండ్లి చేసితిని, సింహాసనముపైఁ గూర్చుండఁబెట్టితిని. వానిబిడ్డలను ఆడించుచు నెత్తుకొని ముద్దులాడుచుంటిని — అట్టి ప్రతాపుఁడీపుత్రమును తనచేతితో తానే వ్రాసెనా ఖాన్‌సాహేబ్!"

ముక్తియార్ కనులు తడిసియుండఁ, ముఖము వాల్చుకొని ఊరక నిలిచియుండెను.

"తాత యెక్కడ! ఎక్కడ ఉదయాదిత్యుఁడు!" అని వసంతరాయలడిగెను.

"యువరాజా! వారు బందిగానున్నారు, మహారాజా-వారియొద్దకు విచారణకై కొనిపోవుచున్నాము," అని ముక్తియారనెను.

"ఉదయుఁడు బందిగానున్నాఁడా? బందీగానున్నాఁడా ఖాన్‌సాహేబ్! తాతనొకమారు చూడనిమ్ము."

"లేదు మహాప్రభూ, రాజావారి సెలవులేదు."

వసంతరాయలు కనుల నీరుకార్చుచు ముక్తియార్ చేతులుపట్టుకొని, "ఒక్కసారి తాతను చూడనీయవా ఖాన్‌సాహేబ్!" అని వేడుకొనెను.

"ఆజ్ఞను పాలించుభృత్యుఁడనుమాత్రమే నేను."

వసంతరాయలు పెద్దనిట్టూర్పు విడిచి "దాక్షిణ్య మెవ్వరకును లే దీప్రపంచములో! సాహేబ్ రమ్ము, వచ్చి నీ ఆజ్ఞాపాలన చేసికొనుము!" అనెను.

ముక్తియార్ ఖాన్ వంగి భూమిని తాకి సలాముచేసి చేతులుజోడించి, "నన్ను క్షమింపుఁడు మహారాజా, నేను నా ప్రభువు నాజ్ఞను పాలించుచున్నాను, ఇందు నాదోష మేమియు లేదు," అనెను.

వసంతరాయలు—"నీ తప్పేమున్నది ఖాన్‌సాహేబ్? నీదేమియు తప్పులేదే! ఇందు నిన్ను క్షమింపవలసినదేమియు లేదు." ఇట్లనుచు ముక్తియార్ దగ్గఱకుఁబోయి అతనిని కౌఁగిలించుకొనెను.

వసంతరాయలు—"ప్రతాపునితో నేనతనిని దీవించుచు ప్రాణత్యాగము చేసితినని చెప్పుము సాహేబ్. ఉదయుని భారమంతయు నీమీదనే విడిచిపెట్టి చనిపోవుచున్నాను, జ్ఞాపక ముంచుకొనుము ఖాన్‌సాహేబ్. ఉదయుఁడు నిరపరాధి. అన్యాయపువిచారణవలన వానికి కష్ట మధికము కాకుండ చేయుభారము నీదే!"

ఇట్లని వసంతరాయలు కనులుమూసికొని ఇష్టదేవతను

స్మరించుచు తలవాల్చుకొనెను; "ఇక నీపని చేసికొనుము" అని ముక్తియారుతో ననుచు జపతావళము త్రిప్పసాగెను.

ముక్తియార్ ఖాన్ "అబ్దుల్!" అని పిలువఁగానే వరలీసినకత్తి చేతఁబుచ్చుకొని అబ్దుల్ వచ్చెను. ముక్తియార్ ముఖ మటుత్రిప్పుకొని అక్కడినుండిపోయెను, ఆపరక్షణమే అబ్దుల్ రక్తము కారుచున్నకత్తితో బయటికి వచ్చెను. గది రక్తధారతో నిండుచుండెను.

---

## ముప్పది నాల్గవ పరిచ్ఛేదము

సైన్యములో చాలభాగము రాయగడులోనే యుంచి యుదయాదిత్యునిదీసికొని ముక్తియార్ ఖాన్ యశోహరమునకు బయలుదేరెను. దారిలో రెండురోజులును ఉదయాదిత్యుఁ డెట్టియాహారమును గొనలేదు. ఎవరితోనైన నొక్కమాట యనలేదు—ఏదియో యాలోచించుచు కదలక మెదలక రాతి విగ్రహమువలె నుండెను—అతని కనులకు నిద్ర లేదు, రెప్ప-పాటు లేదు, అశ్రువులు లేవు, దృష్టి లేదు—కేవల మేదియో యాలోచనతప్ప మఱియేమియు నతనిలో గానరాలేదు. ఉద-యుఁడు పడవనెక్కెను, పడవలోనుండి ముఖముచాచి నీటి వైపుచూచుచున్నాఁడు, పడవ నడుచుచున్నది, తెడ్లశబ్దము వినఁబడుచున్నది, నీళ్లకలకల చెవిని బడుచున్నది,—ఐనను, నేమియు నతనికి వినఁబడ లేదు, ఏమియు నతనికిఁ గనఁబడ లేదు; ఏమియో యాలోచించుచున్నాఁడు. రాత్రియైనది, ఆకాశము నక్షత్రములతో నిండినది, పడవను కట్టిపెట్టి పడవవాండ్రందఱును నిద్రించుచున్నారు. నీటిశబ్దముమాత్రము వినఁబడు-చున్నది, చిన్నచిన్న అలలువచ్చి పడవకుఁ దగులుచున్నవి ఎదుటను బహుదూరమువఱకు వ్యాపించియున్న తెల్లని యిసుకదిబ్బలవైపు తదేకదృష్టిగ నుదయుఁడు చూచుచు నేదియో యాలోచించుచున్నాఁడు.

తెల్లవారుజామున పడవవాండ్రు లేచి, పడవను విప్పిరి. చల్లనిగాలి వీచుచున్నది, తూర్పుదిక్కున నరుణరాగము కనఁబడుచున్నది, యువరాజేదియో యాలోచించుచున్నాఁడు.

మూఁడవనాఁడు ఉదయాదిత్యుని కనులవెంట బొటబొట నీరుకారుట మొదలుపెట్టినవి; ఆయన ముఖమును జేతులపై నానుకొని నీటివైపు చూచుచున్నాఁడు, ఉండియుండి యాకాశమువైపు చూచుచున్నాఁడు. పడవ నడచుచున్నది. ఒడ్డుననుండు చెట్లు కన్నులయెదుట మేఘములవలె పరుగెత్తి పోవుచున్నవి, ఉదయుని నేత్రములనుండి యశ్రువులు సహస్రధారలై కారుచున్నవి.

చాలసేపైనతరువాత సమయముచూచుకొని ముక్తియార్ ఖాన్ మిగుల దుఃఖితుఁడగుచు యువరాజునొద్దకు వచ్చి, అతివినయముతో, "ఏమాలోచించుచున్నారు యువరాజా!" అని యడిగెను. యువరాజులికిపడి, నిశ్చేష్టుఁడై ముక్తియార్ వైపు చూడసాగెను. కొంతసేపట్లు చూడఁగా వానిముఖమునఁ గొంత జాలియున్నదని తోఁచి యువరాజిట్లనెను.

"భూమిపై జన్మమెత్తి నేను జేసినమహాకార్యమేమి, అని యాలోచించుచున్నాను ముక్తియార్! నావలన నెంత ప్రమాదము సంభవించినది! ఆహా, పరమేశ్వరా! బలములేనివారీలోకములో నేలపుట్టిరో కదా! తమస్వశక్తివలన నీలోకములో బ్రతికియుండలేక, అడుగడుగునకు నితరుల

సహాయముపై నాధారపడునట్టివారివలన నీపృథ్వికి జరుగు నుపకారమేమి? అట్టివా రెవరిని యంటిపెట్టుకొని బ్రతుకఁ గోరుచుందురో వారినే ముంచివేయుదురు, ప్రతికార్యమున-కును నడ్డుపడుచుందురు, తమంతట తాము నిలుచుండలేరు, ఇతరులనెత్తిపై బరువై కూర్చుందురు.—నేను బలహీనుఁడను వీరికి పెద్దన్నను భగవంతుఁడు నన్నే ప్రాణముతో నుంచి, ఈ ప్రపంచమున కానందమగువానిని, ఈలోకమున నెవ్వరి-కైనను సహాయముచేయఁగలవానిని, నాకొఱకై చంపివేసెను. నాకిఁక నేమియు నక్కఱలేదు తండ్రీ, నే నీలోకమునుండి సెలవు పుచ్చుకొనెదను.

ఉదయాదిత్యుని ఖైదీవలెఁ దీసికొనివచ్చి ప్రతాపా-దిత్యు నెదుట నిలుచుండఁబెట్టిరి. ప్రతాపుఁ డతనిని అంతఃపుర-మున నొకగదిలోనికి గొనిపోయెను, తలుపుకు గడియపెట్టి, ప్రతాపుఁ డుదయునిదగ్గఱకు రాఁగానే ఉదయునిశరీరమున గగుర్పాటుపుట్టినది, అతనికి పట్టరానియసహ్యము కలిగినది. అతనికి దేహమంతయు ముడుచుకొని పోవుచున్నట్లుండెను, అతఁడు తండ్రిముఖమువైపు చూడలేకుండెను.

"నీకుఁ దగినశిక్ష యేమి?" అని నిశ్చలభావముతోఁ దండ్రి యడిగెను.

"తమ రాజ్ఞాపించునదే!" అని అతిశాంతముగ నుదయుఁ డుత్తరమిచ్చెను.

ప్రతాపుఁడు—"నా రాజ్యమున కర్హుండవు కావు నీవు!"

ఉదయుఁడు "కాను మహారాజా, తమరాజ్యమునకుఁ దగినయోగ్యత నాకులేదు. తమరాజ్యము నాకక్కఱలేదు. తమసింహాసనమునుండి నన్ను విముక్తునిఁజేయుఁడు—ఇదియే నాప్రార్థన"

ప్రతాపుఁడు కోరునదికూడ నదియే—కావున "నీ వన్నది నిజముగా నీమనస్సున నుండుకోరిక యని నాకుఁ దెలియు టెట్లు?" అని యడిగెను.

ఉదయాదిత్యుఁడు—"నేను బలహీనుఁడనై జన్మ-మొందితిని నిజమే, కాని నేటివఱకు స్వలాభమునకై యెన్నఁ-డును నొక్కయబద్ధమైన నాడలేదు. తమకు నామాటయందు నమ్మకము లేనిచో కాళిగుడికిపోయి తల్లిచరణములు ముట్టు-కొని శపథముచేసెదను—నాకు తమరాజ్యమున సూదిమొన-యంత భూమియైన నక్కఱలేదు తమరాజ్యమున నుత్తరాధి-కారి సమరాదిత్యుఁడే!"

"అట్లైన నీవు కోరున దేమి?"

"నేనుకోరునది మఱియేమియు లేదు మహారాజా—నన్ను కేవలము దొడ్డిలో పెట్టియుంచిన పశువువలె ఇనుప కమ్ములనడుమ ఖైదీగా నుంపకుఁడు. నన్ను విడిచిపెట్టుఁడు, నేనిప్పుడే కాశికిఁబోయెద ఇదికాక నాప్రార్థన మఱియొకటి యున్నది—నాకుఁ గొంచెము డబ్బిచ్చిన నేను కాశిలో తాతయ్యపేర నొకయతిథిశాలయును, ఒకదేవాలయమును కట్టించెదను."

ప్రతాపుఁడు—"దానికి నేను సమ్మతించెదను."

ఆనాఁడే ఉదయుఁడు కాళీమందిరమునకుఁబోయి ప్రతాపాదిత్యునిసముఖమున నిట్లు శపథముచేసెను—"తల్లీ, కాళీ, నీపాదములుముట్టుకొని శపథముచేయుచున్నాను, నీవు నాకు సాక్షివి. నేను బ్రతికియున్నన్నాళ్లెన్నఁడును యశోహరమున రవంతమేరయైనను నాది యనను. యశోహరసింహాసనమున నేను గూర్చుండను, యశోహర రాజదండము నేనుస్పృశింపను, అట్లున్నఁడైన నేను చేయఁగోరినచో తాతయ్య హత్యాపాపము నా మెడను చుట్టుకొనును గాక!" ఈమాటలనఁగానే ఉదయుని దేహమున పులకరింపు పుట్టినది

ఉదయుఁడు కాశికిఁబోవుచున్నాఁడని వినినతోడనే రాణి కొడుకునొద్దకువచ్చి, "నాయనా ఉదయా, నన్నుఁగూడ నీతో కాశికి తీసికొనిపొమ్ము" అనెను.

ఉదయాదిత్యుఁడు—అట్లంటవేమమ్మా! నీకు సమరాదిత్యుఁడున్నాఁడు, నీసంసారమంతయు నిక్కడనే యున్నది. నీ విక్కడనుండి వెడలిపోయినయెడల యశోహరరాజ్యలక్ష్మి కూడ నాక్షణమే యంతర్ధానమగును

రాణి—"నీ వింతచిన్నవయస్సున సంసారమువిడిచి వెళ్లిపోవుచున్నప్పుడు నే నేమనస్సుతో నివియన్నియు ననుభవించుచు నుండఁగలను. నీవు రాజ్యము సంసారము వదలి సన్యాసివై వెడలిపోవుచున్నావు, అక్కడ నీకు సంరక్షణ చేయువారెవరు నాయనా? మీతండ్రిమనస్సు ఱాయి, అట్లని నన్నుకూడ నిన్ను విడచియుండుమనిన నేనెట్లుండఁగలను?"

రాణికి బిడ్డలలో నందరికంటెను ఉదయునియెడల నధికానురాగము, ఉదయునిమాట తలంచుకొని గుండె బ్రద్దలైన ట్లేడ్వసాగెను.

ఉదయుండు కంటనీరు పెట్టుకొనుచు తల్లి చేయిపట్టుకొని "అమ్మా నీవెఱుంగుదువు, ఇక్కడనుండినయెడల నేను అడుగడుగునకు భయపడుచుండవలసియుండును, కనుక నే నిక్కడనుండి వెళ్ళి, ఎట్టియాపదయు భయమును లేక విశ్వేశ్వరుని చరణములకడ యుందును, నీవు దుఃఖింపకుమమ్మా" అని యనెను.

ఉదయుండు విభయొద్దకుంబోయి ఇట్లనెను—"నేను కాశికిపోకమునుపు నిన్ను సుఖవంతురాలుగఁజేసి పోవలెనని యున్నది చెల్లీ. నిన్ను నేనే స్వయముగ తీసికొనిపోయి మీ యత్తవారియింట దిగఁబెట్టిపోయెద—ఇదియొక్కటే నాకోరిక!"

"తాతయ్య క్షేమముగా?" అని విభ యడిగినది.

"తాతయ్య క్షేమముగా నున్నాఁడు" అని యనుచు నుదయుండు తత్క్షణమే అచ్చటనుండి వెళ్ళిపోయెను.



## ముప్పది యైదవ పరిచ్ఛేదము.

విభయు నుదయాదిత్యుడును బ్రయాణమగుచున్నారు. విభ తల్లిని గట్టిగా కౌఁగిలించుకొని యేడ్చుచున్నది. అంతః-పురమున నెక్కడెక్కడ నున్నవారందఱునువచ్చి అత్తవారి యింటికిఁ బోవుచున్న విభను జూచి నానావిధములైన యుప-దేశము లీయసాగిరి.

తల్లి యుదయుని లోనికిఁబిలిచి "నాయనా చెల్లెలను తీసికొనివెళ్లుచున్నావుగాని వారు విభ నాదరింపక కష్టపెట్టెద-రేమో!"

ఉదయుఁ డులికిపడి, "కష్టపెట్టెదరేల అమ్మా? ఏల యాదరింపరు!" అని యడిగెను.

రాణి—"వారికి విభపైఁ గోపము వచ్చినదేమో!"

ఉదయుఁడు—"లేదమ్మా, ఎంతమాత్ర మట్లు కానేరదు. విభ చిన్నపిల్ల. దానిపై నెవరు కోపముంచుకొనఁగలరమ్మా?"

రాణి—"జాగ్రత్తగ నాలోచించి తీసికొనివెళ్లుము నాయనా, వారామెయెడల నిర్దయులై యున్నయెడల, విభ మఱి బ్రతుకదు.

ఈమాటలు ఉదయాదిత్యునిమనస్సునభయముపుట్టించినవి. ఎవరైన విభను కష్టపెట్టఁగలరన్న మాట ఇంతకుముం చెన్నఁడు నుదయునకు దట్టలేదు. ఉదయుఁడు తనప్రాయశ్చిత్తము పూర్తి

తీఱిపోయినదని యనుకొనుచుండెను, కాని యది యింకను పూర్తికాలేదని యతని కిప్పుడు తెలియుచున్నది. విభను తా నాశ్రయము చేసికొనియుండెను, దీనికి ఫలస్వరూపముగ విభ యదృష్టమున నేమున్నదో కదా!

బయలుదేరిపోవుసమయాన ఇద్దఱును తల్లిదగ్గఱకువచ్చి ప్రణామము చేసిరి. ప్రయాణమునకు విఘ్నములగునేమో యని తల్లికంట నీరు రానీయలేదు, వారు గడపదాటఁగానే ఆమె నేలఁబడి దొరలుచు నేడ్వ నారంభించినది. ఉదయుఁడును విభయు తండ్రికి ప్రణామము చేసిరి, ఇంటనుండు పెద్దలందరకు ప్రణామము చేసిరి. ఉదయుఁడు సమరాదిత్యుని నెత్తుకొని ముద్దుపెట్టుకొని "నీవు సింహాసనమున కూర్చుండఁబోవు-చున్నావుగాని పాపలేశము నిన్ను తాకకపోవును గాక!" అని మనసులో తాను తలఁచుకొని దీవించెను అక్కడనుండు నౌకర్లు—అందఱకును సమరాదిత్యునియెడల చాల నను-రాగము, వారందఱొక్కొక్కరువచ్చి ఉదయునకు ప్రణామము-చేసి ఏడ్వసాగిరి. చివరకు వారిద్దఱును ఆలయమునకుఁబోయి తల్లికి మ్రొక్కి బయలుదేరిరి.

శోకము, విపత్తు, దౌర్జన్యము-వీనికి రంగస్థలమగు ప్రదేశము వెనుకపడుచున్నది, కారాగారము వెనుకనుండిపోయినది. జన్మమున్నంతవఱకు కెన్నఁడును ఈయింటికి మఱల రానని ఉదయుఁడు తనలోఁదాను నిశ్చయించుకొనెను వెనుకకొక్కమాఱు తిరిగి చూచెను-రక్తపిపాసతో నిండియుండు రాజభవనము దైత్యుని

వలె తలయెత్తుకొని నిలిచియున్నది, దానిలోనున్నది పాషాణ హృదయము కుట్ర నిరంకుశాధిపత్యము, రక్తలాలస దుష్ట-లులను పీడించుట, అసహాయుల నేడ్పించుట—ఇవియన్నియు వెనుకనుండిపోయినవి—ముందు ముందు అనంతస్వాధీనత, ప్రకృతియందుండు సకలంకసౌందర్యము, మానవహృదయ-ముననుండు స్వాభావికకోమలత, ప్రేమ—ఇవియన్నియు నతని నాలింగనము చేయఁగోరి చేతులు చాచుచున్నవి. అప్పుడే ప్రాతఃకాలమైనది. నది తూర్పుగట్టునుండు వనమధ్యమునుండి సూర్యకిరణములు పొడుచుకొనివచ్చుచున్నవి; పర్వతశిఖరము-లపై ఆప్రాతఃకాలపు సువర్ణకాంతిపడుచున్నది. గ్రామవాసులు లేచి తమతమ పనులపై నిటునటు పోవుచున్నారు. పడవవాండ్రు ఉల్లాసముతో పాటలుపాడుచు, పడవనువిప్పి తెరచాప నెత్తిరి. ప్రకృతియొక్క ఈ విమల, ప్రశాంత, పవిత్ర, ప్రభాత-ముఖశ్రీ గని ఉదయునిహృదయము పక్షులతోఁ గలసి స్వేచ్ఛాగానము సలుప ప్రారంభించినది. "జన్మజన్మములకు స్వతంత్రుఁడనై నీప్రకృతియొక్క పవిత్రతలోను నవీనతలోను విహరించుచుండఁ గలభాగ్యమే నేనుకోరుచున్నది," అని ఉదయుఁడు తనలో దానుకొనుచున్నాఁడు

పడవ నడచుచున్నది. పడవవాండ్ర పాటలును, నీటి కిలకిలను వినుచు నిద్దఱును ప్రయాణము చేయుచున్నారు. ఉషఃకాంతివలె నానందము విభ హృదయమును వ్యాపించు చున్నది, అరుణదీప్తితో కన్నులును ముఖమును నిండుచున్నవి.

ఇన్నాళ్లకు విభ, దుఃస్వప్నము చెదరి తెలివివచ్చినదానివలె, కనఁబడుచున్నది.

విభ ప్రయాణమైపోవుచున్నది. ఎవనియొద్దకు బోవుచున్నది? ఎవరామెనుబిలుచుచున్నారు! అనంతప్రేమ ఆమెను బిలుచుచున్నది. పక్షిపిల్లవలె నామె రెక్కలుముడుచుకొని ఆయనంతప్రేమలో నే చింతయు లేక సుఖముగా నుండును. ఎటుచూచినను విభకు నేఁడు కనఁబడునది ప్రేమసముద్రమే! విభను దగ్గఱఁ గూర్చుండఁబెట్టుకొని ఉదయుఁడు నీటికలకలవంటి మృదుస్వరముతో నెన్నియో కథ లామెకు చెప్పుచున్నాఁడు, ఏది వినిన నదియే ఆనందదాయకముగ నున్నది, విభకు.

పడవ రామచంద్రరాయల రాజ్యమునఁ బ్రవేశించి ప్రయాణము చేయుచున్నది. పలుదిక్కులను జూచుచుండు విభ మనస్సున నెన్నఁడు ననుభవింపని యానంద ముదయించుచున్నది. ఎటువైపు చూచినను ఏమియాశోభ! నదీతీరములును, మనుష్యులును విభకంటఁబడుచుండ వారందఱు నెంతయో సుఖముగ నున్నారని యామెను తోచుచున్నది. కనఁబడువారిని పిలిచి రాజుగారిని గుఱించి యడుగవలెనని విభకుఁ గోరికపుట్టుచున్నది. ఆ రాజ్యపుప్రజలు కనఁబడగానే ఆమె మనస్సున నపూర్వమగు ప్రేమభావ మొకటి పుట్టుచున్నది, కనఁబడువారందఱు కడుమంచివారని ఆమెను తోచుచున్నది. నిరుపేదలవలె నుండినవాండ్రు ముష్టివాండ్రు. అక్కడక్కడ

కనఁబడుచున్నారు. విభ వాండ్రనుజూచి "పాపము వాండ్రకీదశ యేలరాకదా!" అనుకొనుచు విచారించుచుండును; "నేనంతఃపురములోనికిబోయి వీండ్ర రప్పించెదను, వీండ్రదుఃఖము తొలఁగు నేర్పాట్లు చేయించెదను," అని తనలో తా ననుకొనుచుండును. ఆమెకు వాండ్రందఱును తనవారని తోఁచుచున్నది. ఆ రాజ్యమున దారిద్ర్యముగాని దుఃఖముగాని యుండుట చూచి యామె సహింపలేకున్నది. ఆ రాజ్యపుప్రజ లామెకడకు వచ్చి ఆమెను, "అమ్మా" అని పిలువవలెనని యామెకు కోరిక పుట్టుచున్నది. వారు తమతమకష్టములను నామెతో చెప్పుకొనిన నామె వానినన్నిటిని తొలఁగించును

రాజధానికి సమీపముననున్న గ్రామమున నుదయుఁడు పడవను నిలిపెను. తమ రాకను దెలియఁజేయుచు మనుష్యు నొకనిని రాజప్రాసాదమునకుఁ బంపినచో వారుచితమర్యాదలను జేసి రాజప్రాసాదమునకు తమ్ముఁ గొనిపోదురని ఉదయుని నమ్మకము. పడవ నాపునప్పటికి సాయంకాలమైపోయినది, మఱునాఁ డుదయమే సమాచారము తెలియఁజేయవలెనని ఉదయుఁడు నిశ్చయించుకొనెను.



## ముప్పది యారవ పరిచ్ఛేదము.

మనుష్యులందఱు నానాఁడు తొందరపనిమీఁద నిటునటు తిరుగుచున్నట్లు కనఁబడుచుండెను. బాజాబజంత్రీలతో యూర నేదియో యుత్సవముజరుగుచున్న ట్లుండెను. విభలోఁ బుట్టుచున్న యానందము ఆవాద్యములు వినఁగానే పొంగి పైకి వచ్చుచుండెను. ఈయానందము అన్నయ్యకడ బయలుపడు-నేమోయని ఎంతో ప్రయత్నము చేసి నవ్వును గూడ నాపుకొను-చుండెను ఉత్సవచిహ్నములుచూచి సమాచార మేమియో కనుఁగొనవలెనని ఉదయుఁడు నదియొడ్డున నడచుచు యూరి-లోనికి బయలుదేరెను.

కొంతసేపైనతరువాత ఒడ్డునుండి యెవఁడో, "ఎవరి దాపడవ?" అని యడిగెను. రాజభటుఁడు పడవమీఁదనుండి వానినిజూచి "ఎవరది, రామమోహనుఁడా? రమ్ము, రమ్ము!" అనెను. రామమోహనుఁడు తొందరతొందరగ పడవలోనికి వచ్చెను. విభ యొకతెయే పడవలో గూర్చుండియుండెను, వానిని జూచినతోడనే సంతోష మామెలోపలినుండి పొంగి పొరలివచ్చినది; పట్టలేనియానందముతో "మోహన్" అని యామె యన్నది.

రామమోహనుఁడు—"అమ్మా!"

నవ్వుచు ఆనందముతోఁ బరిపూర్ణతపొందిన విభముఖ-మును చూచుచు చాలసేపట్లు నిలిచియుండి చివరకు మోహ-నుఁడు, "నీవు వచ్చితివా తల్లీ!" అని యనెను.

"వచ్చితిని మోహన్! ఇంతలో మహారాజు వారికి నా రాకమాట తెలిసినదా? నీవు నన్నుఁదీసికొనిపోవుటకు వచ్చి-తివా?" అని విభ యడిగెను.

"అంత తొందరపడకుమమ్మా, నేఁడు కాదు మఱియొక-నాఁడు నిన్ను కొనిపోయెదను," అని మోహనుఁ డనెను.

రామమోహానునిధోరణివలన విభముఖము హఠాత్తుగ వాడిపోయినది. "నేఁడేల పోఁగూడదు మోహన్?" అని ఆమె యడిగెను.

మోహనుఁడు— "నేఁడు ప్రొద్దుపోయినది, నేఁడు పోవద్దమ్మా!"

"ఏమిజరిగినది మోహన్ నిజముగా చెప్పుము," అని మిక్కిలి భయపడుచు విభ యడిగినది.

మోహనుఁ దూరకుండ లేకపోయెను— దాఁచియుం-చుకొను స్వభావము కాదు వానిది. ఏడ్చుచు వాఁడక్కడనే చతికిలఁబడిపోయి యిట్లనెను—"నీ రాజ్యములో నేఁడు నీకు స్థానము లేదమ్మా! నీ రాజప్రాసాదమున నీకిల్లు లేదు తల్లీ! రాజు-గారికి నేఁడు వివాహము!"

విభముఖమున రక్తము లేదు, కాళ్లుచేతులు చల్లఁబడిపో-యినవి. రామమోహనుఁ డేడ్చుచు ఉండియుండి మాటలాడు-చుండెను—"నీబిడ్డఁ డీయధముఁడు నిన్ను బిలువవచ్చినప్పుడు

నీ వేలవచ్చితివి కావుతల్లీ? అప్పుడు నీమనస్సు బాయిర్తై యుండెను, నీవు నన్ను తిరుగఁగొట్టితివి. రాజుగారికి నాముఖము చూపింపలేకపోతిని, నాగుండె బ్రద్దలైపోయినది. ఐనను, నీవు నాతల్లివి. నీకు విరుద్ధముగ నొక్కమాటయైనను చెప్పలేకపోతిని.

విభ తెలివితప్పి పడిపోయినది రామమోహనుఁడు పరుగెత్తుకొనిపోయి నీళ్లు తెచ్చి ముఖముపైఁ జల్లెను కొంత-సేపటికి తెలివివచ్చి విభ లేచి కూర్చుండినది. ఒక్కదెబ్బతో నామె ప్రపంచమంతయు ముక్కలై పడిపోయినది. భర్త-రాజ్యముచేరి, భర్తరాజధానిలో బ్రవేశించి తృషార్తహృద-యముతో రాజద్వారమునకువచ్చి నిలిచియుండువేళకు ఆమె యాశయంతయు మరీచికవలె మాయమైపోయినది.

"మోహన్, ఆయన నన్నురమ్మని కబురుపంపిరే, నేను చాల నాలస్యముచేసితినా?" అని దుఃఖముతో విభయడిగెను.

"ఆలస్యమైనది, సందేహమేమి తల్లీ!"

"నన్ను మఱిక్షమింపరా?" అని కలతజెందుచు నడిగి-నది విభ.

"క్షమించుటేది మఱి" అని మోహనుఁడనెను.

"నే నాయన నొకమాఱుచూచిమాత్రము వచ్చెదను మోహన్?" అని అనుచు విభ వెక్కివెక్కి యేడ్వసాగెను.

"నేఁడు వద్దుతల్లీ!" అనుచు మోహనుఁడు కనులు తుడుచుకొనసాగెను.

"లేదు మోహన్, నేను నేఁడే ఒక్కమాఱు చూచి వచ్చెదను."

"యువరాజు మొదట గ్రామమునుండి తిరిగిరానిమ్ము."

"లేదు మోహాన్ నేనిప్పుడే ఒకమాఱు వెళ్లివచ్చెద". ఉదయాదిత్యుఁ డిది వినినచో చెల్లెల కవమాన మగునని భయపడి ఆమెను బోనీయఁడేమో యని విభ యోచించెను.

"అట్లైన నొకపల్లకీ తెప్పించెద నుండుమమ్మా," అని మోహానుఁ డనెను.

"పల్లకీ యేల? నేను రాణినైనఁగదా పల్లకీ అవసర మగుటకు? నే నొకసామాన్యస్త్రీవలె వెళ్లెదను, ఒకబిచ్చపు- దానివలె పోయెదను—నాకు పల్లకీ యవసరము లేదు." అని విభ యన్నది.

"నాలో ప్రాణ మున్నంతసేపు నే నట్టిదిచూచి భరింప- లేనమ్మా," అన్నాఁడు మోహానుఁడు.

విభ మిక్కిలి జాలిపుట్టించు స్వరముతో "నీకాళ్లు పట్టుకొనెదను నా కడ్డు రాకు మోహాన్, ఆలస్యమైపోవు చున్నది," అని వానిని వేడుకొనెను.

"అట్లే కానిమ్మమ్మా!" అనుచు మోహానుఁడు దుఃఖ- ముతో నొప్పుకొనెను

విభ సామాన్యస్త్రీ వేషముతో పడవనెక్కినది. పడవవాం డ్రదిచూచి ఆశ్చర్యపడుచు "ఇదియేమి మహారాణీ! యిట్టి దుస్తులతో నెక్కడికి పోవుచున్నావమ్మా?" అని యడిగిరి

"ఈ రాజ్యము తల్లిదే! తన రాజ్యములో ఎచ్చటికైనను, ఏ వేషముతోనైనను పోవచ్చునుకదా!" అని మోహానుఁ డుత్తరమిచ్చెను.

భృత్యు లడ్డుపెట్టుచుండిరిగాని మోహానుఁడు వాండ్ర నందఱను దరుమఁగొట్టెను.

# ముప్పది యేడవ పరిచ్ఛేదము.

ఎటుచూచినను జనసమూహము! ఇంతకుముం దెన్నఁడైన నిట్టిది జరుగకపోను, విభ అందఱియెదుట నట్లు కనఁబడవలసినచో సిగ్గువలన ప్రాణములను విడిచియుండును, కాని నేఁడామెకంటి కేదియు గానరాకున్నది ఏకాంచె నామె కనుల కగపడుచుండెనో అది యామెకు మిథ్య యనిపించుచుండెను: నాలుగువైపులను గనఁబడుచుండు కోలాహలమయమగు జనసమ్మర్దము స్వప్నదృశ్యమని ఆమెకు తోచుచుండెను, కనఁబడునదెల్ల శూన్యము! నాలుగువైపులను జనులమూక, అన్నివైపులను కలరవము—అంతే! దేనికిని నెట్టియర్థమును లేదు.

ఆజనసమూహములోనుండి త్రోసికొని విభ రాజద్వారముకడవచ్చి చేరుకొనెను. అక్కడి ద్వారపాలకుఁ డొకఁడు ఆమెను జేయిఁబట్టుకొని బయటికి త్రోసివేయుగా నామె వెనుకనుండుమనుష్యులమీఁద బడిపోయినది; సిగ్గువలన సగము ప్రాణములుపోయినవి, ముసుఁగు జారిపోయినది, ఆముసుగు నామె తత్క్షణమే మరల మీఁదికి లాగుకొనినది. ముందునకు బోవుచుండు రామమోహనుఁడు వెనుకకుఁ దిరిగిచూచెను; రెప్పపాటులో నంతయు తెలిసికొని యతఁడు ద్వారపాలకునివైపు కండ్లెఱ్ఱఁజేసి చూచెను. ఆసమీపమున నిలుచియున్న ఫర్నాండజ్ అచ్చటికివచ్చి వానికిఁ దగినకట్న మిచ్చెను.. విభ

యితరదాసీదాసులవలె ప్రాసాదమునఁ బ్రవేశించినది—ఎవ్వ-
రును నామెకు తగినమర్యాద చేయలేదు.

ఒకగదిలో రాజుగారును రమాయియు గూర్చుండి యుండిరి. విభ ఆగదిలోఁ బ్రవేశించి రాజుముఖముచూచి ఆయనపాదములకడ నేలపైఁబడెను. రాజు తడఁబడుచు నిలిచి "ఎవరే నీవు? బిచ్చపుదానవా—బిచ్చముకావలెనా నీకు?" అని యడిగెను.

విభ వాల్చియున్నముఖమునెత్తి, అశ్రుపూర్ణనేత్రములతో "లేదు, మహారాజా, నాసర్వమును దానముచేయుటకు నేనువచ్చితిని, నిన్ను పరహస్తముల కొప్పఁజెప్పి సెలవు తీసికొనిపోవలెనని వచ్చితిని," అని యనెను.

రామమోహనుఁ డనిభరించి యూరకుండలేక దగ్గఱకు వచ్చి, "ఆమె మీరాణి మహారాజా, యశోహారపుర రాజ-కుమారియామె! అనెను.

నిద్రానిమగ్నమై రామచంద్రునిలో నున్నమన స్సులికి-పడిలేచినది—కాని రమాయి తత్క్షణమే నవ్వి రామచంద్రుని-వంక జూచుచు, "ఏమిది, అన్నగారు మఱీ యక్కఱలేదా?" అని అతికఠోరస్వరముతో నడిగెను

రామచంద్రునిహృదయమున కొంచెముదయ పుట్టు-చుండెను. ఐనను రమాయి మాటవినఁగానే అతినిర్దయునివలె నవ్వసాగెను—విభ కిప్పుడు దయచూపినచో నలుగురును తన్నుఁజూచి నవ్వుదురని ఆయనకు భయమైనది.

విభ నెత్తిపై పిడుగుపడినది, ఆమె కండ్లుమూసికొని తల్లీ, వసుంధరా, నీవు రెండుభాగములై నన్ను నీగర్భమందు దాచుకొనుము, "అని తనలోఁదాను బ్రార్థించినది, కనులు తెరచి నాలుగువైపులను జూచినది, అసహాయురాలగు నామె రామమోహానునికనులపడినది.

రామమోహానుఁ డాక్షణమే రమాయియొద్దకుఁ బరుగెత్తికొనిపోయి వానిని మెడపట్టి బయటికి గెంటెను.

నాయెదుటనే నింతదౌర్జన్యము, ఇంతసాహసము చూపించుచున్నావు!" అని రాజుగారు కోపముతో ననిరి.

"ఔను మహారాజా, నేను దౌర్జన్యము కనపరచితిని మీ రాణిని నాతల్లిని అతఁ డవమానించినాఁడు—వాని తల గొరిగించి సున్నముబొట్లుపెట్టి ఊరేగించి వానిని యూరినుండి వెడలగొట్టకపోయినయెడల నాపేరు రామమోహాన్ కాదు మహారాజా!" అన్నాఁడు మోహాన్.

రామచంద్రుఁడు మోహానునదల్చుచు "ఎవరు నా రాణి, ఈమె యెవరో నేనెఱుఁగను!" అని యనెను.

విభాముఖము నల్లనైపోయినది, ఆమె వణఁకుచు నోట చీరచెంగు క్రుక్కుకొన్నది, మతితప్పి నేలఁబడినది.

విభకు తెలివిరాఁగానే రామమోహానుఁడు చేతులు జోడించి రాజుగారితో నిట్లనెను—"మహారాజా, ఇప్పటికి నాలుగుతరములఁబట్టి మేము మీ సేవచేయుచున్నాము. చిన్నప్పుడు నిన్నెత్తుకొనుచుంటిని, సంరక్షణచేసితిని. నేడు

నాతల్లిని, మహాలక్ష్మిని, నీవవమానపరచితివి, నీ భాగ్యలక్ష్మినితఁగ మగొట్టితివి. నేఁడు నేనుఁగూడ నీచాకిరీ విడిచిపోవుచున్నాను. మాతల్లి సేవచేయుచు కాలము గడుపుకొనెదను; బిచ్చమెత్తుకొని కాలక్షేపముచేసెదనుగాని నీయింటినీడనైనను మఱి త్రొక్కను.'' ఇట్లనుచు రామచంద్రునకుఁ బ్రణామముచేసి విభతో ''అమ్మా ఇంకరమ్ము! తత్క్షణమే బయలుదేరిపోదము; ఇక్కడ నింక నొక్కనిమిషమైన నుండరాదు,'' అనెను. అని విభను బట్టుకొని బయటికి తీసికొనివచ్చెను. విభకు మతిపోయినట్లైనది. బయటనుండు పల్లకీలలో నొకదానిలో విభను గూర్చుండఁబెట్టి మోహనుఁడామెను పడవయొద్దకు తీసికొని వచ్చెను.

విభ ఉదయాదిత్యునితోఁగలసి కాశికి వెళ్లిపోయినది. అక్కడ దానధ్యానములు చేయుచు దేవసేవచేయుచు, భ్రాతృసేవచేయుచు కాలము గడపుచుండెను. బ్రతికియున్నంతకాలము రామమోహనుఁడు వారితోఁ గలసియే యుండెను. సీతారాముఁడుకూడ సపరివారముగ కాశికివచ్చి ఉదయునాశ్రమముననే యుండెను.

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1930.